ముక్తేవి లక్ష్మణరావు ✻ డా॥ ముక్తేవి భారతి

# భారతంలో ప్రేమ కథలు



# భారతంలో ప్రేమకథలు

యువభారతి రజతోత్సవ ప్రచురణ

ముక్తేవి లక్ష్మణరావు
డాక్టర్ ముక్తేవి భారతి




యువ భారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001.

BHARATHAMLO PREMAKATHALU :
by Sri Muktevi Laxshmana Rao & Smt. Dr. Muktevi Bharathi



Silver Jubilee Publication (under self financing scheme)
Publication No. 188

First Edition : 5th May 1991

Copies : 1000

**Price : Rs. 30.00**

Cover Design : Sri Bapu

Inner Pictures : Sri Chandra

---

Published with the financial assistance provided by
Tirupathi Tirumala Devasthanam, Tirupathi

---

Published by :

**YUVA BHARATHI,**
Literary & Cultural Organisation,
Andhra Saraswatha Parishad Buildings,
Tilak Road, Hyderabad-500 001.

Printed at :

**Padmavathi Art Printers,**
New Bakaram, Gandhinagar,
Hyderabad-500 380. Phone : 68413.




# యువభారతి
# రజతోత్సవ సాహితి

యువభారతి 1966లో విజయదశమినాడు ఆవిర్భవించింది. దాదాపు దెబ్బైమంది యువభారతీయుల సమైక్య సంఘటిత స్నేహశక్తి యువభారతి. సేవాభావంతో సమాజంలో ఉత్తమ సాహిత్య రసికత్వాన్ని కల్పించే సాత్త్విక చైతన్యాన్ని ఉద్యమ స్ఫూర్తితో కల్పించటం యువభారతి లక్ష్యం. ఈ ఇరవైయేదేళ్ళుగా యువభారతి సాహిత్యంమీద సమాజంలో ఉత్తమ విలువలు పెంపొందించింది. సహృదయ స్పందనను కలిగించేకార్యక్రమాలను చేపట్టింది. ప్రజలకు దగ్గరగా ప్రవహించే సాహిత్యాన్ని ప్రచురించింది. తెలుగువారి హృదయాలలో ఒక మరపురాని మమకారాన్ని పదిలంగా నిలుపుకొన్నది. 1990 విజయదశమి నుండి 1991 విజయదశమివరకు రజతోత్సవ కార్యక్రమాలను సముచితంగా రూపొందించుకొంటున్నది. ప్రజలనడుమ వెండి పండుగ వేడుకలు జరుపుకొనే ముచ్చటతో ముందుకు నడుస్తున్నది.

రజతోత్సవాల కాలంలో విలువైన 25 రచనలను ప్రచురించాలని యువభారతి లక్షించింది ఇప్పటికే పదింటిని ప్రజలముందుంచింది. ప్రతినెలా మొదటి ఆదివారం సాయంకాలం 'సమాలోచనం' కార్యక్రమం నిర్వహిస్తున్నది. ఆచార్య సి. నారాయణరెడ్డిగారిచేత ప్రజా చైతన్యం కలిగించే అంశాలమీద జనరంజక ఉపన్యాసాలను నిర్వహించనున్నది. విలువైన రజతోత్సవ సంచికను ప్రచురించే యత్నం సాగిస్తున్నది.

యువభారతి రజతోత్సవ సభ్యులుగా చేరండని అందరినీ అహ్వానిస్తున్నాం. 1991లో నూరు రూపాయలు చెల్లించి, 1995 చివరిదాకా యువభారతి ప్రచురణలపై 40 శాతం తగ్గింపు పొందవచ్చు. వారికి రజతోత్సవ సంచిక ఉచితం. రచయిత(త్రు)ల రచనలను 'సెల్ఫ్ ఫైనాన్సింగ్ స్కీమ్' క్రింద యువభారతి ప్రచురించి, విక్రయిస్తుంది. యువభారతి మీ సహాయ సహకారాలను ఆహ్వానిస్తున్నది. రజతోత్సవాలను విజయవంతం చేయటంలో తోడ్పడండి. రజతోత్సవ కానుకగా ఈ ప్రచురణను అందుకోండి.

హైదరాబాద్
5-5-1991

జి. వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు

# ప్రేమించదగిన కథలు

ఈ పుస్తకం పేరు వినగానే నాకోరకమైన ఆశ్చర్యం, ఆసక్తి, ఆనందం కలిగాయి. భారతం వీరకథలకూ, నీతికథలకూ, తత్త్వకథలకూ, ధర్మకథలకూ ప్రసిద్ధికాని భారతంలో ప్రేమకథలకు కూడా బలమైన స్థానం ఉందా అని ఆశ్చర్యం. కవిత్రయ భారతంలోని కథలను ఈ రచయితలు ఎలా మలిచారో తెలుసుకోవాలనే ఆసక్తి. కథను చెప్పటంలో, అనుభూతిని ఆవిష్కరించటంలో రచయితలు చూపిన శైలీ మాధుర్యం చవిగొన్నకొద్దీ ఆనందం. కథ జడలా అల్లబడితే చివర ముడి వేసిన రిబ్బన్ నిర్వహణ.

మరో ముచ్చటైన విశేష మేమంటే - ప్రేమకథలు భార్యాభర్తలు కలసి వ్రాయటం తిరుపతి వెంకటకవులు, వేంకటపార్వతీశ్వరకవులు మొదలైన వారిని 'జంటకవు'లని అంటాం. వారిలో ఏ ఒకరు ఏ భాగం చెప్పినా మొత్తం రచన ఇద్దరిపేర్లమీద ప్రచురించటం పరిపాటి. ఈ సంప్రదాయం కథా రచనలో నిలిపారు శ్రీ ముక్తేవి లక్ష్మణరావుగారూ. డా॥ భారతిగారూ. వీరు జంట రచయితలేగాదు; రచయితలజంట; 'జంట' అనే మాటకు నిండుదనాన్ని తెచ్చిన పంట ఈ కథా వాహిని.

ఈ జంటలో లక్ష్మణరావుగారు ఆడ్వొకేటు, కేవలం కొన్ని వాస్తవాలనూ, కొండగుర్తులనూ బట్టికూడా ఒకే కేసును సృష్టించగలిగిన సృజనాత్మకశక్తి వారికి సహజం. ఆ నేర్పు ఈ కథల్లో బాగా ప్రదర్శిత మయింది. కవిత్రయం వారు ఆవులిస్తే లక్ష్మణరావుగారు పేవులు లెక్కబెట్టిన ఘట్టాలు కొన్ని ఉన్నాయి. ఆవులించనిచోట్ల కూడా లెక్కబెట్టినంత పనిచేసిన చోట్లు మరికొన్ని ఉన్నాయి. జీవిత సన్నివేశాల వెనుక లోతుగా సాగే హృదయమథనాన్ని వాఙ్మయ ధారగా రూపొందించారు; కథా జీవితంగా వినిర్మించారు.

భారతిగారు వృత్తిరీత్యా, ప్రవృత్తిరీత్యా ఉపన్యాసకురాలు, కథారచయిత్రి. ఆమె వివరించగలదు; వ్యాఖ్యానించగలదు; వివేకించగలదు. లక్ష్మణరావుగారు వస్తువులను ఎన్నుకొని తేగలవారు; వారి ఎన్నికను మన్నిక కలిగే పద్ధతిలో రమ్యంగా రూపొందించగలిగిన నేర్పరురాలు భారతిగారు. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రతి కథలోనూ సమస్యను సృష్టించేది లక్ష్మణరావుగారు; సమన్వయించి సంతోషపెట్టేది భారతిగారు. ఒకసారి ఆయన డిక్టేట్ చేయవచ్చు; సమస్యను 'డిసెక్ట్' చేయవచ్చు. దానివెనుక ఎంతో డిఫెన్స్ ఉండాలి; తగిన డిక్షన్ ఉండాలి. ఇద్దరూ సొంతంగా సంపాదించుకున్న సాహిత్య ప్రత్యేక సంపదను ఉమ్మడిగా ఇందులో పొందుపరిచారు; విందుచేశారు. 'జంట కథనం' అనే ఒక మంచి బాటను చూపారు. అందుకే దంపతులు అభినందనీయులు.

పురాణకథలు ప్రతీకార్థ ప్రతిపత్తితో పుడతాయి. వాటిని మారిస్తే అందులో అర్థం అవగతం కాక అస్పష్టతకు దారితీస్తుంది. అయినా పూర్వ ప్రతీకలకు బదులు నవ్యప్రతీకలుగా పురాణకథా పాత్రలను మార్చగలిగిన రచయితలూ ఉన్నారు. పురాణకథలకు జైనులు, కొన్ని మార్పులతో బౌద్ధులు ఇచ్చిన వ్యాఖ్యానాలు మూలతత్త్వాలకు విరుద్ధాలైనవి. వాల్మీకి రామాయణంగానీ, అధ్యాత్మ రామాయణంగానీ విన్న తరువాత జైనరామాయణం వింటే 'రాముడికి సీతేం అవుతుంది?' అనే అనుమానం వస్తుంది. ఒక ఆలోచన ధారలోనో, ధర్మంలోనో, మతంలోనో, సిద్ధాంతంలోనో ఒక అనుభూతికి ప్రతీకగా కల్పింపబడి లోకంలో రూఢికెక్కి ఉన్నదాన్ని మరో ఆలోచనకు గానీ, మతానికి గానీ అనుగుణంగా మార్చదలచుకొన్నప్పుడు అనుభూతిపరంగా సంక్లిష్టత, అస్పష్టత, అయోమయత్వం ఏర్పడటం సహజం. ఉదాహరణకు సావిత్రిని తీసుకుందాం. వేద సావిత్రి వేరు; పురాణ సావిత్రి వేరు; ఇతిహాస సావిత్రి వేరు; అరవింద సావిత్రి వేరు;చలం తీర్చి దిద్దిన సావిత్రి మరీ వేరు.వేదంనుండి అరవింద సావిత్రివరకూ సాగిన తాత్త్విక ప్రతీకాత్మకతను చలం మార్చాడు-తనదైన ఒక దృక్పథాన్ని కళాత్మకంగా వ్యాఖ్యానించటానికి. కాని చలం సావిత్రి చమత్కారంగానే మిగిలిపోయింది; అరవింద సావిత్రి ఆదరపాత్రమైంది; ప్రాచీన సావిత్రి జాతియొక్క అనుభవక్షేత్రంలో అమర ప్రతీకగా నిలిచిపోయింది.

తెలుగువారు ప్రాత పత్రికల మీద క్రొత్త అనుభవాలను ప్రకల్పించే ప్రక్రియకు ఆమోదం తెలుపరు. ఇది చరిత్ర చెపుతున్న సత్యంగా కనపడుతున్నది. ఈ నిజం తెలిసిన ఈ రచయితలు భారతంలోని పాత్రల స్వభావాలను మార్చలేదు; కథలను వక్రీకరించలేదు; అయితే మూలంలో బీజభూతంగా ఉన్న కథార్థాలను, ప్రేమ స్వభావాలను పెంచి పెద్దవి చేశారు. రూపుకట్టేటట్లు రూపొందించారు. ఒక రకంగా చూస్తే భారత కథల్లో ప్రసన్నంగా పరిమళించే భావసౌగంధ్యాన్ని కథాపరంగా కళావ్యాఖ్యానం చేశారు. ఇది కళాపరంగా చిన్న పనికాదు ఈ కథల్లో బలమంతా మూలంకంటే దూరం కాకపోవటం; ఎక్కడో మూలనున్న దివ్వెలను నట్టింటిలో జ్యోతులుగా అలంకరించినట్లు అస్తినాస్తి విచికిత్సకు నోచుకోనే కొన్ని కథాజీవ లక్షణాలను ప్రేమపరంగా వివరించటం-అనే రెండంశాలమీదనే ఆధారపడి ఉంది. సూక్ష్మాంశాలను పెంచి క్రొత్త సత్తువ కథకు పోసిన సూటిదనం ఈ రచనలోని జాణతనం.

'ప్రేమ' వస్తువు ఎంత విస్తృతమైనదో, అంత వివాదాస్పదమైనది కూడా. ప్రేమ వివాహితులైన - లేదా - వివాహితులయ్యే సతీపతుల మధ్యే

ఉంటుందా? మగువ కానీ, మగవాడుకానీ ఎవరి మీదనైనా మనసుపడి వారితో పొందును పొంది సుఖించటం వల్లనే ప్రేమ ఫలవంత మౌతుందని భావించే వారిదీ ప్రేమ అవుతుందా? అనే మీమాంస రాక తప్పదు. ఈ కథల్లో శృంగార స్పర్శతో జీవించే శృంగారమే గోచరిస్తుంది. కాని, దానికంటె విలక్షణమైన ప్రేమ పరిణితం కాదు. ఎందువల్ల నంటే - ప్రేమకథలంటే ధర్మ బద్ధమైన రతి భావం కలిగి, వివాహితులయ్యే నాయికానాయకుల ప్రణయ వృత్తాంతాలనే అర్థమే తెలుగువారు గ్రహిస్తారు. ఈ దృష్టితో అన్నికథలూ రసిక జనామోదాన్ని పొందుతాయి. అయినా జయద్రథుడు, ఊర్వశి కథలలో ప్రేమతత్త్వానికి తగి నంత ధాతుపుష్టి లేదు. సైంధవునిది కామం. ప్రథమ వీక్షణం వలన తామసిక మైన జంతు కామం జనించవచ్చు; రాజసమైన రాగభావం ఉదయించవచ్చు; సాత్త్వికమైన వాసనాబలరూపమైన రతి భావతరంగం జాగృతం కావచ్చు. మూడవదే 'ప్రేమ' స్థాయికి చెందుతుంది.

ఈ కథలు చదువుతూంటే ఆధునిక కథలు చదువుతున్న తృప్తి కలుగు తుంది. దానికి కారణాలు నాలుగైదున్నాయి. 1. మూలంలో లేని పరిసరాలను కథలో కల్పించి సహజ వాతావరణంలో పాత్రలను సహజంగా జీవించేటట్లు చేయటం. 2. నాయికా నాయకుల పాత్రలన్నింటిలో యౌవనం సామాన్య వయో ధర్మంగా కనపడుతుంది. ఆ యౌవన సౌందర్యాన్ని మానసికావస్థలను, సాత్త్విక భావాలను వ్యక్తం చేసే సంకేతాలకు మాత్రమే పరిమితం చేసి అంగాంగ వర్ణనం విరివిగా చేయక పోవటం. 3. పాత్రల స్వభావాన్ని వ్యంజింప చేసే కథాంశాలను నిపుణంగా సందర్భాన్నిబట్టి కస్తూరి లేపనంలాగ అందించటం. 4. కథనూ, సంభాషణలనూ ఎలాగా, ఎంతగా నడపాలనో తెలిసి నిష్పత్తిని నిపుణంగా ప్రయోగించటం. 5. దేవతల్ని కూడా మానవుల్లాగా చిత్రించటం. ఉదాహరణకు ఈ కథల్లో నాయికను నఖశిఖ పర్యంతం చూడని నాయకుడు గాని, నుదురు మీద సాత్త్విక భావోదయానికి చిహ్నంగా చిరు చెమట పోయని నాయిక గానీ కనపడదు. ఇలా ఎన్నో విశేషాలు.

ఈ గ్రంథంలోని కథలన్నీ,పాత్రలన్నీ మనకు తెలిసినవే. కాని, ఈ కథల్లో అవి నివురుపీడిన నిప్పుల్లా ప్రజ్వలిస్తాయి. మనసులు విప్పి మాట్లాడుతున్నట్లూ, మర్మం విడిచి మనతో చెపుతున్నట్లూ అనిపిస్తుంది. అంటే భారతేతిహాసంలో ధర్మం కోసం జీవించిన మనుషులు, దేవతలు, మనీషులు కనపడతారు. కాని, ఈ కథల్లో ఎవరైనా, ఏ తెగకు చెందినవారైనా మనసుతో జీవిస్తున్నట్లు మన అను భవానికి అందుతారు. ఈ కలం బలం రచయితల భావనాబలంలో నుండి పుట్టిందే అందులో అనుమానం అవంతకూడా లేదు.

ఈ కథలు ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో సీరియలైజ్ అయ్యాయి. దేవయాని, శకుంతల మొదలైనవి కొన్ని వారాలు సాగాయి. మిగిలినవి చాల వరకు ఒక్కొక్క వారం ఒక్కొక్క కథగా వచ్చాయి. వార పత్రిక-అనగానే స్థల పరిమితి ఏర్పడుతుంది. దాని ప్రభావం నిడివిమీద, కథానిర్మాణం మీద, కథాకథనం మీద పడక మానదు. వీనిని సంబాళించుకొంటూ కథలో జీవశక్తిని పోషించాలి. చాలవరకు రచయితలు ఈ అంశంలో కృతకృత్యులయ్యారు.

'ప్రమద్వర'లో రురుడూ ప్రమద్వరా ఎంత స్పందిస్తూ కనిపిస్తారో సంపెంగచెట్టు, నేరేడు చెట్టు కూడా అంత సజీవంగా ప్రత్యక్షమౌతాయి. భారతంలో జరత్కారుని గొడవే ఎక్కువ, ఈ కథల్లో జరత్కారువులోని మాతృత్వ స్పందన మధురంగా వినిపిస్తుంది. పైలమహాముని భార్య ధరించే కుండలాల కాంతిని భారతంలో చూచాంకాని, వాటి వెనుక ఆ వెలుగుకు మూలమైన పైల మహాముని ప్రణయ తేజాన్ని ఈ కథల్లో దర్శించ గలుగుతాం. దేవయాని అహంకారాన్ని, శర్మిష్ఠ మాతృత్వ భావాన్ని సరితూకంగా తూచారు కథా రచయితలు. మేనకావిశ్వామిత్రుల కథ మానవ దాంపత్యజీవితంలోని మాధుర్యం దేవలోకంలో కూడా దొరకదని రసవత్తరంగా చాటి చెప్పేది. దానిని రచయితలు నిరూపించారు. 'శకుంతల కథ అప్పుడే ముగిసిందే' అనిపిస్తుంది. శకుంతల కథలో ప్రాణం తలలో ఎంతున్నదో తోకలో అంతున్నది. తోకను కుదించినా కత్తిరించినా కథ రక్తి కట్టదు. శకుంతల కథా రహస్య మది. ఈ కథల్లో గాంధారి, హిడింబ, సుజాత, సుకన్య మొదలైన పాత్రలు కూడా ప్రణయ మూర్తులుగా పఠితల హృదయాల్లో కలకాలం నిలుస్తాయి అన్నిటికంటే ఇందులో కథల కంటే కథాకథనం సహృదయుల ఆమోదాన్ని మరింత చూరగొంటుంది.

యువభారతి రజతోత్సవాలను పురస్కరించుకొని 'భారతంలో ప్రేమ కథల'ను ప్రచురించటానికి ముందుకు వచ్చిన మాన్యమిత్రులు శ్రీ ముత్తేవి లక్ష్మణరావుగారికీ, సోదరి డాక్టర్ ముత్తేవి భారతి గారికి యువభారతి పక్షాన హృదయపూర్వక కృతజ్ఞత అందజేస్తున్నాను. పేరుకు తగ్గ తీరున్న రచన యిది. ఇవి ప్రేమకథలే కావు- ప్రేమించదగిన కథలు కూడా.

హైదరాబాదు
5-5-1991

**జి. వి. సుబ్రహ్మణ్యం**

# ఒకనాటి ప్రేమకు ఈనాటి దర్పణం

ఒకనాటి సాహిత్యాన్ని తరవాతి కాలంలో పునర్వ్యాఖ్యానించే సంప్రదాయం ఒకటుంది. ఆ మాటకొస్తే మన ఇతిహాసాలూ, పురాణాలూ సంస్కృత మూలాలను తెలిగించిన పద్ధతి పునర్వ్యాఖ్యానమే.

ఆధునిక భావాలు వ్యాప్తి చెందుతున్న ఈ శతాబ్దపు తొలి దశకాల్లో ఆ భావాలకనుగుణంగా ఐతిహాసిక, పురాణ కథలకు పునర్వ్యాఖ్యాన రూపంగా తెలుగులో చాలా సాహిత్య సృష్టి జరిగింది. వ్యాసుడు కాశిని వదిలిన ఘట్టాన్ని తీసుకొని జి.వి. కృష్ణరావుగారు ఆధునికంగా ఆకలిశక్తి నిరూపించటానికి భిక్షాపాత్ర అనే నాటికను రాశారు. త్రిపురనేని రామస్వామి గారి నాటకాలూ, కావ్యాలూ తాను బోధించ దల్చుకున్న హేతువాద భావాలకు వాడుకున్నారు. విశ్వనాథ సత్యనారాయణ గారి రామాయణ కల్పవృక్షం సుందర కాండలో రాక్షసాంగనలు సీతకు స్త్రీ విముక్తి ధోరణిలో (హేళనకే అనుకోండి) హితబోధ చేస్తారు.

ఈ శతాబ్ది పూర్వార్ధ భాగంలో విరివిగా వ్యాప్తి చెందిన ఖండ కావ్య ప్రక్రియలో ఈ పునర్వ్యాఖ్యాన ధోరణే కనిపిస్తుంది. జాషువా గారి ఖండ కావ్యాల్లో రారాజు మీద, కర్ణుని మీద పద్యాలీ సంప్రదాయంలోవే. అట్లాగే ఆధునిక రాజకీయాల్లో ప్రచలితమైన అహింసా వాదానికనుకూలంగా బుద్ధుని చరిత్రను పునర్వ్యాఖ్యానిస్తూ వచ్చిన కావ్యాలూ, ఖండికలూ ఎన్నో స్వాతంత్ర్య పూర్వమూ ఆ తరువాత ఇంకా కొంతకాలమూ వచ్చాయి.

ఈ రకమైన సాహిత్యంలో ఒక ప్రధానాంశం ప్రేమ. ప్రాచీన సాహిత్యంలో స్త్రీ పురుష సంబంధాల్లో అసమానత హెచ్చు. ఒక రాజు ఒకేసారికాని, వరసగా గాని చాలామంది స్త్రీలతో సంబంధాన్ని పెట్టుకుంటాడు. స్త్రీని తన కామోపశమన వస్తువుగా గాని, తన సంతతిని వృద్ధిచేసే సజీవయంత్రంగా గాని, తన ధర్మానుష్ఠానికి పనికొచ్చే పనిముట్టుగా గాని ఉపయోగించుకుంటాడు. అయితే ఈ సాహిత్యంలో కొన్నిచోట్ల స్త్రీపరమైన అనుభూతులను చిత్రించిన ఘట్టాలు కనిపించకపోవు. నిజానికట్లాంటి ఘట్టాలు లేకపోయినా ఉన్నవాటిని అట్లా ఊహించుకొని చిత్రించిన పునర్వ్యాఖ్యాన సాహిత్యం మనకుంది.

ఫ్యూడల్ సమాజంలోకన్నా ఆధునిక కాలంలో స్త్రీపట్ల జాలి, కరుణ, దయ ఎక్కువ. అరుదుగానైనా గౌరవం చూపించిన ఘట్టాలున్నాయి. ఈ దృష్టిని ఒకపక్క ఖండకావ్యాలూ, మరోవైపు ప్రణయ కవిత్వం, ఇంకోవైపు కథలూ, నాటికలూ, కాల్పనిక సాహిత్య ధోరణులలో భాగంగా వచ్చాయి. చలం గారి పురూరవ, సావిత్రి నాటకాలు ఈ కోవలోవే. మనుచరిత్రలో వరూధినిని ఒట్టి కాముకిగా పెద్దన చిత్రిస్తే జి.వి. కృష్ణరావుగారు ఆధునిక ప్రేయసిగా తీర్చిదిద్దారు. నిజానికీ ధోరణికూడా భారతీయ సాహిత్యంలో రవీంద్రనాథ టాగూరు గారితో ప్రారంభమయి ఉండొచ్చు. ఆయన కచదేవయాని నాటికలో

దేవయానిని అధునిక ప్రేయసిగా దర్శించారు. బెజవాడ గోపాలరెడ్డిగారు వచనంలోనూ, ఉత్పల సత్యనారాయణాచార్యులు గేయంలోనూ ఈ నాటికను అనువదించారు.

ఈ సంప్రదాయంలో భాగంగానే ఇప్పుడు ముక్తేవి భారతి, లక్ష్మణరావు గార్లు భారతంలో ప్రేమకథలను ప్రచురించారు. వాటిని ఇప్పుడు సంకలిస్తున్నారు.

తెలుగులో ఆధునిక కథానిక ఒక ప్రధాన సాహిత్య రూపంగా నిల దొక్కుకుంది. భారతంలో కొన్ని ప్రధాన కథలను, ఉపాఖ్యానాలను ఎన్ను కొని, వాటికి తగిన ప్రకృతి నేపథ్యాన్ని చిత్రించి, పాత్రోచిత సంభాషణలను కూర్చి, భావవ్యక్తికోసం కొన్ని చిన్నచిన్న సంఘటనలను నిర్మించారు. మూల కథలోని తాత్విక ధోరణులనుగాని ఐడియాలజీని గాని వీరు మార్చే ప్రయత్నం చెయ్యలేదు. స్త్రీ పురుష అసమానతలనుకూడా వీరు యధాతథంగానే స్వీకరించారు. అంటే వాటిని వీరెక్కడా నిరసించిన జాడ కానరాదు. వీరి లక్ష్యం అదికాదు.

భారత గాథల్లో ప్రేమకు అవకాశమున్న లేక ఆధునిక ప్రేమ వ్యాఖ్యా నాన్ని సహించేవాటిని గ్రహించి ఆధునిక కథానికా రూపంలో పునా రచించటమే వీరి లక్ష్యం. ఆ విధంగా చూసినప్పుడు ఇది చాలా మంచి ప్రయత్నంగా గుర్తించ గలం. ఈ రకమైన స్థానంలో కాస్తో కూస్తో స్వాతంత్ర్యం తీసుకోక తప్పదు. అట్లా తీసుకోకపోతే పద్యాల్లో కథలు వచనంలో చెప్పినట్టుంటుంది. ఇవి అను వాదం కాదు, పునస్సృష్టి. ఒకనాటి ప్రేమకు ఈనాటి దర్పణం ఈ సంపుటి.

ఈ ప్రయత్నంలో కొన్నిచోట్ల అద్భుతంగా విజృంభించారు. కొన్ని చోట్ల చాలా నేర్పుగా వ్యాఖ్యానించారు. మరికొన్నిచోట్ల కథ అవకాశం ఇవ్వని చోట వెనక్కితగ్గారు.

అట్లా విజృంభించిన ఒక గాథ కచదేవయాని కథ. కచుడు దేవకార్యార్థియై అసుర గురువైన శుక్రాచార్యుడి దగ్గరికి వస్తాడు. దేవతలు అతన్ని పంపే టప్పుడే "దుహితృస్నేహంబునం జేసి యద్దేవయాని పలుకులు శుక్రుం డతిక్ర మింపడు గావున నీనేర్చు విధంబున దాని చిత్తంబువడసి శుక్రు నారాధించిన నీకిష్టసిద్ధియగును" అని చెప్పిపంపారు. అందువల్ల అతను దేవయాని పట్ల కావాలనే లేనిపోని ఆశలు కలిగేట్టు ప్రవర్తించాడు. దాన్ని విస్తరిస్తూ కచుడు దేవయాని పట్ల చూపేశ్రద్ధకు నిదర్శనంగా దేవయాని కిష్టమని అందమైన పూల కన్నా, సువాసన ఉన్న పూలనే ఏరుకొచ్చినట్టు కల్పించారు. అట్లాగే ఏదో కొంటె ఆలోచన చేసి దేవయాని నవ్వితే పరధ్యానంగా ఉన్న కచుడు కూడా ఆమెను తృప్తిపరచటానికి నవ్వుతాడు.

భారతంలో "ఇట్లతి ప్రయత్నంబున గచుండు శుక్రు వలన సంజీవని వడసి పెద్దకాలంబుండి." అని ఉన్నదాన్ని ఆధారం చేసుకొని "మనసు

దేవలోకం మీద ఉన్నా విద్య నేర్చాక కూడా గురువును, గురుపుత్రిని సేవిస్తూ 'సపర్యలు చేస్తూ కొంతకాలం గడిపాడు" అని "పెద్దకాలాన్ని" వ్యాఖ్యానించారు' అట్లాగే దేవయాని యయాతి పై మోజు పడటం, శర్మిష్ఠ యయాతికి తన కోరిక వెల్లడించటం వంటి చోట్ల చాలా సున్నితంగా చిత్రించారు.

శర్మిష్ఠకు స్త్రీ సహజమైన సంతానాపేక్ష కలిగించటని చెప్పటానికి కల్పించిన దృశ్య చిత్రణ చూడండి:

"ఒక పక్షి ముక్కున ఏదో కరుచుకొని, రివ్వున వచ్చి గూడు చేరింది. తల్లిరాక గమనించి గూట్లో ఉన్న పిల్లలు కిచకిచలాడుతూ ముక్కులు ముందుకు పెట్టి అల్లరి చేశాయి. ఆహారం పిల్లల కందించి మళ్ళీ ఆకాశంలోకి ఎగిరిపోయింది పక్షి.

ఎంత ధన్యురాలు ఈ తల్లి!
మాతృత్వంలోని మాధుర్యం ఇదేగా!'

అని శర్మిష్ఠకు మాతృత్వకాంక్ష కలగటానికి తగిన వాతావరణాన్ని సృజించారు ఈ కథకద్వయం.

ఈ కథలు ఇట్లా రాయటం వల్ల ప్రయోజనం ఏమిటి? ఏదో ఒక రాజకీయ, ధార్మిక ప్రయోజనాన్ని ఆశించి ఈ కథలు ఈ రచయితలు రాశారనుకోను. ఈ కథలు చదువుకోటానికి బాగుంటాయి. తెలుగు భారతంలో ఈ కథలు ఎట్లా ఉంటాయో చూద్దామన్న ఉత్కంఠ కలిగిస్తాయి. సాహిత్య దృష్టితో, కథా రచనా దృష్టితో చదవాల్సినవి. ఆవిధంగా చదివితే తప్పకుండా చదివిస్తాయి. ఇవి ఈనాటివి కావు, ఒకనాటివి అన్న స్పృహతో చదివితే ఇంకా ఎక్కువ బాగుంటాయి.

ఈ కథలు దంపతులిద్దరూ కీచులాడుకుంటూ రచించారు. అయితే చాలా శ్రమపడి, ఎన్నో రాత్రులు ఏకదీక్షతో తపస్సు చేసినంత దీక్షగా రాశారు. రచనా కాలంలో కొన్ని ఘట్టాలను నేను విన్నాను. అవి మళ్ళీ పుస్తకంగా సంకలితం కావటం చాలా సంతోషకరమైన విషయం. ప్రధాన కథకులు లక్ష్మణరావు గారైనా, భారతి చెక్కిన నగిషీలు చాలా ఉన్నాయి. 'వాగర్థావివ' రచించారీ పుస్తకాన్ని.

పఠితలందర్నీ అలరిస్తుందని నా ఆశే కాదు, నమ్మకం కూడా.

—చేరా

1991 మే 4.

# మా మాటలు

## 1

భారతంలో ప్రేమకథలకి ఈ రూపం ఎట్లావచ్చిందో సవివరంగా మనవి చేస్తాను.

రచనావ్యాసంగంలో నాకంటే ఎక్కువ ఉత్సాహము, ఓపిక భారతికి వున్నాయి. అందుకని భారతంలో ప్రేమకథలు ఆధునిక కథారూపంలో రాయమని సూచన చేశాను. భారతంలో ప్రేమకథలు ఎక్కువ లేవని, ఉన్నకథలు అందరికీ తెలిసినవేనని భారతి నా సూచన మనసుకి పట్టించుకోలేదు మొదట్లో.

భారతి నాసూచన పట్టించుకోలేదని నాకు కోపం వచ్చింది. అయితే ఆ కోపం మంచికే దారితీసింది. ఎందుకంటే, నాలో సాహితీస్పర్థ మరింత పెంచింది. నాలోవున్న సృజనాత్మకతని కూడగట్టుకోని, పైలముని కథని నేను భారతికే డిక్టేట్ చేశాను.

నిజానికి పైలముని కథ ప్రేమకథగా ఎవరూ చెప్పరు. ప్రేమకథగా దాన్ని చూసిన ఆ సంఘటన తల్చుకుంటే ఆశ్చర్యం, ఆనందం కలుగుతాయి నాకు. తన ప్రియశిష్యుడు గురుదక్షిణ సమర్పిస్తానంటే తాను స్వీకరించకుండా, తన భార్య కోరుకున్న రత్నకుండలాలు తెచ్చేందుకు శిష్యుడైన ఉదంకుణ్ణి ఆదేశించడం గురుదక్షిణను గురుపత్ని దక్షిణగా చేయటం భారతంలో కథ. పైకథలో సూచనామాత్రంగా వున్న దంపతుల అన్యోన్యానురాగానికి రూపం యిచ్చి, ప్రేమకథగా తీర్చిదిద్దాను.

ఉదంకోపాఖ్యానం చదువుకున్న భారతికి, పైలమహాముని కథను ప్రేమకథగా సృష్టించడంతో, భారతంలో ప్రేమకథలు ఎన్నో రాయగలమనే ధైర్యం కలిగింది. ఆ కథ రాసిన తర్వాతే భారతంలో ఎన్నో అంశాలను ప్రేమకథలుగ చిత్రించగలననే విశ్వాసం నాలో బాగా దృఢపడింది.

ఈ కథల్లో చాలా కథలు నేను చెప్తే, భారతి రాసుకుంది. తోచిన మార్పులు, చేర్పులు చేసింది. భారతి రాసిన కొన్ని కథల్లో నేనూ కొన్ని

మార్పులు చేశాను. ఇప్పుడు ఈ కథల్లో ఎవరిపాలు ఎంత అంటే చెప్పటం సాధ్యం కాదు మాకు. అందుకే ఆకథల కర్తృత్వం ఇద్దరిదీ అయింది.

ఇక్కడో రహస్యం నేను చెప్పటం ధర్మం.

భారతి సహాయ సహకారాలు లేకుండా నేను కథలు రాయాలనుకుంటే ఈ కథలు వెలుగును చూసేవికావేమో! నా ప్రమేయం లేకుండా భారతి ఈ కథలు రాయగలిగేది కాదేమో!

గాంధారి, హిడింబ కథలు ప్రేమకథలుగా రాస్తున్నప్పుడు భారతికి చాలా ఆశ్చర్యం కలగటం నాకు తెలుసు. పూర్తయిన కథను చదివి ముచ్చటపడి, దాపరికం లేకుండా నన్ను అభినందించటం ఈ కథారచన నిర్విఘ్నంగా కొనసాగేందుకు కారణమైంది.

పై విషయాలు చదివి, భార్యా భర్తలు ముచ్చట్లు చెప్పుకుంటూ, కాల క్షేపంగా ఈ కథలు రాసారు అనుకుంటే అది పెద్ద పొరబాటే.

ముఫ్ఫై సంవత్సరాల వైవాహికజీవితంలో మా మధ్య జరిగిన వాగ్వాదా లన్నీ కలిపినా, ఈ కథారచన సందర్భంగా జరిగిన వాగ్వాదాలకంటే తక్కువే. అంటే, నేను చెప్పింది శ్రద్ధగా రాసుకోటం లేదనో, వాక్య నిర్మాణం బాగా కుదరలేదనో, చెప్పింది చెప్పినట్టు కాకుండా భారతి తన యిష్టం వచ్చినట్లు మార్పులు చేస్తోందనో ఎన్నో ఆరోపణలు నేను చేస్తూనే వుండేవాణ్ణి. అలాగే ఆవిడ రాసే కథలో నేను మార్పులు సూచిస్తే, తను చిత్రిస్తున్న కథారూపమే పోతోందని ఘర్షణ పడేది.

ఒకరు చెప్పటం, ఇంకొకరు రాయటం అనే గొడవ ఎందుకొచ్చిందో ఇక్కడ చెప్తాను - వృత్తిరీత్యా న్యాయవాదిని. టైపిస్టుకి, జూనియర్‌కి డిక్టేటు చేయడం పాతిక సంవత్సరాలుగా అలవాటయింది. చేత్తో పేజీలకొద్దీ రాయటం నాకు ఇబ్బంది. అలా రాస్తే నా రాతకి, ఆలోచనకి పొంతన కుదరదు. అందుకే భారతి సహాయం లేకుండా తెలుగులో రచనలు చేయలేదు, చేయలేను.

చేదోడు వాదోడు అనే మన తెలుగింటి వాడుక మా రచనా వ్యాసంగంలో అక్షర సత్యం అయింది.

ఇదీ ఉన్న విషయం.

**ముత్తేవి లక్ష్మణరావు**

# 2

వృత్తికి, ప్రవృత్తికి సాహిత్యమే ఆలంబనమైన నాకు "భారతంలో ప్రేమకథల" రచన ఎంతో ఆనందాన్ని కలిగించింది. తెలుగు సాహిత్య రంగంలో ఉడుతాభక్తిగా మంచిపని ఒకటి చేశాననే తృప్తికూడా వుంది.

ఈ కథల కర్తృత్వంలో గౌరవం నాకు సగభాగం దక్కినా, నిజానికి ఈ కథల రచనలో ప్రధానపాత్ర లక్ష్మణరావుగారిదే.

ఆయనది న్యాయవాదవృత్తి అయినా, ప్రవృత్తి సాహిత్యాభిలాషే. సాహిత్యం, చరిత్ర, సంస్కృతి మొదలైనవి అభిమాన విషయాలు. లక్ష్మణరావు విస్తృతంగా చాలా పుస్తకాలు చదువుకోటంవల్ల, ఎన్నో సందర్భాలలో ఆయన్ని సంప్రదించటం, సలహా తీసుకోవటం నాకు అలవాటైపోయింది.

కవిత్రయ భారతంలో ఒక పద్యమో, ఒక వ్యాసమో, కొన్ని సందర్భాలలో ఒక పదమో ఆధారంగా తీసుకుని కథని ఊహించుకుని చెప్తూవుంటే, నేను రాసినవే ఇందులో కథలు.

మేనక విశ్వామిత్ర కథలో మేనకని కేవలం అప్సరసలా, తపోభంగం చేసిన విధ్వంసకురాలిగా చూడకుండా నన్నయవాడిన ''పెద్దకాలంబు'' అనే ఒకమాట ఆధారంతో మేనక విశ్వామిత్రుల అవ్యాజానురాగాన్ని, మేనకలో మాతృమూర్తిని చూడగలిగాము మేము. అలాగే శకుంతలా దుష్యంతుల కథలో, దుష్యంతునిపై వున్న దురభిప్రాయాన్ని తొలగించి, ఆ పాత్రని సమర్థిస్తూ కథని రాశాము. భారతంలో అంబ గురించి చాలామందికి తెలుసు కానీ సాళ్వుడి గురించి ఎక్కువగా ఎవరికీ పట్టలేదు. అంబా సాళ్వుల కథని ప్రేమకథగా తీర్చి దిద్దాము.

సుజాత ఏకపాదుడు, సుకన్య చవనమహర్షి, అష్టావక్రుడు సుప్రభ-ఇలా ఎన్నో కథలని భారతంలోని పద్దెనిమిది పర్వాలు శోధించి ప్రేమకథలుగా రూపొందించాము. ప్రేమకథలు చిత్రించటం తేలికైన పనికాదని మాకు ఎన్నిసార్లో అనిపించింది.

ఈ కథల రచనలో కొన్ని సూత్రాలు ఏర్పరచుకున్నాము. మా రచన మూలకథకి భిన్నంగా ఉండకూడదు. చేర్పులు చేసుకోవచ్చు. మార్పులు చేసుకో కూడదు. కథలోని ప్రతి పాత్రమీద గౌరవం ఇనుమడింపజేయాలి. ఈ పరిధి దాటకుండా రచించాము.

భారతంలో ప్రేమకథలు సాహితీపరుల, సహృదయుల మనసుని అకట్టు కుంటే, మా ప్రయత్నం సఫలమైనట్టే భావిస్తాము.

**డా॥ ముక్తేవి భారతి**

## 3

కథలు బాగున్నాయని మెచ్చుకుంటూ మమ్మల్ని ఆశీర్వదించిన శ్రీశ్రీశ్రీ లక్ష్మణ యతీంద్రుల వారికి వినయపూర్వక ప్రణామము లందిస్తున్నాము.

సంప్రదాయ సాహిత్యంతో బహుముఖ పరిచయం, భారతంపై భక్తిపున్న మా యింటి పెద్ద శ్రీ ముక్తేవి భగవంతరావు గారు మా కథలకి మొదటి శ్రోత. ఆయన ఆనందించి, మా రచన కొనసాగాలని ఆశీర్వదించారు. వారికి మా నమస్సుమాంజలులు.

"భారతంలో ప్రేమకథలు" ధారావాహికంగా ప్రచురించి మమ్మల్ని ప్రోత్సహించిన ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు గారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

మా శ్రేయోభిలాషి ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు మా కథలని ఎంతో అభిమానించారు. యువభారతి రజతోత్సవ ప్రచురణగా "భారతంలో ప్రేమకథ"లని అంగీకరించారు. ముందు మాట రాసి, అభినందించారు. వారికి మేము సదా కృతజ్ఞులము. మిత్రులు ఆచార్య చేకూరి రామారావు గారు ఈ కథలను ఎంతో ఆసక్తిగా విన్నారు. అడగంగానే తమ అభిప్రాయాన్ని అందించారు. వారికి మా ధన్యవాదాలు.

గురువర్యులు, జ్ఞానపీఠ గ్రహీత, ఆచార్య సి. నారాయణరెడ్డి గారు 'భారతంలో ప్రేమకథలు' ఆవిష్కరించి ఆశీస్సులందజేశారు. వారికి మా కృతజ్ఞతాభి వందనాలు.

సాహితీ బంధువులు పురాణం సుబ్రహ్మణ్యశర్మ గారికి, బొమ్మకంటి శ్రీనివాసాచార్యుల వారికి,

కథారచనాకాలంలో మావాగ్వాదాలతోసహా మా కథలు విని, మమ్మల్ని ప్రోత్సాహపరచిన మిత్రులు డా॥ బూదరాజు రాధాకృష్ణ గారికి, సి. ధర్మారావు గారికి, కాశీగారికి, డా॥ విద్యారాణి గారికి మా ప్రత్యేక కృతజ్ఞతలు.

పుస్తక ప్రచురణకి ఆర్థిక సహాయం అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి, పుస్తకాన్ని చక్కగా అచ్చువేసి యిచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికీ మా కృతజ్ఞతలు.

బహుకార్య నిమగ్నులై వుండి కూడా, పుస్తకానికి ముఖ చిత్రాన్ని వేసి పంపి, పుస్తకానికి శోభ చేకూర్చిన శ్రీ బాపూగారికి మా కృతజ్ఞతలు. లోపలి చిత్రాలను అందంగా చిత్రించిన శ్రీ చంద్రగారికి ధన్యవాదాలు.

ముఖపత్ర ముద్రణం ముచ్చటగా చేసి యిచ్చిన విష్లా కంప్యూటర్స్‌వారికి ధన్యవాదాలు.

ఇంకా ఎందరో శ్రేయోభిలాషులు-అందరికీ మా వందనాలు!

ముక్తేవి లక్ష్మణరావు
డా॥ ముక్తేవి భారతి

## ఇందులోని ప్రేమమూర్తులు....

# ప్రమద్వర

ఇద్దరు స్నేహితురాళ్ళతో కలిసి బయలుదేరిన ప్రమద్వర సంపెంగచెట్టు దగ్గర నిలబడింది. రెండు రోజులనాడు చూసిన మొగ్గలు వికసించాయో లేదో అని చూస్తోంది.

మొగ్గలతోఉన్న అక్కడి సంపెంగ చెట్టు దగ్గరికి ధైర్యంగా పిల్లలు వెళ్ళరు. చెట్టుదగ్గరలోనే పెద్ద పుట్ట ఉంది.

అపరాహ్ణం దాటిన తరువాత ఆశ్రమం నిశ్శబ్దంగా ఉంటుంది. సమయం చూసుకుని బయలుదేరిన ప్రమద్వర చెట్టునుచూస్తూ నిరాశ చెందింది. ఆ మొగ్గలు ఇంకా పువ్వులు కాలేదు. అయితే, ఆ చెట్టు చిటారుకొమ్మన గుమ గుమ లాడుతూ వికసించిన సంపెంగపువ్వు కనబడటంతో ప్రమద్వర చాలా ఆనందించింది. దాన్ని కొయ్యాలని చూస్తూ, అక్కడున్న ఒక చిన్న కర్రతో కొట్టింది. కొమ్మ కదులుతోంది కానీ పువ్వు రాలి పడదే!

ముఖానికి అప్పుడే చిరుచెమటలు పట్టాయి. తుడుచుకుంటుంటే దగ్గరలో నుంచి నవ్వులు వినిపించాయి. ప్రమద్వర అటూ ఇటూ చూసింది-మళ్ళీ నవ్వు- మళ్ళీ నవ్వు - పకపకా - కిలకిలా - అటూ ఇటూ మళ్ళీ చూసింది.

ఆ రోజు ఆశ్రమంలోని ముత్తైదువలు ప్రమద్వరకు అభ్యంగనస్నానం చేయించి, కురులు ఆరడానికి ధూపం వేశారు. అందమైన నల్లని కురులు జడ అల్లారు. ప్రమద్వర పొడవైన జడని ముందుకు వేసుకుని మళ్ళీ సంపెంగచెట్టు వైపు చూపు సారించింది. చివాల్న భుజానికి ఏదో తగిలింది, నేలమీద వచ్చి పడింది- మరొకటి, మరొకటి - భుజంమీద, మెడమీద, చెంపలమీద ఒకటి ఒకటి పడుతూంటే ప్రమద్వర చిరాగ్గా విదిలించుకుంది. భుజాన్ని దులుపుకొనే లోపల మెడ మీద, మెడమీద దులుపుకొనే లోపల చెక్కిలిమీద పడ్డాయి వరుసగా.

ఆవే నేరేడుపళ్ళు-ఆ పళ్ళు చితికి రసం చిందింది - బుగ్గలపైన, భుజాల పైన, మెడపైన వంగరంగు మచ్చలు కనిపిస్తున్నాయి. అసలే ఎర్రని పెదాలు, పచ్చని చెక్కిళ్ళు వున్న ప్రమద్వరకు ఈ నేరేడుపళ్ళ రంగు మరకలు మరీ

అందాన్నిస్తుంటే స్నేహితురాళ్ళు కూడా నవ్వాపుకోలేకపోయారు. ప్రమద్వరకి ఉక్రోషమొచ్చింది. ఎవ రీపని చేస్తున్నారో తెలుసుకోవాలి - ఆశ్రమ బాలకులకు తనని ఏడిపించే ధైర్యం లేదు. తనను పెంచి పెద్దచేసిన స్థూలకేశి మహర్షిఅంటే అందరికీ భయమే. ప్రమద్వర చెలికత్తెలతో త్వరత్వరగా నడుస్తోంది.

చివాల్న నేరేడుచెట్టు దిగి, వేగంగా వచ్చి "కోపం వచ్చిందా?" అన్నాడు ప్రమద్వర చేయిపట్టుకొని దగ్గర ఆశ్రమంలో ఉండే మునికుమారుడు. ఎంతో ఆకర్షణీయంగా ఉన్న అతని ముఖం చూడగానే ప్రమద్వర కోపం కొంతపోయింది కాని, ఈ కొంటెవాడికి ఏ శిక్ష విధించాలో అనుకుంటూ ముందుకు నడిచింది.

ఇంకా కోపంతగ్గని ప్రమద్వరని చూసి "సంపెంగపువ్వు కోసిపెట్టాలా?"- మునికుమారుడు ప్రమద్వర భుజంమీద చేయి వేసి వేగంగా చెట్టువైపు నడిచాడు.

"మీ తండ్రిగారికి చెప్పకూడదు" అంటూ ఎగిరి గంతేసి కొమ్మ వంచి పువ్వుకోసి చేతికిచ్చాడు.

"కోపం పోయిందా?"

"ఊఁ -" ప్రమద్వర పొడవైన జడలో పువ్వును తురుముకుంది.

"చూడు. ఎలా ఉన్నావో! ఆ పచ్చని రంగు, ఈ ఎర్రని రంగు, ఈ ఊదా రంగు, కలసి-త్రివర్ణ సుందరిలా ఉన్నావు" అంటూ ఆమె చెక్కిళ్ళు, పెదాలు, భుజాలు ఒకటొకటి ముట్టుకుని చూపించాడు.

చెలికత్తెలు, ప్రమద్వర, ముని కుమారుడు నడుస్తున్నారు వేగంగా. "ఈ రంగులు తుడవనీ, మీ తండ్రిగారు ఇవేమిటని అడిగితే?" అంటిన నేరేడు రంగుని తుడుస్తుంటే ప్రమద్వర నవ్వుతూ ఊరుకుంది.

ప్రమద్వర, చెలికత్తెలు ఆశ్రమం చేరారు. చెలికత్తెలు ప్రమతి మహర్షి కుమారుడు చేసిన అల్లరి అంతా పూసగుచ్చినట్టు స్థూలకేశ మహర్షికి నివేదించారు. అంతా విని నవ్వి ఊరుకున్నాడు మహర్షి.

మరునాడు సంపెంగచెట్టు కింద నలుగురూ కూడారు.

"నీ పేరు రురుడా?"

పకపకా నవ్వింది ప్రమద్వర. ఆగకుండా నవ్వింది.

"భృగుమహర్షి మీ ముత్తాతటగా? మా తండ్రిగారు చెప్పారు!" జడ వయ్యారంగా ముందుకు వేసుకుంది ప్రమద్వర.

"అవును. మునికన్య వనుకున్నాను. మేనక, గంధర్వరాజుల కుమార్తె వటగా? మా తండ్రిగారూ చెప్పారు. అంత సుకుమారివని తెలియకే నిన్న నేరేడు పళ్ళు విసిరాను. ఏవీ దెబ్బలు?" రురుడి మాటలకి సిగ్గుతో తలవంచింది ప్రమద్వర.

వారి స్నేహం దిన దిన ప్రవర్థమానమైంది. యౌవనంతో పాటు ఆ స్నేహం అనురాగంగా మారింది. ఆశ్రమవాసు లందరికీ ముచ్చట గొలిపింది వారి సాహచర్యం.

నూనూగు మీసాల యౌవనంతో, పొందికైన శరీర సౌష్ఠవంతో ఆకర్షణీయంగా తయారయ్యాడు రురుడు. యుక్తవయసుతో బాటు గంధర్వదేవతా స్త్రీల సౌందర్యాన్నీ, సౌకుమార్యాన్నీ రంగరించి పోసిన మెరుపుతీగలా తయారయింది ప్రమద్వర.

తన కిష్టమయిన సంపెంగపూలు కొయ్యాలని మళ్ళీ స్నేహితురాళ్ళతో బయలుదేరింది ప్రమద్వర. ఈ రోజు చెట్టున పూలు విరబూసి ఉన్నాయి. కొంచెం పైకొమ్మనున్న సంపెంగ ముందు ముందుకు వంగి వయ్యారంగా ప్రమద్వరని చూస్తోంది.

'ఈ పువ్వే కావాలి, దాన్నే కొయ్యాలి—రురుడి సహాయం లేకుండా తనే కోయాలి.'

ప్రమద్వర ప్రయాసతో కొమ్మ వంచింది. పూవును అందుకోబోయింది. పాదాలపై ఏదో పడింది. చటుక్కున పాదం విదిలించింది. అంతలోనే కెవ్వున కేకవేసి నేలకూలింది. భయంకరమైన నాగసర్పం జరజరా పాకుతోంది దగ్గరలో ఉన్న పుట్టలోకి. మిలమిలా మెరుస్తోంది. చెలికత్తెలు గజగజా వణికి పోయారు. సర్పం గబగబా పుట్టలో కెళ్ళిపోయింది.

వేగంగా పరిగెత్తి స్థూలకేశ మహర్షికి విన్నవించారు. భరద్వాజ, మైత్రేయ, ఉద్దాలక, శ్వేతకేతు, ప్రమతులంతా అక్కడికి వేగంగా చేరారు. రురుడు పరుగెత్తి వచ్చాడు.

భయంకరమైన విషం ప్రమద్వర ప్రాణాలు బలిగొంది. అసువులుబాసి పడి ఉన్న ప్రమద్వర నిద్రిస్తున్న వనదేవతలా ఉంది రురుడి కళ్ళకి. మృత దేహంమీద పడి రోదించాడు రురుడు. అచేతనుడయ్యాడు. అక్కడున్న మహర్షు లందరూ కన్నీరు నించారు. రుడుడి శోకానికి అవధుల్లేవు. తన ప్రేయసిని ఎలాగైనా బతికించమని పేరు పేరునా అందర్నీ వేడుకున్నాడు.

సృష్టికి ప్రతిసృష్టి చేయగల మహర్షులు, తపోధనులు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు నిస్సహాయతతో. ఇక అక్కడ నిలవలేక దుఃఖిస్తూ ఒంటరిగా అడవిలో ప్రవేశించాడు రురుడు. ప్రమద్వర లేని జీవితం తనకొద్దు. అడవి అంతా సంచరించాడు రురుడు. చెట్టునూ, పుట్టనూ ప్రార్థించాడు.

"నేనే కనక యజ్ఞ యాగాది సత్కర్మలు ఆచరించేవాడినయితే, నేనే కనక వేదాధ్యయన దీక్షాపరతంత్రుడినయితే, నా ప్రేయసిని, నా ప్రమద్వరని బ్రతికించండి, నన్ను దయతలచండి" అంటూ దేవతలందరినీ కన్నీరు మున్నీ రుగా వేడుకున్నాడు. "ఏ మంత్రతంత్రాలతోనైనా ఆ విషాన్ని పోగొట్టలేరా" అని అడుగుతూ రురుడు శోకమూర్తియై అడవి అంతా దీనంగా తిరుగాడాడు. "ఎవరైనా ఈమెను బతికిస్తే నా తపఃఫలాన్ని, నా అధ్యయనఫలాన్ని దాన మిచ్చేస్తాను'' అంటూ వాగ్దానం చేశాడు.

చివరకు రురుడి ప్రార్థన ఫలించింది.

"విధిని ఎదిరించటం ఎవరికీ సాధ్యంకాదు. కానీ, ఒక్క మార్గముంది."

మధురమైన వాక్కు ఆశాజనకంగా వినిపించింది రురుడికి. ఆశతో, ఆశ్చర్యంతో ఆకాశంవంక చూశాడు.

"ప్రమద్వరకి నీ ఆయుస్సులో సగం పంచి ఇస్తావాః అప్పుడే ఆమె బతుకుతుంది"—ఆకాశంనుంచి వెలువడిన దేవదూత వాక్కు రురుణ్ణి బాధ నుంచీ, దుఃఖంనుంచీ విముక్తుణ్ణి చేసింది.

"ప్రమద్వర జీవించటానికి ఏమైనా చేస్తాను." సద్భక్తితో, వినయంగా చేతులు జోడించి దేవదూతవాక్కు వినపడినవైపు చూశాడు. సత్యపరుడూ, ప్రేమ మూర్తీ అయిన రురుడి ప్రమాణవాక్యం బ్రహ్మదేవుడు అంగీకరించినట్లు ఆకాశం కొత్తవెలుగుల్ని నింపుకుంది.

ప్రమద్వర రురుని ఆయుర్భాగ్యం పంచుకుని ప్రాణం నిలుపుకుంది.

ప్రమద్వర రురుల వివాహ మహోత్సవాన్ని కనులవిందుగా వీక్షించారు ఆశ్రమవాసులంతా. ఆ వనమంతా కల్యాణవేదికై భాసించింది.

''నాథా! ఆయుర్భాగ్యాన్ని పంచి యిచ్చిన నా ప్రేమమూర్తీ, ప్రేమ నిత్యమని, ప్రేమ సత్యమని, లోకానికి చాటడానికే మీరు ఉద్భవించారా?'' ప్రమద్వర కృతజ్ఞతాపూర్వకంగా భర్తకేసి చూసింది.

''నా దీర్ఘాయుష్షు మనిద్దరిదీ. మనిద్దరి అర్ధాయుష్షు కలిసీ పూర్ణాయుష్షే కదా! అయినా నీవు ఉంటేనే నేనుంటాను. తెలుసా నీకు?'' అన్నాడు రురుడు ప్రేమ దృక్కులను ప్రసరిస్తూ. అవధులు లేని భర్త ప్రేమానురాగాలు తల్చుకుంటూ భర్తగాఢపరిష్వంగంలో పరవశించింది ప్రమద్వర. *

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం
ఆదిపర్వం : ప్రథమాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవార పత్రిక : 29-7-1987)



# జరత్కారువు

జరత్కారువు యౌవన శోభతో మిలమిల మెరుస్తూ, నాగకన్యల్లో అంత సౌందర్యవతి మరొకతె లేదని పేరు పొందింది. ఆమెకు విపరీతమైన అతిశయం. ఆమె శక్తికీ, గుణగణాలకీ తగిన వరుడు నాగలోకంలో ఎవ్వరూ కనపడలేదు.

అవును, తను సామాన్యురాలా? వాసుకి ప్రియసోదరి. వాసుకి శక్తి సామర్థ్యాలు త్రిమూర్తులకు, దేవతలకు కూడా ఆశ్చర్యాన్ని కలిగించాయి. క్షీరసాగర మథనానికి రాక్షసులు, దేవతలు అనేక యోజనాలు వ్యాపించిన మంధర పర్వతాన్ని కవ్వంగా తెచ్చుకున్నారు కానీ, దాన్ని చుట్టి తిప్పడానికి తగిన తాడు సంపాదించలేకపోయారు. వాసుకి కవ్వపు తాడై, అమృతోత్పత్తికి సహాయకుడయ్యాడు. అలాటి వాసుకి చెల్లెలు జరత్కారువు. ఏ నాగ యువకుడో తనకు భర్తగా సరిపోతాడా-తను ఏ సామాన్యుణ్ణో ప్రేమించనూ లేదు, భర్తగా అంగీకరించనూ లేదు. నవయౌవనంలో ఉన్న తన శరీరాన్ని చూసుకుంది ఒకసారి-తనని తనే ప్రేమించుకునే టంత అందగత్తె తను. ఆ ఎర్రని పాదాలు, విశాలమైన నయనాలు, నిగనిగలాడే కేశాలు, నున్నని బాహువులు చూసుకుంటూ ఆ నీరెండలో సురపొన్న చెట్టు కింద కూచుంది జరత్కారువు.

అన్న వాసుకికి జరత్కారు వంటే చాలా ఇష్టం. ఆమె ఏది కోరితే అది తెచ్చి ఇస్తాడు. ఆమె ఎవరిని కోరితే వారిని తెచ్చి వివాహం చేయగలడు. తమ వంశం గుణశీలాలకు ప్రసిద్ధి పొందింది. తను ఎవర్నో ఒకర్ని ఎలా వివాహం చేసుకుంటుంది? మరి ఇలా ఎంతకాలం? తన యౌవనమంతా వృథా కావలసిందేనా? స్త్రీగా, మాతృమూర్తిగా తన జీవితం ధన్యత చెందే దెలా? తన వివాహ విషయం జ్ఞాని అయిన అన్నగారే నిర్ణయించాలి అనుకుంది చెక్కిట చేయిచేర్చి సురపొన్న చెట్టుకేసి చూస్తూ జరత్కారువు.

ఒక రోజు అనేకమంది నాగకుల ప్రముఖులు వ్యాకులచిత్తులై వాసుకి దగ్గరకొచ్చారు. జనమేజయుడు సర్పయాగాన్ని తలపెట్టాడనీ, నాగకులాన్ని అంతం చేస్తానని ప్రతిజ్ఞ చేశాడనీ చెప్పి, అతన్ని వారించేందుకు యుద్ధసన్నద్ధులం కావాలని కోరారు. తన చెల్లెలు జరత్కారువుకు పుట్టే మహానుభావుడు నాగకుల రక్షకుడవుతాడని తాను పూర్వం విన్నాడు. ఆ విషయం చెప్పి నాగకుల ప్రముఖుల భయాన్ని వారించాడు వాసుకి. సమయంకోసం ఎదురు చూస్తున్నాడంతే!

యౌవనభారంతో గృహంలో కనిపిస్తున్న చెల్లెల్ని చూస్తుంటే వాసుకి మనసు వ్యథ చెందుతోంది - ఈమెకు ఎప్పటికి తను వివాహం చేయగలడో, ఆ శుభఘడియ లెప్పుడొస్తాయో అని.

బ్రహ్మచర్య దీక్షతో పరమ తపోధనుడైన మునీంద్రు డొకడు అడవిలో సంచరిస్తూ ఒక విచిత్రాన్ని గమనించాడు. తలకిందులుగా వేలాడుతూ, సూర్య కిరణాలే ఆహారంగా తీసుకుంటూ కృశించిన మహర్షులు కనిపించారు. వారిని సమీపించి ఆ తపస్సు ప్రత్యేకత ఏమిటని ప్రశ్నించాడు. వారు ఎంతో విచారంగా అది తపం కాదనీ, తా మెంతో పాపం చేసుకున్నామనీ తెల్పారు. మునీశ్వరుడు కారణం తెలపమని కోరాడు. తమ వంశంలో పితృకార్యాలు చేసే వారెవరూ లేరనీ, ఉన్న ఒక్క జరత్కారుడు బ్రహ్మచర్యదీక్షతో తపస్సు చేస్తున్నాడనీ, తాము ఆ కారణంగా ఊర్ధ్వలోకాలకు పోలేక ఇలా అధోముఖులై ఉన్నామనీ తెలిపారు. ఎన్ని వ్రతాలు, యజ్ఞాలు చేసినా, ఎన్ని దానాలు ఇచ్చినా సంతానం లేకపోతే అది దోషమే-అని చెప్పి, "అయ్యా! తమ రెవరో తెలియదు. ఆ జరత్కారుడు కనిపిస్తే వివాహం చేసుకుని సంతానవంతుడవు కమ్మని మీరైనా చెప్పండి" అన్నారు దీనంగా.

మునీశ్వరుని మనసు కరిగింది. ధర్మదీక్షాపరుడైన జరత్కారుడు తనే నని తెలిపాడు వారికి. తాను వివాహం చేసుకుని, వారికి ఊర్ధ్వలోకాలు కలిగిస్తా నని వాగ్దానం చేశాడు. అయితే సనామ్ని అయిన కన్యనే వివాహమాడతానని ఒక నియమం పెట్టి, కన్యాన్వేషణంకోసం బయల్దేరాడు జరత్కారుడు. ఎంతో తిరిగాడు. భూలోకంలో సనామ్ని అయిన కన్య దొరకటం దుర్లభమైంది.

చారులవల్ల ఈ విషయం విన్న వాసుకి పరమానందభరితు డయ్యాడు. తన చెల్లెలు జరత్కారువుకు వివాహం చేయడానికి తగిన సమయ మిదే అని నిశ్చయించాడు. జరత్కారుని దీక్షాదక్షతలు తెలుసుకున్న వాసుకి, జరత్కారు వును వెంట బెట్టుకుని జరత్కారుని దగ్గరకు వెళ్ళాడు.

జరత్కారువుకీ, జరత్కారుడికీ వివాహమైంది. జరత్కారువు ఆనందా నికి అవధుల్లేవు. ఆమె భార్యగానేకాక, ఒక మాతృమూర్తిగా జీవితం ధన్యం చేసుకోవాలనే గొప్ప కోరికతో ఉంది.

మొదటి రాత్రే జరత్కారుడు ఒక కఠిన నియమం పెట్టాడు. "నువ్వు ఏనాడైనా నన్ను అవమానపరిచినట్టనిపిస్తే ఆ క్షణంలోనే నిన్ను వదిలి వెళ్ళి పోతాను" అని.

జరత్కారువు విస్తుపోయింది. తన భర్త తనని నిజంగా ప్రేమిస్తున్నాడా, కేవలం ధర్మంకోసం, ధర్మకార్యనిర్వహణకోసం తనను వివాహం చేసుకున్నాడా అని వ్యాకులపడింది మనసులో. అప్పటినుంచీ కత్తిమీద నడుస్తున్నట్టుగానే భయం భయంగా కాపురం చేస్తోంది. నియమవ్రత దీక్షాబద్ధురాలై, రాత్రిం బవళ్ళు భర్తకు సేవ చేస్తోంది. తన గర్భాన ఎంతటి మహానుభావుడు ఉద్భ విస్తాడో నని ఊహించుకుంటూ తన్మయత్వం చెందుతూంది.

ఒకనాడు జరత్కారుడు విశ్రమిస్తున్నాడు. సంధ్యాసమయమైనా నిద్ర లేవలేదు. ఆశ్రమవాసులందరూ సంధ్యాకార్యక్రమాలతో నిమగ్నమవుతున్నారు. భర్తని నిద్ర లేపాలి. కాని, నిద్ర లేపితే, అతనికి కోపమొస్తే? జరత్కారువు క్షణం తటపటాయించింది.

బహుదీక్షాపరుడైన జరత్కారునికి సంధ్యాసమయం అతి పవిత్రమైంది. అతన్ని నిద్ర లేపటం తన ధర్మమే అని నిశ్చయించుకుని, నిద్ర లేపింది. జరత్కారుడు నిద్రాభంగమైనందుకు ఉగ్రుడయ్యాడు. జరత్కారువు శాంతిగా సమాధానపరచ యత్నించింది.

"నువ్వు నన్ను అవమానపరిచావు. నేను పెట్టిన నియమాన్ని అతిక్రమించావు. నీవు మీ అన్న దగ్గర కెళ్ళిపో!"

జరత్కారుని గంభీరస్వరానికి నిశ్చేష్టురాలైంది. తన తప్పు లేకుండానే, తనను తూలనాడుతున్న భర్తకేసి చూసింది.

'సంసార బంధాలమీద మనసు నిలపని భర్తతో కాపురం చేయడంకన్నా మాతృమూర్తిగా, తృప్తిగా జీవించడంలోనే ధన్యత ఉంది' అనుకుంది.

జరత్కారువు ఆమెను అలాగే చూచాడు ఓ క్షణం. అతని మనసు కదిలింది ఒక్క నిముషం. కానీ ఆమెను ఆశీర్వదించి పంపటమే ఉత్తమ మని పించింది. వెంటనే "నీ గర్భస్థ శిశువు మహాతేజోశాలి, ఉభయ వంశాలను ఉద్ధరిస్తాడు." ఆ మాట అని జరత్కారుడు వెళ్ళిపోతుంటే, అభిమానవతి అయిన జరత్కారువు అతన్ని ప్రాధేయపడదలుచుకోలేదు.

జరత్కారువుకు నవ్వు వచ్చింది. ఎటువంటి భర్త! భార్య మనసును, ప్రేమను గ్రహించలేని భర్త. కనీసం గర్భవతి అని కూడా జాలి కలగలేదు. జరత్కారువు కళ్ళు చెమర్చాయి ఆ నిముషంలో.

తన ప్రణయజీవితం అంత త్వరగా ముగుస్తుందని ఆమె కూడా అనుకోలేదు. అయితే ఆమెకు ఒక్కటే తృప్తి, ఒక్కటే గర్వం. తన జీవితం వృథా కాలేదు! తన గర్భాన మహాశక్తిసంపన్నుడైన పుత్రుడు ఉదయిస్తాడు. అంతే చాలు తనకి! గర్భవతి అయిన జరత్కారువు అన్న దగ్గరకు వచ్చింది. మాతృమూర్తిగా తన స్థానం మహోన్నతం చేసుకోవాలని నిశ్చయించుకుంది.

జరత్కారువు కుమారుడు దిన దిన ప్రవర్ధమానుడవుతూ, సకలవిద్యలూ అభ్యసిస్తున్నాడు. అది చూస్తూ ఆనందపడుతున్నా జరత్కారువు మనసు ఒక్కోసారి వికలమైనా, జరత్కారునితో తన విఫల ప్రేమను మరిచిపోయే ప్రయత్నం చేసింది.

తన కొడుకు ఆస్తీకుడు, అసమాన ప్రతిభావంతుడై కీర్తివంతు డవుతుంటే, తన జన్మ సార్థకమైందని ఆనందబాష్పాలు రాల్చింది మాతృమూర్తి జరత్కారువు. *

(ఆధారం : శ్రీమదాంధ్ర మహాభారతం :
ఆదిపర్వం : ద్వితీయాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 5-8-1987)

# పులోమ



భృగు మహర్షి ప్రాతః సంధ్యాసమయంలో స్నానార్థం బయలుదేర బోతున్నాడు. నిత్య యౌవనుడు, తేజోరాశి అయిన భర్తకేసి పులోమి చూస్తూ నిలబడింది. ఆ మహర్షికి అసాధ్యమయింది ఏదీ లేదని ఆమెకు పూర్తి నమ్మకం. అతని శక్తిని, అపారమైన జ్ఞానాన్ని ఏ స్త్రీ అయినా అంచనా వేయలేదని ఆమె అభిప్రాయం. అటువంటి మహాపురుషునికి ధర్మపత్ని కావడం తన మహాభాగ్యం అనుకుంటూ మహర్షికేసి పరిశీలనగా చూస్తోంది పులోమి. గంభీరమైన అతని ముఖాన్ని, విశాలమైన ఫాలభాగాన్ని, తీర్చిదిద్దిన, కొనతేరిన నాసికను చూస్తుంటే ఎప్పటి కప్పుడు కొత్తగా చూస్తున్న అనుభూతి కలుగుతోంది ఆమెకు. తననే పరీక్షగా చూస్తున్న భార్యని గమనించాడు భృగుమహర్షి.

"అగ్ని గృహంలో అగ్నులు సిద్ధం చేయి" అన్నాడు ఆమెతో. నిండు గర్భవతి పులోమి. రోజు రోజుకూ తేజోవంతంగా కనిపిస్తున్న ఆమెను చూస్తే ఎంతో ఆనందం కలిగింది భృగుమహర్షికి. గర్భవతులైన స్త్రీలు పాలిపోయిన చెక్కిళ్ళతో, శరీరాకృతి చెడి అందవికారంగా ఉంటారనే లోకపు వాడుకకు భిన్నంగా ఉంది పులోమి. తన భార్య సౌందర్యం ద్విగుణీకృతమవటం

ఆశ్చర్యంగా ఉంది మహర్షికి. ఆమె పట్ల తన అనురాగమూ ద్విగుణీకృతం అవుతోంది కదా! అప్రయత్నంగా సమీపించాడు ఆమెను. మెరిసిపోతున్న ఆమె చెక్కిళ్ళను స్పృశిస్తూ, చుబుకం పట్టుకుని అన్నాడు:

"నిండు గర్భవతివి. ఈ నిత్యకార్యక్రమాలు చేయటానికి నీకు బడలికగా లేదూ?" అతని చేతులు ఆమె నిండైన బాహువులపై నిలిచాయి. ఆ స్పర్శకి పులకించింది. చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి.

"లేదు స్వామీ! మీ స్పర్శ నాకు అనంతమైన శక్తినిస్తుంది. మీ అనురాగం ఎప్పుడూ కంటికిరెప్పలా కాపాడుతుంది నన్ను." నుదుట పట్టిన చెమట బిందువుల్ని తుడుచుకుంది పులోమి. భృగుమహర్షి స్నానార్థం ఆశ్రమం వదిలి నది వైపు నడిచాడు.

శ్రద్ధతో, భక్తితో అగ్ని గృహాన్ని పరిశుభ్రంచేసింది పులోమి. అగ్నుల్ని సిద్ధం చేసేసింది. ఒక్కమారు అగ్నిగృహమంతా కలయజూసి తృప్తిగా నిట్టూర్చింది.

అకస్మాత్తుగా ఒక ఆకారం అగ్ని గృహంలో ప్రవేశించటంతో పులోమి నిశ్చేష్ట అయింది. నిట్టనిలువైన వెంట్రుకలు, ఎర్రని గుడ్లు, నల్లని, వికృతమైన ఆకారం భయంకరంగా అటూ ఇటూ సంచరిస్తుంటే గజగజ వణికిపోయింది భయంతో. గర్భస్థ శిశువు కదలిక ఆగిపోయిందా అనిపించిందామెకు. ఆ రాక్షసుడి అడుగుల తాకిడికి భూమి అంతా ప్రకంపిస్తోంది.

నిండు గర్భవతి అయి, సౌందర్య రాశిలా ఉన్న పులోమివంక చూశాడు రాక్షసుడు. ఆమె సౌందర్యం అతన్ని ఉన్మత్తుణ్ణి చేస్తోంది. అగ్ని గృహమంతా పరిశీలనగా చూశాడు.

"ఎవరీమె?" అగ్నిహోత్రుణ్ణి ప్రశ్నించాడు. ఆ భయంకర ధ్వనికి ఆ అగ్నిగృహమంతా దద్దరిల్లిపోయింది ఒక్కసారి.

అగ్నిదేవుడు సందిగ్ధావస్థలో పడ్డాడు. తెలిసి ఉన్న విషయం చెప్పకపోతే అది అబద్ధం చెప్పినట్టే. నిజం చెబితే మునివల్ల శాపం తప్పదు. శాపాన్ని ఉపసంహరించుకోమని మునిని ప్రార్థించవచ్చేమో కాని, అనృతదోషంవల్ల వచ్చే పాపాన్ని తప్పించుకోలేనని వ్యాకులత చెందాడు. పాపభీతి అగ్నిదేవుణ్ణి మరీ భయపెడుతోంది.

''జాతవేదా! ఎవరీమె?'' రాక్షసుడి కంఠం పిడుగుపాటులా వినిపించింది.

''ఈమె భృగుమహర్షి భార్య - పులోమి.'' వెంటనే అనేశాడు.

రాక్షసుడు గడ్డు మిటకరించాడు. కళ్ళనుంచి నిప్పులు కురిపించాడు. ఈ రాక్షసుడు పులోముడు. ఆమె సౌందర్యాతిశయాన్ని, ఆమె గుణగణాల్ని విని వివాహం చేసుకోవాలనుకున్నాడు. కానీ, ఈమెను భృగుమహర్షి వివాహమాడటంతో విఫలీకృతుడయ్యాడు. ఒకనాటి తన ఓటమి, ఈనాటి ఆమె సౌందర్యం రాక్షసుణ్ణి మరీ రాక్షసుణ్ణి చేశాయి. అగ్ని గృహంలో ఓ మూలగా ఒదిగి ఉన్న పులోమిని సమీపించాడు. వరాహంగా మారి ఆమెను నెత్తిన పెట్టుకుని వేగంగా పరుగుతీశాడు రాక్షసుడు. ఈ హఠాత్సంఘటనతో పులోమికి గర్భచ్యుతి కలిగింది. కానీ, విచిత్రం! ఆ గర్భచ్యుత శిశువు మహా తేజోరాశి! ఆ కాంతిని నిశాచరుని కళ్ళు చూడలేకపోయినాయి. ఆ కాంతి జ్వాలలో ఆ క్షణంలో భస్మీభూతుడయ్యాడు రాక్షసుడు పులోముడు.

ఆనందంతో ఆ తేజఃపుంజాన్ని ఒళ్ళోకి తీసుకుని, త్వరత్వరగా ఆశ్రమంలోకి ప్రవేశించింది పులోమి. ఆమె కళ్ళు కన్నీళ్ళతో నిండిపోయాయి.

స్నానానంతరం ఆశ్రమంలోకి వచ్చిన భృగుమహర్షి పులోమి ఒడిలోని పసికందును చూశాడు తన సంతానానికి మూర్తిమూర్తి. తనకు ధర్మపత్ని పులోమి కావటం తన అదృష్టం అనుకుంటూ, ఆ తేజోరాశిని తన చేతిల్లోకి తీసుకుని తన్ను తాను మరిచిపోయాడు ఆ క్షణం మహర్షి.

పుత్ర జననోత్సవం నుంచి తేరుకుని, తను స్నానార్థం వెళ్ళి వచ్చే లోపల జరిగిన విశేషాలేమిటని ప్రశ్నించాడు భార్యను. పులోముడి రాక, అగ్నిదేవుడు తనను రాక్షసుడికి తెలియచెప్పటం, వరాహమైన రాక్షసుడు తనను ఎత్తుకుపోవటం, గర్భచ్యుతి, పుత్ర జననం, రాక్షస మరణం-అన్నీ వివరంగా గద్గదస్వరంతో, భయం భయంగా తెలుపుతూ భర్త బాహువుల్లో తలదాచుకుంది పులోమి. ఆమెను ఓదార్చాడు మహర్షి. తాను లేని సమయంలో భార్యకు కలిగిన ఆపదకు చింతించాడు. కానీ, అగ్నిదేవుడు రాక్షసుడికి తన భార్యను గురించి తెలియపరచటం మహర్షికి చాలా ఆగ్రహాన్ని కలిగించింది. వెంటనే అగ్నిహోత్రుణ్ణి ఆవాహనం చేసి ప్రశ్నించాడు. అగ్నిహోత్రుడికి తెలుసు మహర్షి శక్తి. భయపడుతూనే, అబద్ధం చెప్తే వచ్చే పాపానికి వెరిచి అలా చెప్పానని వినయంగా మనవి చేసుకున్నాడు అగ్ని తనకు కలిగే పాపభీతివల్ల తన భార్యకు

ఆపద కలిగించాడని అర్థమయిన భృగుమహర్షి అగ్నిదేవుణ్ణి క్షమించలేక పోయాడు. అతని సమాధానం సకారణంగా కనిపించలేదు మునికి. వెంటనే 'సర్వభక్షకుడివి క'మ్మని ఆగ్రహంతో శపించాడు భృగుమహర్షి.

భృగుమహర్షి శాపం శాసనమే! దానికి తిరుగులేదు. ఈ శాపం లోకానికే శాపమైంది. దేవతలకు, పితృదేవతలకు అందరికీ చెందే నైవేద్యాలు అగ్ని ముఖంగా చెందవలసిందే. తనే సర్వభక్షకుడై, అశుచి అయితే అందించవలసిన నైవేద్యాలు పవిత్రంగా అందించగలడా తను? పితృ కార్యాల ప్రయోజనం ఆగి పోక తప్పదు కదా! తప్పుచేయటం కన్నా నిశ్చలుడై ఉండటం మంచిదని తలచిన అగ్నిహోత్రుడు తన తేజస్సును ఉపసంహరించుకున్నాడు.

లోకాలు అల్లకల్లోలమయ్యాయి. బ్రహ్మదేవుడితో మొర పెట్టుకున్నారు దేవతలు. భృగుమహర్షి శాపానికి తిరుగులేదనీ, ధర్మపత్ని పట్ల అతనికున్న ప్రేమకి బద్ధుడై అతను అగ్నిని శపిస్తే, అందుకు తనేమీ చేయలేనని కూడా బ్రహ్మదేవుడికి తెలుసు. అయినా దేవతల ప్రార్థన బ్రహ్మను మార్గాంతరాన్ని ఆలోచింపజేసింది.

'విశ్వంలో అగ్ని కార్యాలు స్తంభించిపోకుండా చూడాలి' అనుకున్నాడు. సర్వభక్షకుడైనా అగ్నిభట్టారకుని శుచిత్వానికి ఏమాత్రం లోపం రాకుండా ఉండే వరాన్ని బ్రహ్మ అగ్నిదేవుడికి ప్రసాదించాడు.

పసికందు చ్యవనుడు తన ఒడిలో వెలుగు విరజిమ్ముతుంటే, "స్వామీ, మీరిచ్చిన శాపం ఎంతపని చేసిందో చూశారా?" అంది పులోమి భర్తవైపు గోముగా చూస్తూ.

"నీమీది ప్రేమతోనే ఆ శాపమిచ్చాను. కానీ, ఆ శాపం లోకకల్యాణానికి దారితీసిందిగా! అయినా నా భార్యకు ఆపద కలిగిస్తే ఎవరినైనా క్షమించను. ఎవరైనా శాపగ్రస్తులు కావలసిందే! నా ప్రియపత్ని కోసం నేను ఏమైనా చేయగలను."

మహా తపస్సంపన్నుడైన భృగుమహర్షికి తనంటే ఉన్న ప్రేమకీ, అనురాగానికీ తన్మయత్వం చెందింది పులోమి. *

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం : ఆదిపర్వం : ప్రథమాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 21-8-1987)

# యోజనగంధి



యమునానది ప్రశాంతంగా ప్రవహిస్తోంది. మధ్యాహ్నం దాటి కొద్ది గడియలయ్యాయి. సూర్యతాపం ఎక్కువగా ఉండటంతో జన సంచారం తక్కువగా ఉంది. కొందరు మధ్యాహ్నపు ఎండ వేడిమికి సేదదీర్చుకుంటున్నారు.

నది దాటేందుకు ఎవరైనా వస్తారేమో నని ఎదురు చూస్తోంది సత్యవతి.

నది ఒడ్డున చెట్టుకింద నావని ఆపింది. యౌవనవతి అయిన సత్యవతి చెట్టుదగ్గర నించుంటే ప్రకృతి దేవతలా కనిపిస్తోంది ఆ నిముషం. దూరాన్నుంచి వస్తున్న ప్రయాణికుణ్ణి గమనించి గబగబా దగ్గరికొచ్చి నిల్చుంది. మీసాలు, గడ్డాలతో ఉన్న వ్యక్తిని చూస్తూ 'ఈ సన్యాసా తన ఓడ ఎక్కేది!' అనుకుంది పరీక్షగా అతన్ని చూస్తూ. కానీ అతని నడకలో గంభీరత, చూపుల్లో తీక్ష్ణత, ముఖంలో వర్చస్సు స్పష్టంగా కనిపిస్తున్నాయి. భార్యమీద అలిగి ఇల్లు వదిలి వచ్చేస్తున్నాడేమో! సత్యవతి ఆ దగ్గరవుతున్న వ్యక్తిని మరీ మరీ గమనించడం మొదలుపెట్టింది. ఏ యువరాజో, చక్రవర్తో మునివేషం వేసుకున్నాడు. అంతే!

నిండైన వక్షోజాలపై ఆచ్ఛాదనంగా నిలిచిన ఏక వస్త్రాన్ని సరిచేసుకుని, వినయంగా ముఖంలోకి చూసింది సత్యవతి.

"నువ్వు ఒంటరిగా పడవ నడుపుతావా" - నఖశిఖ పర్యంతరం పరిశీలిస్తూ ప్రశ్నించాడు ఆయన.

"చిన్నప్పటినుంచి నీళ్ళలో పెరిగినదాన్ని, ఒక్కతినే పడవ నడపగలను. మీకేం భయం లేదు. రండి" నవ్వుతూ అంది దాశకన్య సత్యవతి.

మల్లెమొగ్గలా ఉన్న పలువరుస ఒక్కసారి మెరిసింది. తీర్చిదిద్దిన ఆమె నాసిక, ఎర్రని పెదాలు, బిగువైన వక్షోజాలు, నునుపైన బాహువులు వరుసగా, ముని చూస్తుంటే ఆమె కళ్ళు అటూఇటూ కదలిస్తూ మీనాక్షిలాగే ఉంది ఆ క్షణం. విశ్వకర్మకూడా ఇంతటి సుందరమైన మూర్తిని సృష్టించచలేడే! బ్రహ్మదేవుడు ఇంత అందమైన కన్యని ఎట్లా సృష్టించాడో-మహర్షి ఆమెను పరీక్షగా చూస్తూనే ఉన్నాడు.

జీవనాధారం కోసం పడవ నడుపుకునే ఈ పల్లెపిల్ల తనను మదనవివశుణ్ణి చేస్తోందేమిటి? దుష్ట శక్తుల్ని జయించి కాంతాకనకాలకు అతీతుడైన తను ఇంద్రియ నిగ్రహం కోల్పోతున్నాదేమిటి? దివ్యజ్ఞానంతో ఆమెకు సంబంధించిన భూత భవిష్యత్తులను ఆలోకనం చేశాడు. ఆమె దాసకన్య కాదు - వసురాజర్షి కుమార్తె. ఆమె వంక చిరునవ్వుతో చూశాడు మహర్షి. ఆమెకు అతని కామ ప్రవృత్తి భయాన్ని కలిగించింది. అతని సౌందర్యం ఆమెను ప్రలోభ పరుస్తోంది. అతని శరీరదారుఢ్యం, వర్చస్సు ఆమెకు ఆనందాశ్చర్యాలను కలిగిస్తున్నాయి. ఆ మహర్షి బాహువుల్లో తన జన్మ ధన్యమయితే? కనురెప్పలు పైకెత్తి ఓరగా చూసింది. 'అమ్మో! స్త్రీకి కన్యాత్వం పోతే ఇంకే మున్నట్టు? మరో వ్యక్తిని వివాహమాడే అర్హతే పోగొట్టుకున్నట్టు. తండ్రి దాశరాజు తనని పెంచి పెద్ద చేశాడు విద్యాబుద్ధులు నేర్పాడు. తనే అతని ప్రాణం అనుకుంటున్నాడు. తను పొరబాటు చేస్తే ఆ అపకీర్తితో బతకగలడా? తనమీద విశ్వాసంతో, ప్రేమతో ఉన్న వ్యక్తి బాధపడేట్లు తను క్షణభంగురమైన సుఖాన్ని కోరటం ఎంత నేరం!' ఆమె చూపులు మహర్షిపైనే ఉన్నాయి.

అవధులులేని కామంతో తనను సమీపిస్తున్న మహర్షిని చూసింది. తన ఆకర్షణను చంపుకుని, తన కోరికని తోసిపుచ్చి, తన సుఖాన్ని త్యాగంచేసి నిరా

కరిస్తే ఈ మహర్షి శపిస్తే తనేమవుతుంది? తను సత్యవతి...తన మనసులోని ఆలోచన ఆ మహానుభావుడికి చెప్పి అతని ప్రయత్నాన్ని వారించాలి-అనుకుంది.

''మహర్షీ! నేను దాశకన్యను. చేపలలో పుట్టి చేపలలో పెరిగినదాన్ని. మత్స్యగంధిని. మిమ్మల్ని స్పృశించే అర్హత లేనిదాన్ని" అంది వినయంగా.

మహర్షి చిరునవ్వు నవ్వాడు.

"అదా, బహుస్వల్ప విషయం! నీవు మత్యగంధివి కావిక. నీ శరీరం నుంచి యోజనం దూరం పరిమళాలు వెదజల్లేలా చేస్తాను. చూడు. నువిప్పుడు యోజనగంధివి."

సత్యవతి విస్తుపోయింది. సుగంధం శరీర మంతటా, ఆ ప్రాంతమంతటా వ్యాపించింది.

మహర్షి హస్తం ఆమె భుజంమీద వేశాడు.

"నా మనవి ఆలకించండి మహర్షీ! నా కన్యాత్వం చెడితే నా బతుకు నిరర్థకం. నాకూ, నా వంశానికి శాశ్వత కళంకం."

మహర్షి మళ్ళీ నవ్వాడు.

"అదీ బహుస్వల్ప విషయమే! నీ కన్యాత్వం చెడకుండా నీకు వరమిస్తున్నాను. నీకు కళంకం రాకుండా కాపాడుతాను."

సత్యవతి మరీ ఆశ్చర్యంగా అతన్ని చూసింది. అదెట్లా సాధ్యమో తెలియటంలేదు. ఈ మహర్షికి అసాధ్యమన్నది లేదేమో! సిగ్గుగా తలవంచుకుంది. సర్వాలంకార భూషిత అయిన యోజనగంధి, నావను వేగంగా నడిపి యమునా నదీ ద్వీపం దగ్గరకు చేర్చింది.

మహర్షి ఆమెను హృదయానికి హత్తుకుంటుంటే-''స్వామీ! ఇది పట్టపగలు. ఇది పడవ...!" మాటలు తడబడ్డాయి ఆమెకి. మహర్షి కౌగిలిలో ఒదిగిపోతూనే దట్టమైన చీకటి నలుమూలలా అల్లుకోవడం గమనించింది. ఆ చీకట్లో సత్యవతి కళ్ళు మిలమిల మెరిశాయి. మహర్షిని అపారమైన గౌరవంతో, భక్తితో, కోరికతో పెనవేసుకుని, ఆనందోద్వేగాలతో తన్మయురాలైంది యోజనగంధి.

చీకటిరేఖలు తొలగిపోయాయి. తన ప్రణయానుభవం స్మరించుకుంటూ పాదాలమీదపడిన సత్యవతిని లేవనెత్తాడు పరాశర మహర్షి.

"కన్యాత్వం చెడకుండా సద్యోగర్భం దాల్చి సుపుత్ర జనని వవుతావు." మహర్షి సత్యవతి శిరసు నిమిరాడు.

తన శరీరంనుంచి అనంతమైన శక్తి ఏదో బయటికొస్తున్న భావనతో తత్తరపాటు చెందుతున్న సత్యవతికి సక్షాత్కరించాడు - సహస్రసూర్యతేజోరాశి కృష్ణద్వైపాయనుడు. చూస్తుండగానే ఆ తేజోపుంజం ఆమె పాదాలమీద తల అన్చి-

"తల్లీ! పరాశర మహర్షికీ, నీకూ కలిగిన పుత్రుణ్ణి. నా తండ్రి ఇచ్చిన వరాలు ఆధారంగా, నీకు ఎలాటి ఆపదా రాకుండా కాపాడతాను. పని కలిగి నువ్వు పిలిచినప్పుడు పలుకుతాను" అంటూ చేతులు జోడించాడు. లోకకల్యాణార్థం తపోవనానికి బయలుదేరాడు వ్యాసమహర్షి, మహాభారత కర్త!

యమునానది ఒడ్డున పడవలోంచి దిగి యౌవనభారంతో దాశరాజు గృహంవైపు వయ్యారంగా అడుగులేసింది యోజనగంధి సత్యవతి. *

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం :
ఆదిపర్వం : తృతీయాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 19-8-1987)




పైల మహాముని సాయం సంధ్య సమయాన అనుష్ఠానాదులు పూర్తి చేసుకుని పెరటిలో పొన్నచెట్టుదగ్గర అరుగు మీద విశ్రయించారు. పున్నమి చంద్రుడు నిండుగా ప్రకాశిస్తున్నాడు. సిగలో జాజిపూలు తురుముకుంటూ మునిపత్ని పక్కన కూచోబోయింది.

"కొంచెం దూరంగా - ఇంకా నాశిష్యులు అటూ ఇటూ తిరుగుతున్నారు కదా!" భార్య వంక తదేకంగాచూస్తూ అన్నారు పైల మహాముని. ఆమె సున్నని భుజాల పైన, పల్చని చెక్కిళ్ళ పైన, ఎర్రని పెదాల పైన ఆ చూపులు క్రమంగా ప్రసరించాయి. సృష్టి వైచిత్ర్యం - మహా తపస్సంపన్నుడైన తను కూడా, ప్రపంచాన్నే శాసించగల తను కూడా, భార్యను దూరంగా కూచోమనడం-అర్థమేమిటి - తనూ అందరిలాగే సంఘంలో ఉన్న- సభ్యతనూ, కట్టుబాటునూ పాటిస్తున్నాడా - తన తపస్సుకీ, ధ్యానానికీ చాలా సహకరిస్తోంది తన ధర్మపత్ని. నఖ శిఖ పర్యంతం ఆమెను పరిశీలనగా చూశాడు ముని మరొక్కసారి.

మునిపత్ని చివాల్న ఆయన పాదాల చెంత కూర్చుంది. తన మాటను గౌరవించడం కోసమే తన పాదాల చెంత కూచుందా - ఏమో!

పైలమునిపాదాలకేసి చూపు నిలిపిందామె. ఎంతో కోమలంగా ఉన్నాయి పాదాలు - ఆశ్చర్యం - అడవిలో, ముళ్ళతో, రాళ్ళతో సంచరించే పాదాలేనా ఇవి? - లేత పచ్చిక తగిలితే కందిపోయేలా ఉన్నాయి! ఆ పాదాల్ని ఎన్నిసార్లు స్పృశించలేదూ, సేవించలేదూ, నమస్కరించలేదూ తను! వంచిన తల ఎత్తకుండానే, "నాదో చిన్న కోరిక స్వామీ!" అంది మునిపత్ని.

ముని ఆమె వంచిన శిరస్సునే చూస్తున్నాడు. ఏనాడూ, ఏ కోరికా కోరని తన ప్రియపత్ని కోరిక అని అంటుంటే భ్రుకుటి ముడి విడిచాడు. ఆమె తల వంచుకునే ఉంది. ముని చూపులు ఆమె శిరోజాలపై నిలిచాయి. తన భార్య శిరోజాల సొగసు తను ఎన్నిమార్లో తిలకించాడు. - అయినా ఈ పున్నమి చంద్రుడు కొంటెతనంగా, ఆమె శిరోజాల నిగారింపు, సొగసు, మరీ మరీ స్పష్టంగా కనబడేలా అదే ప్రకాశిస్తున్నాడు... ఆమె మనసులోని కోరిక వైపు మళ్ళించాడు మహర్షి మనసును.

"చెప్పు - నీ అభీష్టం" -

"నేను మీ ధర్మపత్నిని కదా!" -

"ఊఁ!"

"మీ శిష్యులు, పరిచారకులు, ఆశ్రమవాసులు ఎందరెందరో నన్ను చూస్తున్నారు కదా!"

"ఊఁ!" -

ఆమె తల పైకెత్తి భర్త ముఖంలోకి చూసింది.

"ఈ నా సౌందర్యం, అశుచియైన మనస్సున్న ఏ వ్యక్తి కంటపడ కూడదు స్వామీ!" -

పైల మహాముని దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టు కనబడ్డాడు.

"అలాటి ఉత్తమ స్థితి నాకు కావాలి - శుచియైన మనస్సున్నవారికే నేను కనపడాలి" - ఒక క్షణం ఆగింది మునిపత్ని.

"మీరు సర్వజ్ఞులు. నా కోరికలో దోషమేమైనా ఉందా?" ఆమె చూపులు ముని పాదాలపైనే ఉన్నాయి.

చిరు నవ్వు నవ్వి ఆమె శిరసు నిమిరాడు ముని.

"నువ్వు నా భార్యవి మాత్రమే కాదు. నా ప్రేయసివి. నా శిష్యురాలివి. నా భక్తురాలివి. నా సేవకురాలివి - నేనంటే నీకున్న ప్రేమ, గురుత్వం నాకు తెలియనివి కావు - ఈ కోర్కె తీర్చేందుకు నా శక్తి యుక్తులు ఎంత వరకు వెచ్చించాలి అని ఆలోచిస్తున్నాను." పైలముని భార్యకళ్ళలోకి చూశాడు.

ఆ కళ్ళు స్ఫటికంలా, నిర్మలంగా మెరుస్తున్నాయి.

మునిపత్ని తత్తరపడింది. "నా కోసం మీ శక్తి వెచ్చించటమా? ఒద్దు స్వామీ! - అది నా అభిలషితం కాదు. ఈ అల్పజీవి కోసం నిరంతర తపో దీక్షా పరులై సాధించినది ధార పోయడం నా కోరిక కాదు... మార్గాంతరమేదైనా ఉందేమో చూడండి." ముని కేసి చూసింది.

సౌందర్యరాశి, సుగుణాలఖని అయిన భార్యను హృదయానికి హత్తుకున్నాడు. స్వర్ణ కాంతులను మించిన ఆమె చెక్కిళ్ళు, రాగరంజితాలైన ఆమె పెదవులను చుంబించాడు. ఆమె సిగలోని తెల్లని జాజుల పరిమళం తెల్లని వెన్నెల్లా పరుగులు తీస్తోంది. వాయు వీచికల్లో నిండిన సౌరభం శరీరానికి అంతా హాయిని కలుగచేస్తూ ఉంటే అప్రయత్నంగా భర్త భుజాల మీద తల వాల్చింది. పున్నమి వెన్నెల మునిపై ప్రసరిస్తుంటే, తన్మయత్వంతో అతనిలో ఐక్యమైపోయిందా క్షణంలో.

"క్షమించండి - నా స్వార్థపరత్వానికి." నెమ్మదిగా గొంతు విప్పింది మునిపత్ని.

"కేవలం స్త్రీ ఇచ్చే సుఖాల కోసం ఎందరెందరు మునీశ్వరులు తమ తమ శక్తిని ధారపోశారో నీకు తెలియనిది కాదు. నా ధర్మపత్నివి. నా సహధర్మచారిణివి. నీ అభీష్టం తీర్చడం నా ధర్మం కాదా?" భర్త మాటలకు ఆమె నయనాలు తృప్తితో నిండిపోయాయి. పైల మహాముని బాహువుల్లో ఒదిగి పోయిందామె. ముని మనసు ఆమెకు అర్థమైపోయింది.

"నువ్వు శ్రీవ్రతం చేస్తే నీ కోరిక తీరుతుంది. కానీ అది సఫలీకృత మవాలంటే దివ్య రత్న కుండలాలు ధరించాలి."

ఉలిక్కిపడింది ఆమె. దివ్య రత్న కుండలాలా? అవి ఎలా లభిస్తాయి? ఆమె ముఖంలో ఏదో ఆందోళన నిండింది. ముని చిరునవ్వు నవ్వాడు.

"మహా పతివ్రత అయిన పౌష్య మహారాజపత్ని దగ్గర అవి ఉన్నాయి."

"మరి - "

"ఆమె సపాత్రదానం చేయడానికి వెనుకాడదు."

"నేను స్వయంగా ఎవరినీ అభ్యర్థించను కదా, అవి వచ్చే మార్గం?" సందేహంగా భర్తకేసి చూస్తూ అంది.

"అదే - వాటిని కాజేయాలని ఎప్పటి నుంచో తక్షకుడు ఎదురు చూస్తున్నాడు. అతను మహా బలశాలి, మాయావి. అతని బారిపడకుండా వాటిని తేగల సమర్థుడు ఎవరా అని ఆలోచిస్తున్నాను. అతడు నిర్మల మనస్కుడు, కార్యదీక్షాపరుడు, నిష్ఠాగరిష్ఠుడు, గురు సేవా పరాయణుడు అయి ఉండాలి."

పైల ముని ముఖం ఒక్కసారి గంభీరంగా మారింది. అతని కళ్ళ ముందు అష్ట సిద్ధి సంయుతుడైన ఉదంకుడు కదలాడాడు.

అంతలోనే "దివ్య రత్న కుండలాలు తెమ్మని ఉదంకుని నియోగిస్తారా?" అంది ముని పత్ని.

పైలముని మనస్సు సంతృప్తిపడింది. ఆ కార్య నిర్వహణా దక్షుడు ఉదంకు డొక్కడేనని తనకు తెలుసు. కానీ - తన భార్య కెలా తెలుసు! - ఈమె కేవలం గురు పత్ని మాత్రమే కాదు, మాతృమూర్తి, జ్ఞానవతి, వివేకవతి కూడా. - ఆశ్చర్యంగా భార్యకేసి చూస్తుంటే - చంద్రుడు వారి ఏకాంతానికి భంగం కలిగించకుండా మబ్బుల చాటున మాయమయ్యాడు.

పైల ముని తన శిష్యుడైన ఉదంకుడికి దివ్య రత్న కుండలాలు తెచ్చే మార్గం చెప్పి, ఆదేశించాడు. ఆ పనినే ఉదంకుడు తనకిచ్చే గురు దక్షిణగా భావిస్తానని చెప్పాడు.

అనితర సాధ్యమైన పౌష్య పత్ని రత్న కుండలాలు సాధించి, చెప్పిన నాల్గవ నాటికి తెచ్చి గురు పత్ని ముందుంచాడు సవినయంగా ఉదంకుడు.

దివ్య రత్న కుండలాలు ధరించి వ్రత దీక్షలో ఉన్న ధర్మ పత్ని, దివ్యత్వంతో తేజరిల్లుతుంటే, పరితృప్తుడైన పైలమహాముని పెదవుల్లో చిరు నవ్వు వెల్లివిరిసింది. *

(ఆధారం : కవిత్రయం వారి శ్రీమదాంధ్ర మహాభారతం : ఆదిపర్వం : ప్రథమాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 26-8-1987)

# దేవయాని

శుక్రాచార్యుల గారాలపట్టి దేవయాని, దూరంనుంచి వస్తున్న కచుణ్ణి చూసింది. బాగా వికసించిన పూలు, తియ్యగాపండిన పళ్ళు శ్రద్ధగా తెచ్చి దేవయాని ముందు పెట్టాడు కచుడు. తన తండ్రిదగ్గర శిష్యరికం చేయటానికి వచ్చి భయం భయంగా తన ముందు నిల్చున్న అతన్ని చూస్తుంటే దేవయానికి నవ్వొచ్చింది.

తన తండ్రి అంటేనే కాకుండా, తనంటేకూడా భయమా ఇతనికి? అది భయమో, భక్తో తెలుసుకోవాలనీ, అతని ముఖం పరిశీలనగా చూడాలనీ అనుకుంది దేవయాని.

వంచిన తల ఎత్తకుండా, వినయంగా మరలిపోతున్న కచుని ముఖం చూడడమే కుదరలేదు. మరుసటి రోజు గోక్షీరం తెచ్చాడు కచుడు. శుభ్రంగా ఉన్న పాత్రలో నురుగుతో ఉన్న పాలు- గుమ్మపాలు అవి.

మళ్ళా అదే వినయం. వంచిన తల ఎత్తకుండానే మరలి పోనటం - ఆ రోజూ కచుని ముఖం పరిశీలనగా చూడడం కుదరలేదు.

మరొకరోజు హోమధేనువుల్ని తోలుకు వచ్చిన కచుడు. ఉత్తరీయంలో కట్టిన పళ్ళు, పూలు పాడవకుండా తీసి దేవయాని ముందు ఉంచాడు. ఇప్పుడూ అదే నమ్రత- తల వంచుకు వేగంగా వెళ్ళిపోయాడు. ఆ నడకలో ఏదో ప్రత్యేకత ఉందనిపించింది దేవయానికి.

కచుడు తెచ్చిన వాటిమీద చూపు నిలిపింది. ఎన్నో రకరకాల రంగు రంగుల పూలు-వికసించి పరిమళాలు వెదజల్లే పూలు-నేత్రానందంగా ఉన్నాయి. ఒక్క మొగ్గకానీ, ఒక్క వాడిన పూవు కానీ లేదే వీటన్నింటిలో! ఎందు కింత శ్రద్ధ చూపిస్తున్నాడు కచుడు? తనకి పూవులంటే ఇంత ఇష్టమని ఎవరు చెప్పారితనికి? నలిగినా, పరిమళం లేకున్నా తను ఇష్టపడదు. పట్టి రంగులపూలు తనకి నచ్చవు. మూడురోజులైనా తన తండ్రి దగ్గరకొచ్చిన కచునికి తనగురించి ఇన్ని విషయాలు ఎలా తెలిశాయో? ఎదురుగా వున్న పూలు, పళ్ళు ఆకర్షణీయంగా

ఉన్నాయి. రెండు పొగడపూలు చేత్తో తీసుకుంది దేవయాని. తన పట్ల ఇంత అభిమానం, గౌరవం చూపిస్తున్న కచునిమీద తను అభిమానం చూపాలి. అన్ని విధాలా అతనికి సహాయం చేయాలి. సదుపాయాలు తనే శ్రద్ధగా కని పెట్టాలి. మనసులో నిశ్చయించుకుంది దేవయాని.

శుక్రాచార్యుల వారు తన కూతురు కచుడి విషయంలో ప్రత్యేకమైన బాధ్యత వహించటం గమనిస్తూనే ఉన్నారు. బృహస్పతి అంటే ఆమె కున్న గౌరవభావమది అని సంతసించారు. దేవయాని కచుణ్ణి పూజించి, గౌరవించినా అది బృహస్పతిని పూజించినట్లే అనీ, ఆ విధంగా ఆమెకు పుణ్యం దక్కుతుందనీ తృప్తిపడ్డారు.

ఎన్నిసార్లో కచుణ్ణి ప్రశ్నించాలని అనుకుంది దేవయాని - తనంటే చూపిస్తున్న అభిమానం గురించి. కానీ, బాలుడు, నియమవ్రత శీలుడు అయిన కచుడు ఏమనుకుంటాడో అని వెనుకాడింది. అలా అనుకుంటూండగానే రోజులు గడిచిపోతున్నాయి.

"ఇంత శ్రద్ధగా రోజూ ఇన్ని మంచి రంగురంగుల పూలు, పళ్ళు నాకోసం తెస్తున్నావు" దేవయాని ధైర్యం చేసి అడిగేసింది. వంచిన తల ఎత్తి, మొదటిసారిగా దేవయాని ముఖం చూశాడు కచుడు. అతని ముఖంలో తత్తర పాటు లేదు.

"విశాలమైన ప్రకృతి మనకి ఇన్ని మంచి వస్తువు లిస్తుంటే, ఇన్ని మంచి పూలు అందిస్తుంటే నలిగినవీ, మొగ్గలూ ఎందుకు కొయ్యాలి? అందుకే నేను మంచివే ఏరి తెస్తాను. ఇన్ని రుచికరమైన పండిన పళ్ళు ఉంటే, పచ్చివీ, కసురివీ ఎందుకు కొయ్యాలని, నేను బాగా మగ్గిన పళ్ళే తెస్తున్నాను."

కచుడు ఒక్క నిముషం ఆగాడు.

"అయినా మీరు నా గురు పుత్రిక. మీరంటే ప్రత్యేకమైన శ్రద్ధచూపటం నా కర్తవ్యమేగా!" నిదానంగా అన్నాడు.

కచుడి సమాధానం దేవయానికి ఎలాటి ఆనందాన్నీ తృప్తినీ కలిగించ లేదు. కచుడికేసి ఒక్కసారి చూసింది అతను మనసు దాచుకుంటున్నాడా? తన మీద ప్రేమకొద్దీ తెచ్చానని చెప్పడెందుకో? బాలుడు కనక ప్రణయభావాలు పైకి చెప్పడానికి భయపడుతున్నా డంతే నేమో!

నేలచూపులు చూస్తున్న కచుణ్ణి చూస్తుంటే దేవయానికి నవ్వొచ్చింది. అయినా చిలిపిగా-

"సువాసన ఉన్నపూలు నా కిష్టమనీ, తక్కినవి అందంగా ఉన్నా నా కిష్టముండవనీ మీకెలా తెలుసో?" అంది కవ్విస్తున్నట్టుగా.

కచుడు తికమక పడ్డాడు. ఏం సమాధానం చెప్పాలి? స్త్రీలతో, అందులోనూ యౌవనవతులైన స్త్రీలతో సంభాషించటం, వ్యక్తిగత విషయాలు మాట్లాడటం ఇవన్నీ దేవయానితోనే మొదలైన కచుడు, కంగారు పడటం గమనించిన దేవయాని పకపకా నవ్వింది.

కచుడు మరింత కంగారుపడ్డాడు - ఆమె మనసులో ఎలాంటి భావాలున్నాయో ఏమో - తను మాత్రం మనసును నిర్మలంగా ఉంచుకోవాలి. తను కేవలం కార్యసాధకుడు మాత్రమే కావాలి. ఇలా అనుకుంటూ దేవయానివైపు చూశాడు.

ఆమె చూపులు అతనిపైనే - ఆ బుద్ధిమంతనం, ఆ అమాయకత్వం, ఆ వినయం - చూస్తున్నకొద్దీ ఆమెలో కొంటెతనం పెరిగింది. ఈ కచుణ్ణి చెవి పట్టుకుని 'చెప్పు' అని బెదిరిస్తే తనే గురువులా ప్రవర్తిస్తే ఏంచేస్తాడు? ఆ వెర్రి ఆలోచనకి ఆమెకే నవ్వొచ్చింది. నవ్వు ఆపుకోలేక పైకి నవ్వేసింది. పరధ్యానంగా ఉన్న కచుడుకూడా దేవయానితోపాటు నవ్వేశాడు.

"ఇందులో విశేషమేముంది చెప్పండి? నేను వచ్చినరోజునే రాక్షస బాలురతో గోశాలకి వెళ్ళాను కదా! అక్కడ రంగు రంగుల పూలు ఎన్నో ఆ గోవులముందు పడేసి ఉన్నాయి. నాకు ఆశ్చర్యం వేయటమే కాకుండా, ఒక విషయం అర్థమైంది. ఇక్కడెవరూ వాసనలేని పూలు వాడరని. అందుకే ఎంత అందంగా ఉన్నా పరిమళం లేనివి నేను తీసుకురాను. మీకోసం తెచ్చేపూలు అన్నీ నేను ఏరిఏరి తెస్తున్నవే."

కచుడు అక్కడనుంచి కదిలాడు.

కచుడి పరిశీలనా శక్తిని, గురు పుత్రికగా తనమీద అతనికున్న గౌరవాన్ని తలుచుకుంటూ అలానే కూచుంది దేవయాని.

ఈ కచుని మాటల్లో తన పట్ల ప్రేమ కానీ, తన మనసుకి నచ్చిన మాటలుగానీ ఒక్కటి గానీ లేదన్న విషయం దేవయాని మనసుని బాధించింది. అతని ప్రతి మాట మళ్ళీ మళ్ళీ మననం చేసుకుంటున్నకొద్దీ దేవయానికి నిరుత్సాహం కలిగింది ... ఈ మాటు వచ్చినపుడు, - "నువ్వంటే నాకు ఎంతో ప్రేమ - నేనంటే నీకు ప్రేమ లేదా?" అని అడిగేయాలని గట్టిగా నిశ్చయించుకుంది. కానీ కచుడు తన తండ్రికి చెప్తే? తను అపహాస్యం పాలయితే?

ఒకటి మాత్రం నిజం - కచుడికి తనంటే అగౌరవం లేదు, నిర్లక్ష్యం లేదు, అశ్రద్ధ లేదు - అయినా విద్యాభ్యాసంకోసం వచ్చిన బాలుడు ఏం మాట్లాడుతాడిప్పుడే? దేవయాని కచుడిమీద తన ప్రేమను, ఆవేశాన్ని స్నేహంగా మార్చుకుంది అప్పటికి. కచుడి మాటల్నీ, రూపాన్నీ తలుచుకుంటూ, తన నిత్య కృత్యంలో మునిగిపోయింది.

## స్నేహం

బృహస్పతి కుమారుడు కచుడు నియమ వ్రతశీలుడు. బ్రహ్మచర్య దీక్షా సంపన్నుడు. ఆ విషయం గ్రహించిన దేవతలు ఎంతో విశ్వాసంతో మృతసంజీవనీ విద్య సంపాదించేందుకు శక్తి నేర్పు ఉన్న కచుణ్ణి ఎంపిక చేశారు. శుక్రాచార్యుణ్ణీ, దేవయానినీ సేవించటంలో లక్ష్యం మృతసంజీవనీ విద్య సంపాదించటమే. ఆ విషయాన్ని కచుడు విస్మరించలేదు.

దేవయాని చూపే ఆప్యాయతని కచుడు గమనిస్తూనే ఉన్నాడు. అతను ప్రేమపాశాల్లో చిక్కుకోదలుచుకోలేదు. దేవతల అభ్యర్థన అతని చెవుల్లో మారు మోగుతూనే ఉంది. శుక్రాచార్యులు కనపరచే పుత్రవాత్సల్యానికీ, దేవయాని ప్రకటించే అభిమానానికీ ఆనందం పొందుతున్న కచుడు, ఈ అవకాశం వాడుకుని వీలైనంత త్వరలో విద్య సంపాదించా లనుకుంటున్నాడు. తన వారికి సహాయం చేయాలని తాపత్రయపడుతూనే ఉన్నాడు. దేవయానిని సంతోష పెట్టమనీ, స్నేహంగా ఉండమనీ పెద్దలు చెప్పిన హితవును పాటిస్తూనే ఉన్నాడు. అయితే, అప్పుడప్పుడు దేవయాని చిలిపిచేష్టలు, అతిచొరవ, అధిక ప్రసంగం కచుడికి చిరాకు కలిగిస్తున్నాయి. దేవయానికి కోపం రాకుండా, శుక్రుడికి అసంతృప్తి కలగకుండా జాగ్రత్తగా మసలుకురావటం తేలికైన పనికాదు ఎంత

త్వరగా విద్య నేర్చుకుని ఇక్కడి నుంచి వెళ్ళిపోగలనా అని ప్రతి రోజూ అను కుంటూ కాలం గడుపుతున్నాడు.

దేవయానికి కచుడిమీద అనురాగం రోజు రోజుకీ వృద్ధి పొందడం మొదలైంది. అతని దినచర్యని శ్రద్ధగా కనిపెట్టడం ఆమె దినచర్యలో భాగమైంది.

కచుడు ఎప్పుడు స్నానసంధ్యాదులు పూర్తి చేస్తాడో, ఎప్పుడు రాక్షస బాలురతో అడవికి వెడతాడో, ఎప్పుడు విశ్రమిస్తాడో దేవయానికి బాగా తెలుసు. కానీ, రాక్షస బాలురతో కలసి అడవికి వెళ్ళటమే ఆమెను బాధించింది.

'అడవిలో నడుస్తుంటే, అతని సుకుమారమైన పాదాలు కందిపోతేః ముళ్ళూ, రాళ్ళూ గుచ్చుకుని రక్తం కారితేః అమ్మో!'

రాక్షస బాలుర వెంట నడుస్తూ, వెనకపడిన కచుని రూపం ఆమె కళ్ళ ముందు కనిపించింది. దీర్ఘంగా నిట్టూర్చింది దేవయాని.

దేవయాని మానసిక వికారాన్ని, యౌవనపు పొంగును గమనిస్తూనే ఉన్నాడు కచుడు. కాని, అతని ధ్యేయం అతని కళ్ళముందు నుంచి కొంచెం కూడా అటూ ఇటూ కదలలేదు. దేవతల ఆశలు వమ్ము చేయడు. నిజానికి దేవలోకం నుంచి వచ్చినప్పటి నుంచీ బెంగగానే ఉంది-ఎప్పటికి మృతసంజీవని లభ్యమవుతుందో, ఎప్పటికి తన వారిని చూడగలడోని. తన ఉత్తీర్ణతని చూసి, సంతృప్తితో వెలిగే తన తండ్రి ప్రసన్నవదనాన్ని తలుచుకున్నాడు కచుడు ఆ క్షణం. కానీ ప్రస్తుతం ఈ రాక్షస బాలుర అసూయ భరించటం ఎంత కష్టంగా ఉందో అని విషాదవదనుడయ్యాడు మరుక్షణం!

మనసులో కలత చెందుతున్నా, గంభీరంగా, కార్యదీక్షాపరుడై చరిస్తున్నాడు కచుడు. దేవయాని నుంచీ, గురువు నుంచీ, ఆదరాభిమానాలు పొందుతూనే ఉన్నాడు. దేవయానికి తనమీద ఎలాటి ఆశలూ రేకెత్తించకూడదని ముందే నిశ్చయించుకున్న కచునికి, దినచర్య కత్తిమీద సాములా తయారయింది.

ఆ సంధ్యాసమయంలో ఆకాశం ఎర్రని రంగు నింపుకుంది అందంగా. కిల కిలా రావాలతో తమ గూళ్ళు చేరాయి పక్షులు. మేతకు వెళ్ళిన హోమధేనువులు ఇంటికి మరలి వచ్చేశాయి. అగ్నిగృహంలో అగ్నులు ప్రజ్వరిల్లాయి. కచుడు ఇల్లు చేరలేదు.

దేవయాని తదేక దృష్టితో నిరీక్షిస్తోంది. ఇంకా కచుడి అడుగుల సవ్వడి ఆమె చెవులకి వినిపించనేలేదు.

పడమటి సంధ్యాకాంతులు చీకటిగా మారి, నలుదిక్కుల వ్యాపించాయి. పొన్న చెట్టుకింద గట్టుమీద దేవయాని అలాగే కూర్చుంది. ఇంకా కచుడి జాడ తెలియలేదు.

రివ్వున వీస్తున్న గాలికి దేవయాని పల్లెవాటు తొలగింది. ఉలిక్కిపడింది.

ఏదో అడుగుల కదలిక, గబగబా ముందుకు వచ్చింది. పొన్నచెట్టు నుంచి ఆకులు గాలికి కదిలి, నేలరాలాయి.

దేవయాని చూపు మళ్ళా అంతే!

కచుడు రాలేదు.

దట్టంగా అలుముకున్న చీకట్లో, అక్కడే అలానే కదలకుండా కూర్చుంది దేవయాని.

తన కోసం అందమైన పూలు ఏరుతూ, తన తండ్రికి శ్రద్ధగా సమిధలు ఏరుతూ ఆలస్యం చేశాడేమో! అయినా ఇంత సమయమా?

ఉన్నట్టుండి దేవయాని గుండె జల్లుమంది. అడవిలో క్రూరజంతువులూ, విషసర్పాలూ తిరుగాడుతుంటాయి. తన కచుడు ఏ ఆపదలోనైనా చిక్కుకుంటే? గజగజా వణికిపోయింది కళ్ళనిండా నీళ్ళు నిలిచాయి. అటూఇటూ తిరిగింది. మనసు మనసులో లేదు

శుక్రాచార్యుల దగ్గరనున్న విద్యార్థులందరిలోనూ పరిపూర్ణ వాత్సల్యాన్ని చూరగొన్నది కచుడొక్కడే. అందుకేగా రాక్షస బాలురకు అసూయ! కచుడి పట్ల తన ప్రేమ రహస్యంగా దాచుకోవటం ఇక సాధ్యం కాదనిపించింది దేవయానికి.

వేగంగా తండ్రిని సమీపించింది ఆమె. దీనంగా ఉన్న ఆమె ముఖం చూస్తూనే 'విషయమేమి'టని ప్రశ్నించాడు శుక్రుడు. జగత్పూజితుడైన బృహస్పతి కుమారుడూ, తన ప్రియ శిష్యుడూ అయిన కచుడు, అడవి కెళ్ళిన వాడు తిరిగి రాలేదా?

శుక్రుని మనసు కలత చెందింది. దేవయాని తండ్రి ముందు నిలబడే ఉంది.

వెంటనే శుక్రాచార్యులు ధ్యాననిష్ఠలో మునిగిపోయారు. ఆశ్చర్యం! మృతుడై, మద్దిచెట్టుకు కట్టేసి ఉన్న కచుడు ఆయన దివ్యదృష్టికి గోచరించాడు. రాక్షస బాలుర అసూయను గుర్తిస్తున్నాడు ఈ మధ్య. కానీ, ఇంత క్రూరానికి పాల్పడతారని అనుకోలేకపోయాడు శుక్రుడు.

ఆలస్యం తగదని వెంటనే మృతసంజీవనిని ఆదేశించాడు, కచుణ్ణి వెంట బెట్టుకు రమ్మని. తనకు అసమానమైన కీర్తినీ, గౌరవాన్నీ ఇచ్చిన మృతసంజీవనీ విద్య కచుణ్ణి క్షణాల్లో పునర్జీవితుణ్ణి చేయగలదు అని శుక్రుడికి తెలుసు.

'ఈ కచుడికే ఆపద కలిగితే, ఆ బృహస్పతి ముఖం ఎలా చూడగలిగే వాడిని నేను? దేవలోకంలో ఎలాటి అవమానాల పాలయేవాణ్ణి నేను!' అనుకుంటున్న శుక్రుడి ముందు కచుడు అవనతవదనుడై నిలబడ్డాడు.

దేవయాని ఆనందానికి హద్దు లేదు. రెప్పపాటు లేకుండా నఖశిఖపర్యంతం కచుణ్ణే చూస్తూంది ఆమె.

శుక్రాచార్యులు తనను పునర్జీవితుణ్ణి చేయటంలో ఈ దేవయాని పాత్ర ముఖ్యమైందే అయి ఉంటుందని అర్థమయింది కచుడికి. ఈమె ఋణం ఎలా తీర్చుకోవటం?

"నిన్ను నా కళ్ళతో చూసేవరకూ నా ప్రాణం నిలవలేదు!" దేవయాని మాటలకి ఏం చెప్పాలో తోచని కచుడు, "ఊ" అన్నాడు తలపంకించి.

"ఆ రాక్షస బాలురు నిన్ను చంపి, చెట్టుకు కట్టారని మా తండ్రి చెప్ప గానే వినేసరికి నా గుండె ఆగినట్లే అయింది తెలుసా? వాళ్ళు నిన్ను పెట్టిన బాధలు తల్చుకుంటే నా ఒళ్ళు జలదరిస్తోంది భయంతో." దేవయాని గొంతు గాద్గదికమైంది.

తనే తప్పు చేసినవాడిలా తల వంచుకు నిలబడ్డాడు కచుడు.

"నేను వచ్చేశానుగా, ఇంకెందుకీ వేదన?" నెమ్మదిగా అన్నాడు.

ఆ రెండు మాటలే దేవయానికి పన్నీటి జల్లులయ్యాయి.

"నువ్వు అడవికి హోమధేనువుల వెంట ఇక వెళ్ళొద్దు. ఆ పని రాక్షస బాలురే చేస్తారు. నేను మా తండ్రి గారితో చెప్పి, ఆ పని నుంచి నిన్ను తప్పిస్తాను. నువ్వు అడవికి వెళ్ళడం అంటేనే నాకు భయమేస్తూంది."

దేవయాని మాటలకి నవ్వొచ్చింది కచుడికి.

"విద్యార్థిగా అందరితో బాటు అన్ని పనులూ నేనూ చెయ్యాలిగా? అయినా ఇలా ఇంకోసారి జరగదులే" అన్నాడు ఆమెను సముదాయిస్తూ.

దేవయానికి కచుడిమీద అనురాగం ద్విగుణీకృతమైంది.

రాక్షస బాలురకు కచుడిమీద అసూయ పెరగసాగింది.

సంధ్యాకాంతులు ఆకాశంలో నిండే సమయానికి, రోజూ ఇంటికి క్షేమంగా వస్తున్న కచుణ్ణి చూసి దేవయాని మనసు ఆనందమగ్నమయింది. కచుడి కార్య దీక్షకు మురిసిపోయింది.

## ప్రణయాంకురం

రూపయౌవన లావణ్యవతి అయిన దేవయాని ఆ రోజు మరీ అందంగా అలంకరించుకుంది. కేశపాశాన్ని సరిచేసుకుంటూ, పూలకోసం అడవి కెళ్ళిన కచుడి రాకకై ఎదురు చూస్తోంది. ఆ కచుడు తెచ్చే పూలు అందంగా కేశ పాశంలో అలంకరించుకోవాలి కదా రోజూ! దేవయాని ఎదురుచూస్తూనే ఉంది. కానీ, కచుడు రాలేదు. అంధకారం నలుదిక్కులా వ్యాపించినా కచుడు రాలేదు. ఎదురు చూసి చూసి అలసిపోయింది. ప్రశాంతంగా ఉన్న నీటిలో చిన్న రాయి విసిరినట్టుగా, స్తిమితంగా ఉన్న దేవయాని మనసుకి కచుడి కోసం ఎదురు చూడటం అనేది కొంత కలత రేపింది. మళ్ళా రాక్షస బాలురు ఏదైనా ఆపద కలిగించారేమో? కాకపోతే పూలకోసం అడవి కెళ్ళిన కచుడు రావటానికి ఇంత ఆలస్యమా? దేవయాని మనసు భయంతో నిండిపోయింది. మనసు ఏదో కీడు శంకిస్తోంది.

శుక్రుడి దగ్గర కెళ్ళి మళ్ళా ప్రార్థిస్తే. తండ్రి ఏమనుకుంటాడో, ఎన్ని మార్లు దివ్యదృష్టితో లోకాలోకనం చేస్తాడు? ఒకవేళ తండ్రి తన ప్రార్థన వినక పోతే, తన గతేం కాను? కచుడు ఎక్కడున్నాడో, ఎందుకు రాలేదో ఎలా తెలుస్తుంది? తండ్రి తన మనసును గ్రహిస్తే? మానసిక సంఘర్షణలో కొట్టుమిట్టా డింది దేవయాని ఎంతోసేపు, ఎటూ దిక్కుతోచని స్థితిలో ఉంది. ఈ లోకమంతా

ఏమన్నా అనుకోనీ, తండ్రి తన స్థితి గ్రహించనీ, ఏమన్నా కానీ, తన కచుడు తన కళ్ళపడాలి. అంతే!

దీనంగా తండ్రిముందు చేతులు జోడించి నిలబడింది. సురాపానమత్తుడైన శుక్రుడు ఆమెని గమనించలేదు. చాలాసేపు అక్కడ నిలిచింది. ఎంతసేపని? ఆలస్యం ఆమెను ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. తండ్రి ఆమె వైపు చూడలేదు.

''ఈ రాక్షస బాలురు ఈ మాటూ కచుడికి ఏదో ఆపద తలపెట్టే ఉంటారు. మీరు కచుడిమీద చూపే వాత్సల్యం, నేను కచుడి పట్ల చూపే అభిమానం - వారిని మరీ అసూయాప్రేరితుల్ని చేస్తున్నాయి తండ్రీ! కచుడు ఆపదలోనే ఉండి ఉంటాడు. ఎలాగైనా అతన్ని రక్షించండి."

శుక్రాచార్యులు కూతురివైపు తిరిగాడు. శోకదేవతలా కనిపించింది. కానీ సురాపానమోహితుడైన శుక్రుని మనసుకి దేవయాని మనస్తాపం అవగాహన కాలేదు.

''వస్తాడులే - అతను చాలా ఉత్తముడు, సన్మార్గుడు. కనక, ఒకవేళ మరణించినా పుణ్యలోకాలకి చేరతాడు. ఆ కచుడి కోసం దుఃఖించకు. వెళ్ళు. నీ పనులు నువ్వు చూసుకో." శుక్రాచార్యుడి నిర్లిప్తత దేవయాని భరించలేక పోయింది.

కచుడంటే ప్రాణం కన్నా ఎక్కువగా చూసుకునే తండ్రే ఇలా ఉపేక్షిస్తే, ఇక తనకి దిక్కెవరు? దేవయాని ఆవేదనకు అంతులేదు.

''తండ్రీ! ఆ కచుడు సామాన్యుడా? బ్రహ్మచర్య వ్రతదీక్షా సంపన్నుడు. మీకు ప్రియతముడూ, అప్తుడూ అయిన శిష్యుడు. అతను ఆపదలో ఉంటే మీరు సురాపానమత్తులై, మనసుకి పట్టించుకోకుండా ఉండటం ధర్మమా?" దేవయాని గద్గద స్వరం శుక్రుణ్ణి ఏపాటీ కదిలించలేకపోయింది. సురాపాన మహదానందంలో ఉన్నాడు శుక్రాచార్యులు.

దేవయాని సహనం నశించింది. తండ్రికేసి తీక్ష్ణంగా చూసింది.

"సరే వినండి తండ్రీ! ఆ కచుణ్ణి చూస్తే కానీ నేను భోజనం చేయను. నా ప్రాణాలు పోయినా సరే ఇలాగే ఉండిపోతాను. నా ప్రాణాలు పోయినా సరే. మళ్ళా చెప్తున్నా - నా ప్రాణాలు పోయినా సరే" అంటూ దేవయాని భోరున ఏడ్చింది. ఆ రోదన ధ్వని, ఆమె పరుషవాక్కులు శుక్రుడి చెవికి శూలాల్లా గుచ్చుకున్నాయి. మత్తు వదిలింది. మహదానందం కరిగిపోయింది క్షణంలో.

"ప్రాణాలు పోయినా సరే" దేవయాని గొంతు మరొక్కసారి శుక్రుడి చెవిలో మారుమోగింది.

దేవయాని కన్నీళ్ళే తను చూడలేడు. అలాంటిది, దేవయాని ఆ కచుడి కోసం అన్నం తినక, క్రుంగి క్రుశించి ప్రాణాలు వదిలితే?

శుక్రాచార్యుడు కుమార్తె వంక పరిశీలనగా చూశాడు. శోకదేవత సాక్షాత్కరించినట్లు అనిపించింది. సమస్తాన్నీ జయించిన శుక్రుడు, పుత్రికా వాత్సల్యానికి తల ఒగ్గాడు. తన బంగారు తల్లి కళ్ళనీళ్ళు పెట్టడానికి వీల్లేదు. తన గారాల పట్టి మనసు బాధపడటానికి వీల్లేదు.

శుక్రాచార్యుడు శయనాగారం వదిలాడు. శక్తినంతా కూడదీసుకున్నాడు. తన కుమార్తె కోసం తను ఎంతటి పనినైనా సాధించగలడు. శుక్రుడు దివ్య దృష్టి ప్రసరించాడు. కచుడు కనపడలేదు. మళ్ళా ముల్లోకాలూ దివ్యదృష్టితో ఆలోకనం చేశాడు. కచుడు ఎక్కడా లేడు. ఆశ్చర్యం! మరీ ఆశ్చర్యం! సురాపాన సమ్మిశ్రితుడై తన ఉదరంలోనే కనిపించిన కచుణ్ణి చూసి నిర్ఘాంత పోయాడు!

ఇప్పుడు శుక్రుడి మత్తు పూర్తిగా వదిలిపోయింది. రాక్షస బాలుర ద్రోహం అర్థమయింది. సురాపానం ఎంతటి ప్రమాదానికి దారితీసింది! ఆ సర్వశాస్త్ర ప్రవక్త శిరసు సిగ్గుతో వంగిపోయింది. కచుణ్ణి చంపి, కాల్చి, ఆ బూడిద సురలో కలిపి రాక్షస శిష్యులిస్తే, అది సేవించిన తను ఈ లోకాన్నే మరిచి మత్తుడై పోయాడా! తన వివేకం, తన తపశ్శక్తి అన్నీ, అన్నీ ఏమయ్యాయి? శుక్రుడు పశ్చాత్తప్తుడయ్యాడు.

ఎదురుగా దేవయాని కనిపిస్తోంది. ఇప్పుడెలా? ఈ కచుణ్ణి బతికించట మెలా? ఈ గర్భస్థ కచుణ్ణి బతికించినా, తన ఉదరంలోంచి అత నెలా బయటి కొస్తాడు? మృతసంజీవనితో కచుడికి ప్రాణదానం చేస్తే, తన ఉదరం చీల్చుకుని అతను బయటికి వస్తాడు. తను పరమపదిస్తాడా? తన విద్య అక్కడితో పరిసమాప్తమైపోతుందా? శుక్రుడి మనసు ఉద్వేగభరితమయింది.

శిష్యులందరిలో విశ్వాసపాత్రుడు, గురుసేవాతత్పరుడు కచుడు. గర్భస్థ కచుడికే మృతసంజీవని బోధించాలి. అతను పునర్జీవితుడై, తన ఉదరం చీల్చుకు వచ్చి, తనని బ్రతికించాలి. ఇది సాధ్యమా? శుక్రుడికి ఒక్క నిముషమని పించింది. ఈ కచుడు తనను బ్రతికించకపోతే - తను మరణిస్తే? శుక్రుడి కళ్ళ ముందు నిలిచింది ఇద్దరే! దేవయాని, వృషపర్వ మహారాజు. తన దేవయాని

తను లేకుండా ఈ లోకంలో బతకలేదు. తన రాజు, తన నీతిమీద ఆధారపడి రాజ్యమేలుతున్న వృషపర్వుడు, అతని కూతురు శర్మిష్ఠ, అతని రాజ్య ప్రజలు- అందరూ తన మరణంవల్ల నిస్సహాయులవుతారు.

శుక్రాచార్యుడి పెదాలమీద మందహాసం వెల్లివిరిసింది. 'ఈ కచుణ్ణి బతికించి, నేనూ బతుకుతాను-'

శుక్రుడి ముఖంలోని చిరునవ్వు, దేవయాని నీళ్ళు నిండిన కళ్ళలో గొప్ప వెలుగు నింపింది.

నిశ్చల ధ్యానంలో ఉన్న తండ్రికేసి చూసింది. తనంటే తండ్రికి ఎంత ప్రేమ ఉందో తనకి తెలియంది కాదు. తన కోసం ఏ పనైనా చేయటానికి వెనుకాడడు తండ్రి. ఆ మహనీయునికి అసాధ్యమేముంది? దేవయాని గుండెలో కొండంత ధైర్యం నిండింది.

ఏ విద్య నేర్చుకోటానికి దివినుండి భువికి దిగి వచ్చాడో కచుడు, ఆ విద్య అప్రయత్నంగా సిద్ధించే శుభసమయ మాసన్నమైంది.

శుక్రాచార్యుడు సురాపానాన్ని మహాపాతకంగా శపించాడు ముందు. గర్భస్థ కచుణ్ణి మృతసంజీవనితో పునర్జీవితుణ్ణి చేశాడు. తనువు, ప్రాణం, శక్తి నింపుకున్న కచుడు, బయటపడే మార్గాన్ని బోధించమని శుక్రుణ్ణి వేడుకున్నాడు. మృతసంజీవనీ విద్యవల్ల మాత్రమే కచుడు బతకగలడు, శుక్రుణ్ణి బతికించ గలడు - వెంటనే శుక్రుడు మృతసంజీవనీ విద్యను ఉపదేశించాడు.

కచుడు ధన్యుడు. శుక్రుడి ఉదరం చీల్చుకు వచ్చిన కచుడు, తను నేర్చిన విద్యతోనే గురువుని బతికించాడు. దేవత లప్పగించిన బాధ్యత సునాయాసంగా నెరవేర్చాడు.

ప్రశాంతంగా, నిర్మలంగా ఉన్న కచుణ్ణి చూస్తూ, ఆనందబాష్పాలు ఒత్తుకుంది దేవయాని. 'ఈ కచుణ్ణి ఇక ఎవరూ చంపలేరు' గొప్ప సంతృప్తి కలిగిం దామెకి. ఆమెను చూస్తున్న కచుడి ముఖంలో కృతజ్ఞత కొట్టవచ్చినట్టు కనిపించింది.

'ఎంత అదృష్టవంతుడు తను! ఎంత త్వరలో అనితర సాధ్యమైన విద్య చేజిక్కింది!' గొప్ప విజయం సాధించిన భావం కచుడికి కలిగింది.

తన ప్రేమైక మూర్తి కచుడు అజేయుడు. కచుడు ఇక పూర్తిగా తనకు దక్కే సమయమాసన్నమైందని మురిసిపోయింది దేవయాని. దేవయాని ఊహా సౌధం ఆకాశపుటంచుల్ని చేరింది.

## విఫల ప్రేమ

మృతసంజీవని విద్య లభించాక కచుడి ప్రవర్తనలో మార్పు వస్తుందనే ఆశతో ఉన్న దేవయానికి నిరాశ ఎదురైంది. మునుపటిలాగే గురువుపైనా, గురు పుత్రిక పైనా అదే విధమైన భక్తి, అదే వినయం, అదే గౌరవం చూపిస్తున్నాడు కచుడు. దేవయాని పట్ల ప్రేమను ఏ మాత్రం వ్యక్తం చేయటంలేదు. దేవయానిలో సహనం నశించింది. ఇతని ప్రాణం నిలబెట్టడం కోసం తను ఎంత ప్రయాస పడిందో, తన తండ్రిని ఎంత ప్రేరేపించిందో తెలియదా - అని ఎన్నిసార్లో మనసులో అనుకుంది.

'రెండుసార్లు నిన్ను బతికించిం దెవరనుకున్నావ్ - నేనే తెలుసా?' అని కచుడికి చెప్పి, తన ప్రేమ వెల్లడి చేస్తే ఏమవుతుంది ? దేవయాని పరిపరి విధాల ఆలోచించింది. కానీ అంతలోనే దేవయాని మనసు మారింది.

తను పొరబడుతోంది కానీ అదివరకటి కన్నా కచుడు తనని ప్రత్యేకమైన శ్రద్ధతో గమనిస్తున్నాడు. తన నుంచి అభిమానం సంపాదించేందుకు తాపత్రయపడుతున్నాడు. అతని చూపుల్లో ఏదో నిగూఢత్వ ముంది. అతని చేష్టల్లో ఏదో ఆప్యాయత ఉంది. వచ్చినప్పుడున్న బాల్యం అతనిలో ఇప్పుడు లేదు. శరీరపు బంగారు రంగు, కొనదేరిన నాసిక, చూపుల్లో తీక్షత, మాటల్లో గాంభీర్యం- నూత్న యౌవనంతో మన్మథుణ్ణి మించిన సౌందర్యంతో కనిపిస్తున్నాడు తన కళ్ళకి. అతని సాహచర్యం తనకు లభించటం ఎంత భాగ్యం!

దేవయాని కచునితో తన ప్రణయం ఊహించుకుంటుంటే శరీరం గగుర్పాటు చెందింది. చిరు చెమటను తుడుచుకుంది. నిండైన తన శరీర సౌందర్యాన్ని ఒక్కసారి తనివితీరా చూసుకుంది. ఆమె బిగువైన వక్షోజాలు, ఎర్రని పెదవులు, నల్లని కురులు ఆమె అందాన్ని మరీ అతిశయింప చేస్తుంటే, కచుడి ఆలోచనలతో పరవశించిపోయింది దేవయాని.

ఒకనాడు దేవయానికి మెరుపులాటి ఆలోచన కలిగింది. విద్య అనంతమైంది. శుక్రాచార్యులు సమస్త శాస్త్ర కోవిదులు. ఏదో ఒక శాస్త్రం నేర్చుకుంటూ కచుడు దేవలోకం వెళ్ళకుండా ఇక్కడే ఉండిపోతే ఎంత హాయిగా ఉంటుంది అని పదే పదే తర్కించుకుంది మనసులో.

మృతసంజీవని విద్యను సంపాదించిన కచుడు, ముల్లోకాలనూ జయించి నంత మహదానందంలో మునిగిపోయాడు. గురు శుశ్రూష చేసి మంచి శిష్యు డనిపించుకున్నాడు. గురు పుత్రిక సేవలు చేసి ఆమె మనసును ఆకట్టుకున్నాడు. రాక్షస బాలురకు తన్నెదుర్కొనే ధైర్యం ఇకలేదు. తను సాధించాలనుకున్న విద్య సాధించాడు.

మనసు దేవలోకం మీదే ఉన్నా, విద్య నేర్చాక కూడా గురువును, గురు పుత్రిని సేవిస్తూ, సపర్యలు చేస్తూ కొంత కాలం గడిపాడు.

ఆ రోజు ఆశ్రమమంతా విద్యార్థుల అధ్యయనంతో మారుమోగుతోంది. ఉదయ సంధ్యా కాంతులు పొన్న చెట్టు మీద నుంచి శుక్రాచార్యుడి అగ్నిగృహం వైపు ప్రసరిస్తున్నాయి.

అవనత వదనుడై ముకుళిత హస్తుడై శుక్రాచార్యుడి ముందు నిలిచాడు కచుడు. చిరునవ్వుతో కచుడివైపు దృష్టిని సారించాడు శుక్రాచార్యుడు.

"ఆచార్యవర్యా! ఎంతో వాత్సల్యంతో మీరు అపూర్వమైన విద్యను నేర్పారు. మీ ఋణం తీర్చుకొనే భాగ్యం నాకు లేదు. కానీ నాయందు దయ దలచి, నాకు పితృ సేవా భాగ్యాన్ని, స్వజన సేవ భాగ్యాన్ని కలిగించండి, ఆశీర్వదించండి" అని పాదాభివందనం చేశాడు. కచుడి వినయ సంపద, కృతజ్ఞతా భావం శుక్రాచార్యుని మనసుని అలరింపచేశాయి. నిండు మనసుతో "విజయోస్తు, శుభమస్తు" అంటూ దీవించాడు.

కచుడు తిన్నగా దేవయానిదగ్గర కొచ్చాడు. అతని ఉత్సాహాన్నిచూస్తున్న దేవయాని సంబరపడిపోయింది. తన మనసు ఇతనికి అర్థమైందనుకుంది. తన మనసులోని విషయం విప్పి చెప్పడానికి ఇదే మంచి సమయమని నిశ్చయించు కుంది. కళ్ళలో మెరుపు, చెక్కిళ్ళలో ఎరుపు ప్రస్ఫుటంగా కనిపిస్తుంటే అధరం స్పందిస్తుంటే కచుడికి దగ్గరగా వచ్చింది దేవయాని.

"నువ్వు మా తండ్రి దగ్గరకొచ్చినప్పట్నుంచీ,నిన్నే నామనసులో నిలుపు కున్నాను. నీ ఎడబాటు నేను సహించలేను. నా ఆశలన్నీ నిరాశలైతే నేను జీవించలేను." ఆమె మాటలు తడబడ్డాయి. ఆమె ఏమంటుందో అర్థం కావటం లేదు కచునికి.

"ఇంక నా మనసు దాచుకోలేను. నువ్వు బ్రహ్మచారివి. నేను కన్యను. నా భావనలో మన కలయిక ఎన్నడో జరిగిపోయింది. మృత సంజీవని విద్యతో పాటు నన్నూ స్వీకరించు. నా ప్రేమను అర్థం చేసుకో." ఓర కంటితో కచుణ్ణి చూసింది.

నిర్ఘాంతపోయాడు. అశనిపాతం లాంటి ఆ మాటలకి అతనికి నోటమాట రాలేదు. అత్యంతమైన విషాదం అతని ముఖాన్ని అలుముకుంది. ఇలాంటి పరిస్థితి ఎదుర్కోవలసి వస్తుందని ఊహించని కచుడు స్తంభించిపోయాడు క్షణ కాలం. కానీ, ఇంత కాలం తనను అభిమానించి, తన ప్రాణాలు నిలబెట్టిన దేవయానికి ఏ సమాధానం చెప్పగలడు? దేవయానికేసి చూశాడు. ఆమెలో సౌందర్యం, ఏదో అమాయకత్వం, మరేదో అహంకారం, మరేదో పట్టుదల - అలా, అలా అతని కళ్ళముందు కదలాడాయి.

దేవయాని ఆత్రంగా అతనివంకే చూస్తోంది. తన మాట కాదనడనే ధైర్యం ఉన్న ఆమె ముఖంలో ఆశ చిగురించింది. కానీ, క్షణంలో అది మాయమైంది.

"నీ నోటితో ఇలాటి మాటలు ఉచ్చరించటమే అధర్మం. గురువుకు శిష్యుడు పుత్రునిలాటి వాడు. అంటే నువ్వు నాకు సోదరివి. ఈ ధర్మం విస్మరించావా? నువ్వంటే నాకు చాలా అభిమానం, గౌరవం. కానీ, నీ కోరిక మన్నించలేను."

కచుడి మాటల్లో గాంభీర్యం, అతని చూపుల్లోని నిశితత్వం దేవయానిని కదిలించి వేశాయి. ఒక్కసారి, వజ్రఘాతంలా గుండెను ముక్కలు ముక్కలు చేశాయి ఆ మాటలు, ప్రతి మాటా శూలంలా తిన్నగా మనసును గుచ్చుకుంటుంటే తీరని అవమానం పాలయింది అభిమానవతి దేవయాని ఆ క్షణంలో. అంటే! ఇంత కాలం ఈ కచుడు కపట నాటక మాడి తన మనసును మాయ చేశాడన్న మాట! ఇతడు వంచకుడు! ద్రోహి! విశ్వాసఘాతకుడు! దేవయాని కళ్ళు నిప్పులు కురిశాయి. శుక్రాచార్య తనయగా తన శక్తి సామర్థ్యాలు తనకి తెలుసు. ఇతనికేం తెలుసు? దేవయానిలో కచునిపై పగ పెరిగిపోయింది.

"నా ప్రేమ విఫలం చేశావు. కనక నీవు పొందిన మృత సంజీవనీ విద్య పని చేయదు! తక్షణం ఇక్కడి నుంచి కదులు."

ఉగ్గురాలైన దేవయాని ఆడనాగులా కనిపించింది కచుడి కళ్ళకు. ధర్మ పరుడైన కచుడు ఆమె వంక ప్రశాంతంగా చూశాడు. కచుడు నియమ నిష్ఠా గరిష్ఠుడు. వేదాధ్యయన తత్పరుడు. గురు సేవా పరాయణుడు. బ్రహ్మచర్య దీక్షా సంపన్నుడు. అలాటి కచుడు సాధించిన విద్య నిష్ప్రయోజన మవటమా?

"నీ శాపం వల్ల మృత సంజీవని విద్య నాకు పని చేయక పోయినా, నా చేత ఉపదేశం పొందినవారికి పని చేయును గాక! అధర్మపరురాలవైన నిన్ను, అహంకారివైన నిన్ను సవర్ణుడు చేపట్టకుండును గాక!"

ధర్మపరుడైన కచుడి శాపానికి దేవయాని గజగజ వణికిపోయింది. తిరిగి ఆమె వంక చూడకుండా వేగంగా కదలిపోయాడు కచుడు.

అనుకోని ఈ సంఘటనకి దేవయాని క్రుంగిపోయింది. అనుదినం పెంచు కున్న ఆశలూ, కన్న కలలూ ఇలా క్షణంలో కూలిపోవటంతో, ఒంటరిగా, నిస్సహాయంగా గున్నమావి చెట్టు కింద కూచుని, మోకాళ్ళపై తలాన్చి వెక్కి వెక్కి ఏడ్చింది.

తన ప్రేమ విఫలమైంది. తన యౌవనం అడవి కాచిన వెన్నెలైంది. సృష్టికర్త తన కీ సౌందర్యాన్ని ఎందుకిచ్చినట్లు - అనుకుంటూ, దీర్ఘంగా నిట్టూర్చింది దేవయాని.

తన జీవితానికి మరణమే శరణ్యమా? కాదు కాదు. తను పిరికిది కాదు. తన శక్తి యుక్తులు తనకి తెలియనివి కావు. తను శుక్రాచార్యుల ఏకైక పుత్రిక. ఈ తన ఓటమి భవిష్య జీవితానికి ఓటమి కాకూడదు. స్వాభిమానవతి అయిన దేవయాని తన జీవితానికి మార్గాంతర మేమిటో అనే ఆలోచనలో చెక్కిట చేయి చేర్చి, అలాగే కూర్చుండి పోయింది.

## ఆశాంకురము

స్వాభిమానవతి దేవయాని కచునిపట్ల తన ప్రేమ విఫలమైందని మన స్తాపం చెందినా వెంటనే తన శక్తి యుక్తుల్ని కూడదీసుకుంది. మనస్సును స్థిమితపరుచుకుంది. కచుని ప్రేమ ఒక్కటే తన జీవిత లక్ష్యం కాదని నిశ్చ యించుకొంది. తాను యౌవనవతి, సౌందర్యవతి, సర్వశాస్త్ర పారంగతురాలైన శుక్రాచార్యుల కుమార్తె, స్వర్గాధిపతి ఇంద్రుడి మనవరాలు - తనకేం తక్కువని బాధపడాలి.

దేవయాని గుండె ధైర్యం తెచ్చుకుని, జీవితం పట్ల ఆశ నింపుకుంటున్న సమయంలో, కచుడి శాపం గుర్తొచ్చింది. పెదాలపైన చిన్న నవ్వు నిలిచింది. ఈ వృషపురంలో తనకు ఈడైన పురుషుడు లేడు. అయినా శుక్రాచార్యుని ఏకైక పుత్రికకు, ఏ ధర్మమో, న్యాయమో అండగా నిల్చి సక్రమ మార్గాన్ని చూపించదా? దేవయానికి భవిష్యత్తు ఆశాజనకంగా కనిపించింది. ఎప్పుడు ఏం జరుగుతుందో ఎవరికేం తెలుసు?

దేవయాని అలా అనుకుంటుండగానే ఎదురుగా గున్నమావిమీది కోయిలమ్మ మధురమైన కంఠం చెవికి సోకింది. అంతలోనే, వనవిహారానికి రమ్మని దేవయానికి ఆహ్వానం పంపింది రాజకుమారి శర్మిష్ఠ.

వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ, ఆమె పరిచారికాసహస్రం, దేవయాని, అంతా కలసి వన విహారానికి, జలక్రీడకు బయలుదేరారు. ప్రశాంతవాతావరణం, ప్రకృతి శోభ వారి మనసులకీ, శరీరాలకీ ఆహ్లాదాన్ని కలిగించింది. కొలనులో ఒకరిమీద ఒకరు నీరు జల్లుకుంటూ, కలువ మొగ్గల్ని ఒకరిమీదికి ఒకరు విసురుకుంటూ, పరిహాసాలాడుకుంటూ కాలాన్ని మరిచిపోయారంతా.

ఉన్నట్టుండి ఏదో పెద్ద ధ్వని ఆ ప్రాంతమంతా ప్రతిధ్వనించినట్టయింది. జల క్రీడల్లో అప్పటివరకు నిమగ్నమైన వాళ్ళంతా సంభ్రమంతో అటూ ఇటూ చూశారు. ఎక్కడా ఏమీ కనిపించలేదు. అదో పెద్దగాలి-భయంకరమైన గాలి-హోరుమంటున్న ధ్వనిలా ఉంది.

జలక్రీడలు ఆపి, తత్తరపాటుతో వాళ్ళంతా గట్టుకు చేరుకున్నారు. ఒడ్డున ఉన్న ఆ వస్త్రాలు గాలికి ఒకదానితో ఒకటి కలిసిపోయాయి. వేగంగా గట్టుచేరిన శర్మిష్ఠ తొందరలో చేతికందిన వస్త్రాన్ని శరీరానికి చుట్టుకుంది. అది దేవయాని చీర!

ఉధృతంగా గాలి వీస్తూనే ఉంది. దేవయాని గట్టు చేరింది. తన చీర శర్మిష్ఠ ఒంటిమీద కనిపించింది. అంతే, తను శర్మిష్ఠ చీర కట్టాలా? ఛీ! ఇది తీరని అనుమానమనిపించింది దేవయానికి.

"నేనెవరనుకుంటున్నావే? శుక్రాచార్యులవారి పుత్రికను. తెలియదా? నీవు కట్టి విడిచిన బట్ట నేను కడతానా?" దేవయాని ఉరిమింది. శర్మిష్ఠ తీక్షణంగా దేవయాని వంక చూసింది. దేవయాని పట్టించుకోలేదు.

"నీ తండ్రి, నీరాజ్యంలో ప్రజలు అందరూ నా తండ్రి సహాయం మీద, హితవు మీద ఆదారపడి బతుకుతున్నారు. మరిచిపోకు. నువ్వు కట్టిన బట్ట నేను కడతానా?" దేవయానిలోని అహంకారం ఆడనాగులా బుసలు కొట్టింది.

"ఓహో! మా తండ్రి రాజ్యంలో, మా తండ్రిని పొగిడి దీవించి, పొట్ట నింపుకుంటున్నారు మీ తండ్రి. నీకు అంత గర్వమా? నేను కట్టిన బట్టకట్టవా?"

శర్మిష్ఠ కోపావేశంతో పరిచారికల సహాయంతో నగ్నంగా ఉన్న దేవయానిని ఈడ్చుకువచ్చి దగ్గరలో ఉన్న బావిలోకి తోసేసింది. పరిచారికా సహస్రంతో గర్వంగా అంతఃపురం చేరింది.

వృషపర్వుని రాజ్య వైభవమంతా శుక్రాచార్యుల వారిపైనే ఉంది వృషపర్వునికి శుక్రుడంటే భక్తిప్రపత్తులున్నాయి. వేదవేదాంగపారంగతుడు, నీతి శాస్త్రవేత్త అయిన శుక్రాచార్యుని ఏకైక పుత్రికకు తీరని అవమానమా? దేవయానిలో అసూయ, ద్వేషం మరింత పెరిగిపోయాయి. తండ్రితో చెప్పి వృషపర్వుని రాజ్యాన్ని సర్వనాశనం చేయించాలి. ఈ బావిలోంచి బయటపడి ఎలాగైనా శర్మిష్ఠమీద పగ సాధించాలి. దేవయాని కళ్ళు నిప్పులు కురిశాయి ఆ క్షణం.

ఎవరైనా ఆ మార్గాన రాకపోతారా, తనను రక్షించకపోతారా అనే ఆశతో ఎదురుచూస్తూన్న దేవయానికి ఎక్కడో గుర్రపుడెక్కల చప్పుడు వినిపించింది. ఆ శబ్దం అలా వచ్చి వచ్చి ఆగిపోతుంటే, దేవయాని ఊపిరి బిగబట్టి, బావిలో ఉన్న చెట్టు వేళ్ళని ఆధారం చేసుకుని ఎదురుచూస్తోంది

అడవికి వచ్చిన యయాతి మహారాజు తిరిగి తిరిగి అలసిపోయాడు. నీటి కోసం వెతుకుతూ, అడవిలో ఉన్న బావి దగ్గర కొచ్చాడు. ఏదో ఆర్తనాదం వినవస్తోంటే, అప్రయత్నంగా బావిలోకి చూశాడు.

దిగ్భ్రాంతుడయ్యాడు యయాతి. సంపూర్ణ యౌవ్వనంలో వెలిగిపోతున్న స్త్రీమూర్తిని చూస్తూ మళ్ళీ బావిలోకి తొంగి తొంగి చూశాడు. నిండైన వక్షోజాల మీద కన్నీళ్ళు జలజల ప్రవహిస్తున్నాయి. పద్మాల్లాంటి కళ్ళు దుఃఖంతో ఎరుపెక్కి మరీ అందంగా కనిపించాయి. ఆ శరీరావయవాల పొందిక అతని చూపుల్ని అటునుంచి మరల్చలేకపోయింది.

క్షణంలో, యయాతిలోని రాజధర్మం మేల్కొంది. ఈమెను ఉద్ధరించాలి. ఈ పాడు పడిన బావినుంచి వెంటనే పైకి తీయాలి. యయాతి దేవయానికేసి చూస్తుంటే, ఇంతకుముందు వేటకు ఆ ప్రాంతానికి వచ్చిన యయాతిని చూసింది గనుక, వెంటనే గుర్తించింది దేవయాని.

"ఎవరు నువ్వు? ఈ బావిలో ఎలా పడ్డావ్?" అన్నాడు యయాతి మహారాజు సానునయంగా.

తాను ప్రసిద్ధుడైన శుక్రాచార్యుని కుమార్తెననీ, ప్రమాదవశాన బావిలో పడ్డాననీ, ఉద్ధరించి పుణ్యం గట్టుకోమని చెప్పి, యాయాతిని వేడుకుంటుంటే దేవయాని గొంతు గాద్గదికమైంది.

రాజధర్మం మూర్తీభవించిన యయాతి మహారాజుకి ఆమె దీనస్థితి చూస్తుంటే మనసు కరిగిపోయింది. తన దక్షిణ హస్తంతో ఆమె కరకమలాన్ని పట్టి బావిలోనించి పైకి తీశాడు. దేవయాని శరీరాచ్ఛాదనం కోసం తన మీద ఉన్న ఉత్తరీయాన్ని ఆమెకు ఇచ్చాడు.

యయాతి హస్తస్పర్శకు పులకించిపోయింది దేవయాని. కృతజ్ఞతా పూర్వకంగా దేవయాని నమస్కరిస్తుంటే, యయాతి ఆర్తురాలిని ఉద్ధరించాననే తృప్తితో తన పురానికి బయలుదేరాడు.

యయాతి మరలిపోయిన తరువాత కచునిశాపం గుర్తొచ్చింది దేవయానికి. తన చేయిపట్టి బావిలోనుంచి బయటకుతీసిన యయాతి రూపం ఆమె కళ్ళముందు నిలిచింది. ఇంతకు ముందు అడవికి వేటకు వచ్చినప్పుడు యయాతిని చూసింది కానీ, పరిశీలనగా చూసే అవకాశం కలుగలేదు దేవయానికి. ఆజానుబాహుడు, రాజఠీవితో ఒప్పారిన యయాతి ముందు నిష్ఠాగరిష్ఠుడై, నియమవ్రతశీలుడైన కచుడు ఎలా సాటి వస్తాడు? శౌర్యధైర్య పరాక్రమాలతో రాజ్యపరిపాలన చేస్తున్న ఈ మహాచక్రవర్తికీ వ్రతదీక్షాపరుడైన బ్రహ్మచారికీ సామ్యమా?

యయాతి మహారాజు హస్తస్పర్శ దేవయానికి పులకాంకురాలు కలిగిస్తూనే ఉంది. యయాతి మహారాజు తనను వివాహం చేసుకుంటే, మహారాణి భోగభాగ్యాలు తను అనుభవిస్తుంటే ఓహో! దేవయాని ఆలోచనలు పరుగులు తీశాయి. తనకు మహారాణి యోగం ఉండబట్టే ఆ ఛాందస బ్రహ్మచారి పొత్తు తప్పింది. దేవయాని అటూ ఇటూ చూసింది.

యయాతి మహారాజును వివాహమాడటం తనకు సాధ్యమా? ఎందుకు కాదు? దేవయాని చూపులు తీక్షణమయ్యాయి. అదే తన జీవిత లక్ష్యం! ఆ లక్ష్య సాధనకి మార్గమేమిటో ఆలోచిస్తూ ఆ బావి దగ్గరే నిలబడింది

యయాతి మహారాజును తలుచుకుంటుంటేనే అణువణువూ స్పందించింది దేవయానికి. ఆశాసౌధాలు నిర్మిస్తూ అలాగే ఉండిపోయింది దేవయాని అక్కడ అడవిలో బావి దగ్గర.

## పాణిగ్రహణం

ఆలోచనా సముద్రంలో ఈదులాడుతున్న దేవయాని భుజం మీద ఎవరో చేయివేసే సరికి ఉలిక్కిపడింది. వెనక్కి తిరిగి చూస్తే తన పరిచారికే! వృష పర్వపురానికి రమ్మని ప్రార్థిస్తుంటే శర్మిష్ఠ చేసిన అవమానం ఉప్పెనలా ఆమెను కదల్చివేసింది.

అవమానంతో ఆ వృషపర్వపురంలో తను మళ్ళా అడుగు పెట్టడమా? అసంభవం! కానీ తన భవిష్యత్కార్యక్రమ మేమిటో తనకే తెలియటం లేదు. తన తండ్రి శుక్రాచార్యులు అన్నీ నిర్ణయించగల సమర్థుడు. తనకు జరిగిన అవమానం, తను తీసుకున్న నిర్ణయం తండ్రికి తెలియజేయమని చెప్పి పరిచారికను పంపించేసింది దేవయాని.

ఆ బావిలో నుంచి తన చేయిపట్టి తనను పైకి తీసిన యయాతి రూప రేఖలు తనని వెంటాడుతుంటే, తనకు జరిగిన అవమానం తనను దహించి వేస్తుంటే, దీర్ఘంగా నిట్టూర్చింది దేవయాని.

దేవయాని స్థితి, నిర్ణయం విని నిర్ఘాంతపోయాడు శుక్రాచార్యుడు. వేగంగా బావి దగ్గరకొచ్చాడు. కోపంతో, ఆవేశంతో మలమల మరిగిపోతోంది దేవయాని.

ఆమెను చూడగానే అతని మనసు కదిలిపోయింది. గారాలపట్టి కన్నీళ్ళు అతను చూడలేడు. అయినా ఆమెను సముదాయిస్తూ, కోపం వల్ల వచ్చే శత విధాలైన అనర్థాలను వివరిస్తూ, ఎంతో సేపు ప్రయత్నించాడు ఆమె మనసు మార్చాలని.

ఏ పరిస్థితిలోనూ వృషపర్వపురంలో అడుగు పెట్టనని పట్టుబట్టిన కూతుర్ని చూస్తుంటే ఏం చేయాలో తోచలేదు శుక్రాచార్యునికి.

ప్రాణంతో సమంగా చూసుకుంటున్న కుమార్తె ఒక వంక, ప్రాణంతో సమానంగా పెద్ద చేసిన వృషపర్వుని రాజ్యం మరోవంక. ఇటు కుమార్తె బాధ్యత, అటు రాజ్యపరిక్షణ బాధ్యత. ఏది నిలుపుకోవాలో, ఏది వదులుకోవాలో తేల్చుకోలేక మానసిక సంఘర్షణలో కొట్టుమిట్టాడాడు శుక్రాచార్యుడు. అతని మనసు చివరకు కుమార్తెవైపే మొగ్గింది.

దేవయానిని వదిలి తనుండలేడు. దేవయాని తన సర్వస్వం. తన ప్రాణం.

తండ్రి నిర్ణయానికి మురిసిపోయింది దేవయాని.

ఈ వార్తవిన్న వృషపర్వుడు ఆశ్చర్యపోయాడు. గజగజలాడిపోయాడు భయంతో! శుక్రుడు లేకపోతే తనకీ రాజ్యం నిలవదు. శర్మిష్ఠ తప్పిదాన్ని మన్నించమని కోరటానికి, దేవయాని కోరిక ఏదైనాసరే తీర్చటానికి, శుక్రుణ్ణి వెంటపెట్టుకురావటానికీ హుటాహుటీ బయలుదేరాడు వృషపర్వుడు పరివారంతో.

దేవయాని ముఖం పక్కకు తిప్పుకుంది. శుక్రునికి నమస్కరించి శర్మిష్ఠను క్షమించమని కోరాడు వృషపర్వుడు.

శుక్రుడు దేవయానివంక చూశాడు.

దేవయాని చూపుల్లో అగ్నిజ్వాలలు పెల్లుబికాయి.

దేవయాని కోరిక తీరుస్తానని వాగ్దానం చేశాడు వృషపర్వుడు.

ఈ అవకాశం కోసం ఎదురుచూస్తున్న దేవయాని కళ్ళముందు, తనను ఈడ్చుకుపోయి బావిలో పడేసిన శర్మిష్ఠరూపమే నిలిచింది. ఆ శర్మిష్ఠ కన్యకా సహస్రంతో తనకు దాసికావాలి-అదే తన కోరిక!

శుక్రాచార్యుడు దేవయాని కోరిక విని విస్తుపోయాడు.

వృషపర్వుడు నిశ్చేష్టితుడయ్యాడు.

దేవయాని పట్టుదల, పగ, కక్ష ఎలాటివో శుక్రునికి తెలియబట్టి చాలా వ్యథ చెందాడు. సురక్షిత రాజవైభవం కోసం కుమార్తె సుఖం త్యాగం చేయక తప్పిందికాదు వృషపర్వుడికి!

దేవయాని ఆనందానికి హద్దులేదు. శర్మిష్ఠ తన దాసి. కన్యాకాసహస్రం తన పరిచారికలు ఇక. తను సాధించలేనిదేముంది అని గర్వంగా అనుకుంటున్న దేవయానిని యయాతి రూపం వెంటాడుతూనే ఉంది. ఆమె మనసుకి మానసిక ప్రశాంతత కరువైంది. కచుని శాపం చెవుల్లో మారుమోగుతూనే ఉంది. యయాతి మహారాజును మళ్ళా చూడగలనో లేదో అనే బెంగ మనసులో మెదులుతూనే ఉంది.

రోజులు గడుస్తున్నాయి ఆనాడు ప్రకృతిశోభ ఇనుమడించినట్లుంది. ఎక్కడ చూసినా వికసించిన పుష్పాలు, ఎటుచూసినా పక్షుల కిలకిలారావాలు- ఉద్యానవనం నందనవనంలా వుంది.

పరిచారికా సహస్రంతో, దాసి శర్మిష్ఠతో మహా వైభవోపేతంగా వన విహారానికి బయలుదేరింది దేవయాని. కడివెడు కన్నీళ్ళు గొంతులో దాచుకుని వెంట నడిచింది శర్మిష్ఠ.

అంతా వనంలో పూలు కోశారు. అక్కడున్న అశోక, వకుళ, పున్నాగ, గన్నేరు వృక్షాలకింద విహరించారు. దగ్గరలోని ఇసుక తిన్నెమీద కూచుని వినోద కాలక్షేపం చేశారు.

దేవయాని అటు ఇటు దిక్కులు చూసింది. మన్మథుడు ఆమె మనోరథం తీర్చాడా అన్నట్లు మృగయా వినోదుడై అడవి అంతా సంచరించిన యయాతి మహారాజు ఆ ప్రాంతానికి వచ్చాడు. వెంటనే అతన్ని గుర్తించింది దేవయాని. ఆమె మనసు ఆనందడోలికల్లో తేలిపోయింది. మహారాజుకు అతిథిసేవ చేసింది.

అక్కడున్న స్త్రీలనందరినీ చూస్తున్న యయాతి చూపు రూపలావణ్య శోభితురాలైన శర్మిష్ఠమీద పడింది.

"మీరంతా ఎవరెవరో వివరంగా చెప్పండి" అన్నాడు ఆ సుకుమారివంక చూస్తూ.

దేవయానికి ఒక్కసారిగా భయం వేసింది.

"నేను ఇదివరకే మీకు తెలుసు. శుక్రాచార్యులవారి కుమార్తెను. దేవయానిని. ఈమె నా దాసి శర్మిష్ఠ" అంది ఆలస్యం లేకుండా వేగంగా.

యయాతి ఈ శర్మిష్ఠ సౌందర్యాతిశయానికి ఎక్కడ ఆకర్షితుడౌతాడో ననే భావం ఆమెను నిలువెల్లా దహించివేయసాగింది.

యయాతికి ఎలాటి అవకాశం ఈయకుండా "మీరు నా పాణిగ్రహణం చేశారు. మరిచారా?" నెమ్మదిగా అంది.

యయాతి చూపు ఇటు మరలే లోపల మళ్ళా అంది :

"ఆనాడు బావిలోపడ్డ నన్ను ఉద్ధరించారు. మీ దక్షిణ హస్తంతో నా హస్తంపట్టి పైకి లేవనెత్తారు. అంటే నా పాణిగ్రహణం చేశారు. దానికి ఈ కర్మసాక్షి సూర్యుడే సాక్షి." మహారాజువంక కన్నార్పకుండా చూస్తూ.

యయాతికి ఏమీ అర్థం కాలేదు.

''పాణిగ్రహణమా? బావిలోనించి ఉద్ధరించానంతే! కానీ-''

దేవయాని చిరునవ్వు నవ్వింది.

''అదే నన్ను వివాహం చేసుకున్నట్టే. నేను భార్యనై, ఈ దాసి శర్మిష్ఠ ఈ పరిచారికలు సేవలు చేస్తుంటే మీరు ఇంద్రభోగాలు అనుభవించవచ్చు.''

యయాతి మరోసారి పరీక్షగా దేవయానివంక చూశాడు. నిండు యౌవనవతి, సౌందర్యరాశి అయిన దేవయానిని నఖశిఖ పర్యంతం వీక్షించాడు. ఆమె తనను మాటలతో ప్రలోభపరుస్తోంది. ఆమె బ్రాహ్మణ కన్య. తను క్షత్రియుడు. యయాతి మనసులో పరిపరివిధాల ఆలోచించాడు.

వర్ణాశ్రమ ధర్మ పరిరక్షకుడైన యయాతి మహారాజుకి దేవయాని మాటలు మతిపోగొడుతున్నట్లున్నాయి. క్షణంలో తేరుకున్నాడు. రాజధర్మం కళ్ళముందు నిల్చింది.

"నీవు బ్రాహ్మణ కన్యవు. నేను క్షత్రియుడిని. మన వివాహం వర్ణాశ్రమ ధర్మ విరుద్ధం. వర్ణాశ్రమ ధర్మరక్షకుడనైన నేనే ధర్మం ఎలా తప్పుతాను? ఎవరు మాత్రం ఇది ధర్మమంటారు?''

దేవయాని ధైర్యంగా పకపకా నవ్వింది. తనకోసం తండ్రి ఏ పనైనా చేయడానికి వెనుకాడడని ఆమెకు బాగా తెలుసు.

''నా తండ్రి సర్వశాస్త్ర ప్రవక్త. ఆయన అంగీకరిస్తే నన్ను వివాహమాడతారా?" యయాతి ముఖంలోకి చూసింది దేవయాని.

''నీ తండ్రికనక దీనికి అంగీకరిస్తే వివాహమాడతాను.''

యయాతి గంభీరమైన గొంతు దేవయాని చెవుల్ని చేరింది.

శుక్రుని రావించింది దేవయాని. విజయగర్వంతో యయాతికేసి చూసింది. తనముందు ఇంద్రభోగాలన్నీ తృణప్రాయం అనే భావన కలిగిస్తున్న దేవయాని వైపు చూపు మరల్చకుండా ఉన్నాడు యయాతి మహారాజు.

"ఆనాడు నా పాణిగ్రహణం చేసి, నన్నుద్ధరించా డీ మహారాజు. ఒక సారి ఈ మహారాజు పాణిగ్రహణం చేసిన నేను, మరొకరి పాణిని గ్రహించటం ధర్మమా తండ్రీ? మీరే చెప్పండి" అమాయకంగా కనబడేలా అడిగింది దేవయాని.

సర్వ ధర్మాలు తెలుసు శుక్రునికి. కుమార్తె స్వభావమూ తెలుసు. ఆమె పట్టుదలా తెలుసు. ఆమె తనకి సమస్తమూ అనే విషయమూ తెలుసు. శుక్రుడు ఏం చేయాలా అనే ఆలోచనలో మునిగిపోయాడు.

అక్కడంతా నిశ్శబ్దం.

శర్మిష్ఠ ఊపిరి బిగపట్టి అంతా శ్రద్ధగా గమనిస్తోంది. పరిచారికలు ఒకరి వంక ఒకరు చూచుకున్నారు.

దేవయాని తండ్రి వంక కంటి రెప్పవేయకుండా చూస్తోంది.

శుక్రాచార్యుడు ఏం చెప్తాడో అని అందరూ ఆందోళనతో ఎదురు చూస్తున్నట్లే ఉన్నారు.

"ఈ వివాహంవల్ల వర్ణాశ్రమ ధర్మ అతిక్రమణ దోషం లేకుండా వరమిస్తున్నాను."

దేవయాని ముఖం దేదీప్యమానమైంది. ఒక్కచూపు శర్మిష్ఠవైపు విసిరి, యయాతి పక్కకు వెళ్ళి నిలబడింది.

దగ్గరున్న శర్మిష్ఠను తిలకించాడు శుక్రాచార్యుడు. ఆమె కేవలం దాసిగా ఉండటం కూడా ధర్మం కాదనిపించింది.

"శర్మిష్ఠను పరిచారికలా చూడటానికి వీలులేదు.ఆమె వృషపర్వుని పుత్రిక. ఆమెకు సమస్త సదుపాయాలూ కల్పించండి. భోగభాగ్యాలలో ఎలాంటి లోపమూ రానీయవద్దు."

ఈ మాటలు అంటున్న శుక్రుడికి ఎదురుగా దేవయాని కనిపించింది.

శుక్రుడు క్షణం ఆగాడు. యయాతిని దగ్గరికి పిలిచి "శయన విషయంలో మాత్రం పరిహరించాలి." ఆజ్ఞ విధించాడు శుక్రుడు.

సృష్టిలో బలహీనతలు ఆయనకి తెలియనివికావు. యయాతి మహారాజు తలపంకించాడు. దేవయాని తన తండ్రి విజ్ఞతకు అభినందించింది మనసులో.

దేవయాని అసాధారణ ప్రజ్ఞకు సంతసిస్తూ ఆమె సౌందర్యానికి తన్మయుడవుతూ యయాతి మహారాజు ఆమెతోబాటు శుక్రాచార్యునికి నమస్కరించాడు.

## శర్మిష్ఠ

దేవయాని, యయాతి దంపతులు ఒకరియం దొకరు అనురాగబద్ధులై, ఆదర్శవంతంగా జీవనం సాగిస్తున్నారు. దేవయాని అందించే స్వర్గసుఖాలలో ఓలలాడుతున్నాడు యయాతి మహారాజు. ఆమె అతనికి ఎప్పుడూ నూత్నవధువులా భాసించేది. తనని ప్రేమించి, తనే కావాలని కోరుకున్న యువతిని పరిణయ మాడటం తన భాగ్యంగా తలపోశాడు యయాతి.

రాణి దేవయాని కార్యనిర్వాహణదక్షత, చాలాసార్లు యయాతికి ఆశ్చర్యాన్ని కలిగించింది. శుక్రాచార్యుని పుత్రికగా ఆమెలో క్రమశిక్షణను గుర్తించాడు. స్వాభావికంగా ఆమె మహారాణి లాటిదే. వంశోద్ధారకులకు జన్మనిచ్చిన మాతృమూర్తి ఆమె. ఈ దేవయానితో కలసి అనంతమైన భోగభాగ్యాలు అనుభవించటం కన్న మరి ఇక ఏ కోరికా లేదు. ఏ ధ్యేయమూ లేదు తనకి అనుకున్నాడు యయాతి. అతని జీవితం బహుతృప్తితో గడిచిపోతోంది.

శర్మిష్ఠ రోజు రోజుకి మానసికంగా కృశిస్తోంది. జీవితంలో తను చేసింది ఒకే ఒక నేరం. దానికి ఇంత శిక్షా? నీళ్ళు నిండిన కళ్ళు ఒత్తుకుంది శర్మిష్ఠ ఒంటరిగా అంతఃపురంలో కూచుని ఆ రోజు.

తనమీద శుక్రాచార్యుడు జాలిపడి ఈ సదుపాయాలన్నీ సమకూర్చేలా ఏర్పాటు చేశాడు. ఈ విశాలమైన భవనం, ఈ రాచమర్యాదలు, ఈ భాగ్యాలు - అన్నీ తన ఒంటరి జీవితాన్ని వెక్కిరిస్తున్నట్లుండి, మనసుని కలచివేస్తున్నాయి.

తన సౌందర్యాన్ని, ఆభరణాలని, వస్త్రానులేపనాల్ని - ఎవరు చూసి ఆనందించాలి? ఇవేవీ తన మనసుకి, శరీరానికి కూడా హాయిని కలిగించలేక

పోతున్నాయిగా! ఆ శయనాగారం తన పాలిటి శత్రువులా కనిపించి, ఆవేదనతో ఇటూ అటూ కదలాడింది శర్మిష్ఠ.

ప్రకృతిశోభ మనసుకి కొంత ఊరట కలిగిస్తుందేమో అని ఉద్యానవనం వైపు నడిచింది శర్మిష్ఠ. పుష్పపరాగం గాలికి రేగి ఒంటిమీద పడుతుంటే ఎలాటి ఆనందమూ కలగకపోగా, ఆవేదనతో దాన్ని విదిలించింది. కోయిలమ్మ తియ్యగా కూస్తుంటే గట్టిగా చెవులు మూసుకొని, వేగంగా ముందుకు నడిచింది.

ఎర్రగన్నేరు నీడన తల వంచుకు కూచుంది శర్మిష్ఠ. ఇసుకలో రాస్తున్న అక్షరాలు గాలికి అలా అలా చెదిరిపోతుంటే చిత్రంగా అనిపించి నవ్వుకుంది. అలా ఎంతోసేపు అక్కడే ఉండిపోయింది శర్మిష్ఠ. సాయం సమయ మవుతోంది. ఎదురుగా ఉన్న చెట్టు, ఆ చెట్టుమీదున్న పక్షిగూడు శర్మిష్ఠని ఆకర్షించాయి.

ఒక పక్షి ముక్కున ఏదో కరుచుకొని, రివ్వున వచ్చి గూడు చేరింది. తల్లిరాక గమనించి గూట్లో ఉన్న పిల్లలు కిచకిచలాడుతూ ముక్కులు ముందుకు పెట్టి అల్లరి చేశాయి. ఆహారం పిల్లలకందించి మళ్ళీ ఆకాశంలోకి ఎగిరిపోయింది పక్షి.

శర్మిష్ఠ చూస్తూనే ఉంది రెప్పవేయకుండా. తల్లిపక్షి గూటి దగ్గరకి మళ్ళీ వచ్చింది. పిల్లలు బిలబిలమంటూ బయటికొచ్చాయి.

ఎంత ధన్యురాలు ఈ తల్లి! ఆ పిల్లలకి ఆహారం అందించడంలోనే ఎంత తృప్తి ఉందో దానికి? మాతృత్వంలో ఉన్న మాధుర్యం ఇదేగా? శర్మిష్ఠ గూటికేసి చూస్తోంది. గూట్లో పిల్లలు అంతలోనే సద్దుమణిగి నిద్రపోతున్నాయి.

శర్మిష్ఠలో మాతృత్వ వాంఛ పెల్లుబికింది. మాతృత్వంలేని ఆడబతుకు వృథా! స్తన్యం ఇచ్చి పసిగుడ్డును గుండెకు హత్తుకుని పరవశించే భాగ్యాన్ని ఊహించుకుంటూ తన్నుతాను మరిచిపోయింది శర్మిష్ఠ.

ఎవరో వస్తున్న అలికిడి అయి ఉలిక్కిపడింది శర్మిష్ఠ.

సాయం విహారానికి బయలుదేరిన యయాతి ఉద్యానవనంలో అటువైపుగా వచ్చాడు. అతని రాజఠీవి, అతని ముఖవర్చస్సు ఏ స్త్రీనైనా వెంటనే ఆకర్షిస్తాయి. అయితే, ప్రస్తుతం తన స్థితి అతనికి దాస్యం చేయటమేగా? శర్మిష్ఠ కళ్ళు అప్రయత్నంగా చెమర్చాయి. తను రాచకన్య. కానీ దేవయాని దాసి.

ఈ మహారాజుకు దాస్యం చేయటంలో ధర్మమే ఉందిగా? యయాతి మహారాజుకు వెంటనే పాదాభివందనం చేసింది శర్మిష్ఠ.

సహజ సౌందర్యరాశియైన వృషపర్వకుమార్తెను పరిశీలనగా చూశాడు. శుక్రాచార్యుని ఆజ్ఞ ప్రకారం ఆమెకు అన్ని సదుపాయాలు సమకూరుస్తున్నాడు. అయినా ఆమె ముఖంలో ఏదో వ్యాకులత కనిపించింది యయాతికి.

"మేము చేసిన ఏర్పాట్లు నీకు తృప్తిని, ఆనందాన్ని చేకూరుస్తున్నాయా?"

శర్మిష్ఠ వంచిన తల యెత్తలేదు.

## అభయం

"నీ మనసులో ఏదైనా బాధ ఉంటే..."

శర్మిష్ఠ చిన్నగా నవ్వింది. ఆ నవ్వు అలావచ్చి ఇలా మాయమవటం గమనించలేకపోలేదు యయాతి. ఆమె మనస్సు ప్రశాంతంగా లేదని మాత్రం అర్థమైపోయింది. కారణం తెలుసుకోవాలనే తొందర మరీ ఎక్కువైంది. తన ఆధీనంలో ఉన్న ఎవరూ ఎవరైనా సరే, ఎలాటి ఆవేదనా చెందటానికి వీల్లేదు. అది తనకే అవమానం!

నిండు యౌవనంతో మెరిసిపోతున్న శర్మిష్ఠను మరొక్కసారి తేరిపార చూశాడు యయాతి. ఈమెకు వివాహం చేయాలి. దేవయాని అభిప్రాయం తెలుసుకుని కానీ తనే నిర్ణయం చేయలేడు. తను పరమధార్మికుడనీ, న్యాయనిర్ణేత అనీ అందరూ తనని కొనియాడుతుంటే, తను దేవయానిధర్మనిర్ణయంమీద ఆధారపడటం చిత్రమనిపించింది. ఒక్కసారి మహారాజుకు రాజధర్మం వెన్ను చరిచింది అతన్ని.

మబ్బుల మాటున చంద్రబింబంలా ఉంది శర్మిష్ఠ వదనం. మహారాజ పుత్రిక శర్మిష్ఠ దీనస్థితి అతని మనసుని కలచివేసింది. ఈ దీనురాలికి తను ఏ సహాయం చేయగలడు? ఆర్తులను కాపాడాల్సిన బాధ్యత తనమీద ఉంది కదా? ఈ శీలవతిని, ఈ ధర్మానువర్తిని తను తప్పక ఆదుకోవాలి. దృఢనిశ్చయంతో శర్మిష్ఠను ప్రశ్నించదలచాడు.

"శర్మిష్ఠా, నీ స్వభావ సౌశీల్యాదులు విన్నాను. కళ్ళారా చూశాను. నీ మనసు వ్యధాభరితమవడం గ్రహించాను. ఒక్కటి చెప్తున్నాను. నేను చేయ

గలిగిన సహాయమంతా నీకు చేస్తాను. ధర్మప్రభువుగా నేను నీకిస్తున్న అభయ మిది''. యయాతి మహారాజు హస్తం-ఆమె శిరస్సుమీద ఉంచాడు సానునయంగా.

ఊహించని ఆ ఆదరం శర్మిష్ఠను ఉక్కిరి బిక్కిరి చేసింది. యయాతి అభయహస్తం ఆమెను పులకాంకితను చేసింది. చెట్టుమీదున్న గూటిని మరొక్కసారి చూసింది. వింత రంగులు సంతరించుకుంటున్న ఆకాశంవైపు చూస్తూ మురిసిపోయింది శర్మిష్ఠ.

యయాతి చేసిన వాగ్దానం శర్మిష్ఠకి మహదానందాన్ని కలగచేసింది. ఆనాడంతా యయాతి మాటల్నీ రూపాన్నీ మననం చేసుకుంటూ గడిపింది. తన బాధ చూసి ఆ మహారాజెంత కలవరపడ్డాడో, అత నెంత సహృదయుడో, తన కోసం ఏ త్యాగమైనా చేయడానికి అతనెంత సిద్ధంగా ఉన్నాడో అనే విషయం తలుచుకున్న కొద్దీ శర్మిష్ఠకి అతని పట్ల పూజ్య భావం కలిగింది. కానీ ఆ మహారాజుచేత త్యాగాలు చేయించటం తన ఉద్దేశమూ కాదు. ఆశయమూ కాదు. ఎలాగైనా అతనికి సేవ చేస్తూ తన మనోభీష్టం నెరవేర్చుకోవాలి. అదే తన ప్రస్తుత కర్తవ్యం.

యయాతి మహారాజుకు తన కోరిక చెప్పడమెలాగ - అన్నదే శర్మిష్ఠను వేధిస్తున్న సమస్య. బహు ధర్మపరుడు, దేవయాని మీదే మనసు లగ్నమైన యయాతి తన కోరికను తిరస్కరిస్తే ఏదో కీడు తన్ని వెంటాడుతున్నట్టే అనిపించిలది శర్మిష్ఠకి. తన కోరికలన్నీ నీటిలో రాతలా కదలిపోతున్నట్లు అనిపించింది. యయాతి చేసిన వాగ్దానం వల్ల పొందిన ఆనందం క్షణంలో ఆవిరి అయిపోయింది. మోడులాంటి తన బ్రతుకు చిగురించాలనుకోటం దురాశ కాదు కదా - ఏమో!

తను ధైర్యం తెచ్చుకోవాలి. తన కోరిక ధర్మబద్ధమే అని యయాతిని ఒప్పించాలి. ఆ సమయానికి తనకు నేర్పు, శక్తి మనోబలం అన్నీ భగవంతుడియ్యాలి. శర్మిష్ఠ శూన్య దృక్కులతో అంతటా కలయ చూసింది.

శర్మిష్ఠ వ్యథాభరిత వదనారవిందమే యయాతి కళ్ళముందు నిలిచింది. ఆ సుకుమారి దీనస్థితిని చూస్తూ ఊరుకోవటమేనా?

''నీకిదే నా అభయం. నేను మహారాజును. సర్వాధికారాలూ ఉన్నవాడిని. నీ కోసం ఏదైనా చేస్తాను'' అని చెప్పి ఆమెను తన బాహువుల్లోకి తీసుకుని, ఆ ముఖాన్ని తన గుండెల్లో దాచుకోనిస్తే?

ఈ భావన రాగానే యయాతి తనను తాను సరిదిద్దుకున్నాడు. తన బల హీనత ఏ ప్రమాదానికి దారితీస్తుందో? అందుకే ఆమె బాధానివృత్తికీ, మన శ్శాంతికీ తను చేయగలిగింది చేస్తానని వేగంగా ఉద్యానవనాన్ని వదిలివచ్చేశాడు. అయినా అప్పటినుంచి కుసుమకోమలసదృశమైన శర్మిష్ఠ శరీర సౌకుమార్యం, సంధ్యారుణిమతో నిండిన ఆమె అధరాలు యయాతిని వెంటాడుతూనే ఉన్నాయి.

శర్మిష్ఠ ఆవేదన తెలుసుకోవాలనీ, తన రాజ్యంలో ఒక్క దీనురాలు కూడా ఉండటానికి వీల్లేదనీ, ఆమె మనసు గ్రహించే వరకూ తనకూ మనశ్శాంతి లేదనీ గట్టిగా నమ్మాడు యయాతి.

మరోనాడు యయాతి ఉద్యానవనంలో ప్రవేశించాడు.

శర్మిష్ఠ మనశ్శాంతి కరువై ఉద్యానవనంలో విహరించి, పొగడ పూచెట్టు నీడన కూర్చుంది. ఆనాడంతా ఆమె కళ్ళ ఎదుట దేవయాని రూపమే కదలా డింది. ఒక్క తప్పుకు ఇంత పెద్ద శిక్షా? తన యౌవనమంతా అడవి కాచిన వెన్నెలైంది. ఏ నోములు నోచిందో, ఏ పుణ్యం దాచిందో ఈ దేవయాని యయాతి మహారాజును చేపట్టింది. స్త్రీలు వివాహం, మాతృత్వం కాంక్షిస్తారు. అదేమి భాగ్యమో దేవయాని మాతృత్వం కూడా సాధించింది!

నేనూ ఉన్నాను. ఒక్క తప్పిదానికి జీవిత భాగ్యాన్ని పోగొట్టుకున్న అభాగ్యురాలిని. శర్మిష్ఠకి దేవయాని మీదున్న కోపం కసిగా, పగగా మారింది నిముషంలో.

యయాతి మహారాజు దయామయుడు. ఆ రాజుకు తనపైన అభిమాన ముందని తనకి తెలుసు. తనకు ఆ రాజు మీద...

శర్మిష్ఠ ముసిముసిగా నవ్వుకుంది. అటూఇటూ చూసింది. ఆశ్చర్యం!

అజానుబాహుడు, దృఢగాత్రుడు, ఆకర్ణ విశాలనేత్రుడు ఐన యయాతి తన ముందరే నిలిచాడు. వలరాజు తన మనసు కనిపెట్టే ఈ రాజును ఇక్కడికి పంపి ఉంటాడని అనుకుంటూ, బుగ్గలో సిగ్గు మొగ్గలు తొడుగుతుంటే, తత్తర పాటుతో ఆహ్వానించింది. ఆ ఆహ్వానంలో ఆప్యాయత ఉట్టిపడింది.

చెట్ల నీడలు ఆ ప్రాంతమంతా అలుముకున్నాయి.

"నీ మనసులోని బాధ చెప్పు." యయాతి శర్మిష్ఠను ప్రశ్నించాడు.

"జన్మతః రాజపుత్రికను. ఒక్క తప్పిదానికి ఇంత శిక్ష అనుభవిస్తున్నాను. మీరు ఏర్పాటు చేసిన ఈ సదుపాయాలు నా జీవితాన్ని చిగురింపజేస్తాయా? ప్రతి స్త్రీ కోరుకునే మాతృత్వాన్ని నాకు అందిస్తాయా?" శర్మిష్ఠ యయాతి వంక చూసింది.

"సృష్టిలో ప్రతి పక్షి జంతువు కోరుకునే మాతృత్వం." మాటలు తడబడ్డాయి.

సర్వాలంకార భూషిత అయి దేవయాని కళ్ళకు కట్టింది. "అవును నేను దేవయాని దాసిని. దేవయానిని పరిగ్రహించిన మీకు నేను పరిగ్రాహ్యనే. మీరు నా యజమానులు. నేను మీ అధీనను. నా సంతాన వాంఛ తీర్చమని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను." శర్మిష్ఠ గొంతు గద్గదితమైంది.

"ఇది అధర్మమా?" శర్మిష్ఠ వాడి చూపులు యయాతి గుండెల్ని తరచి తరచి చూస్తున్నాయి.

యయాతి అవాక్కయి పోయాడు. శుక్రుని ఆంక్ష, దేవయాని పైన అతనికున్న ప్రేమ మనసులో అడ్డంగా నిలిచాయి. ఆ మాటలు నెమ్మదిగా అన్నాడు.

శర్మిష్ఠ కిలకిల నవ్వింది.

"ప్రాణాపాయంలో, స్త్రీల విషయంలో, వివాహ సమయంలో - ఇలా కొన్నిట అసత్యమాడితే అది అసత్యం కాదు కదా?"

వినయంగా, ప్రేమగా, లాలనగా, వయ్యారంగా శర్మిష్ఠ విన్నవించుకుని, క్రీగంట యయాతిని చూసింది.

శర్మిష్ఠ చెప్పిన ప్రతి మాటా ధర్మశాస్త్రబద్ధమే అనిపించింది యయాతికి. ఆమె యౌవనం, జీవితం వృథా కావటం సృష్టికర్త కూడా సహించడు!

తను ప్రభువు. ఆమె దాసి. ఆమె తన ఆస్తి. ఆమె తన అధీన!

యయాతి శర్మిష్ఠను నఖశిఖ పర్యంతం మళ్ళీ పరిశీలనగా చూశాడు.

శర్మిష్ఠ పల్చని చెక్కిళ్ళు మిలమిలా మెరిశాయి. మల్లె మొగ్గలాంటి పలువరుస మరీ ధవళకాంతులు నింపుకుంది.

యయాతి గాఢ పరిష్వంగం నుంచి తేరుకున్న శర్మిష్ఠ, ఆ వెన్నెల కాంతిలో యయాతితో కలిసి శయనాగారం వైపు నడిచింది విలాసంగా.

## ప్రేమఫలం

శర్మిష్ఠకు పుత్రుడు ఉదయించిన వార్తవిని నిర్ఘాంతపోయింది దేవయాని. ఆశ్చర్యం నుంచి తేరుకొని, శర్మిష్ఠ మందిరానికి తరలివచ్చింది ఆమె.

"కన్యవు, ఉత్తమ శీలవతిని. నువ్వు తల్లికావటం ఎంతో విచిత్రం!"

దేవయాని భ్రుకుటి ముడిచింది.

క్షణం తత్తరపడింది శర్మిష్ఠ. మరుక్షణం సిగ్గుతో తలవంచుకుంది. అనుకోని ఆపద ఎదురైందని మనసులో బెదురుతూనే నేర్పుగా, వినయంగా అంది.

"ఒకనాడు వేద వేదాంగ పారంగతుడైన మహాఋషీశ్వరు లొచ్చారు ఈ ప్రాంతానికి...'

"ఋషీశ్వరులా?" దేవయాని శర్మిష్ఠ వంక చూసింది.

"ఊఁ. ఋతుమతినైన నన్ను చూచి" - శర్మిష్ఠ నేల చూపులు చూస్తోంది.

"ఊఁ?" ఉత్కంఠ చూపించింది దేవయాని.

"పుత్రుడ్ని ప్రసాదించారు.." నెమ్మదిగా మాటా మాటా పలికింది శర్మిష్ఠ.

శర్మిష్ఠ వినయ విధేయతలు దేవయాని మనసుకు నచ్చాయి. "ఋషీశ్వరులు భగవత్స్వరూపులు మరి" అనుకుంటూ పసివాణ్ణి మరొక్కసారి చూసి, తన భవనానికి మరలిపోయింది దేవయాని.

యయాతి శర్మిష్ఠల సమాగమం అంతటితో ఆగిపోలేదు. రాజకుమారి శర్మిష్ఠ అందించే భోగాల్లో మునిగిపోయాడు యయాతి. శర్మిష్ఠ సత్ప్రవర్తన అతన్ని అనురాగబద్ధుణ్ణి చేసింది. శర్మిష్ఠ సాహచర్యం యయాతి జీవితాన్ని మరింత ఆనందమయం చేసింది.

కాలం గడుస్తోంది. యయాతికి మరో ఇద్దరు పుత్రులను కన్నది శర్మిష్ఠ.

సర్వాలంకార భూషితురాలైన, పట్టపు రాణి వైభోగంతో సాక్షాత్తు శచీదేవిలా భాసిస్తూ, కన్యకాసహస్రంతో కలసి ఉద్యావన విహారానికి బయలుదేరింది దేవయాని ఓనాడు.

యయాతి మహారాజు దేవయాని సౌందర్యాన్ని కంటిరెప్ప వేయకుండా వీక్షిస్తున్నాడు ఉద్యానవనంలో విహరిస్తూ. స్త్రీత్వానికి సంపూర్ణ మూర్తి దేవయాని.

దేవయానితో ఎన్ని సంవత్సరాలు భోగమయజీవితం గడిపినా తృప్తితీరదు తనకు. యయాతి అక్కడున్న విరబూసిన మందారంకేసి చూశాడు. ప్రకృతి సౌందర్యాలోకనంలో నిమగ్నుడయ్యాడు మరుక్షణంలో.

కన్యకాసహస్రంతో విహరిస్తున్న దేవయాని టక్కున ఆగింది. ఎంత ముచ్చటగా ఉన్నారీబాలులు! దేవయాని అడుగు ముందుకు పడలేదు.

గాలికి కదులుతున్న కేశాలు అగ్ని శిఖల్లా ప్రకాశిస్తున్నాయి. కనకరత్న మయ భూషణాలు శరీరానికి గొప్ప కాంతినిస్తున్నాయి. ప్రజ్వరిల్లుతున్న త్రేతాగ్నుల్లా ఉన్న ఆ ముగ్గురు బాలకుల నుంచి దృష్టి మరల్చుకోలేక పోయింది. దేవయాని. బాలక్రీడల్లో పరవశిస్తున్నారు ఆ బాలకులు.

ఆప్యాయంగా దగ్గరకొచ్చి దేవయాని పరిశీలనగా చూసింది వాళ్ళని. ఆ దగ్గరలోనే ఇసుకతిన్నెమీద కూచుని శర్మిష్ఠ వాళ్ళ క్రీడల్ని తిలకిస్తోంది.

దేవయాని అలాగే పిల్లల వంక చూస్తోంది. చిత్రం! విచిత్రం! ఆ ముగ్గురూ యయాతి ప్రతిరూపాల్లా కనిపించారు. దేవయాని తన కళ్ళను తానే నమ్మలేకపోయింది. అవును, యయాతి ప్రతిరూపాలే!!

అసూయ, అవమానం పెల్లుబికాయి. యయాతిని సమీపించింది.

"ఈ బాలులెక్కడ నుంచి వచ్చారు? ఎవరి పిల్లలు?"

యయాతి సమాధానం చెప్పలేదు.

ఏం చెప్పాలి తను? సత్యమా, అసత్యమా? ఆనాడు శర్మిష్ఠపై జాలిపడి పుత్రదానం చేశానంటే నమ్ముతుందా ఈ దేవయాని?

శాపగ్రస్తురాలైన రాచకన్య పైన సహజమైన అభిమానం మాత్రమే తన కుందని చెప్తే భరిస్తుందా ఈ దేవయాని?

తన మనసంతా దేవయాని మీదే ఉందని చెప్తే సమాధాన పడుతుందా?

స్వాభిమానం, అహంకారం దేవయాని కెక్కువ అని యయాతికి తెలుసు. ఏం చేయాలో తోచక, సమాధాన మీయక ఊరుకున్నాడు.

దేవయాని అనుమానం రెండింతలైంది.

ఆమె గబగబా బాలకులవైపు నడిచింది.

"ఎవరు బాబూ మీరు? ఎక్కడినుంచి వచ్చారు? మీ తల్లీతండ్రీ ఎవరూ?" లాలనగా అడిగింది దేవయాని ఆ ముగ్గురు పిల్లల ముఖాల వంకచూస్తూ.

"చూపుడు వేలితో శర్మిష్ఠ, యయాతినీ చూపి, "మా తల్లీ, తండ్రీ" అన్నారు గొప్పగా.

ఆ మాట వినగానే దగ్గరున్న చెలికత్తెలు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. మహారాజు తన అధీనంలో ఉన్న స్త్రీలతో సంతానాన్ని పొందటం ఏమీ విపరీతంగా అనిపించలేదు వారికి. పైగా ఒకప్పటి తమ రాచకుమార్తె ఇంత చక్కని పిల్లలను కన్నందుకు ఎంతో ఆనందించారు కూడా.

దేవయాని కళ్ళు కణకణ మండే నిప్పులయ్యాయి. యయాతిచేత వంచిత కావడం కంటే తీరని అవమానం మరొకటి లేదని భగభగ మండిపోయింది మనసు.

తన దాసి శర్మిష్ఠ త్రేతాగ్నుల్లాటి ముగ్గురు పుత్రులకు తల్లి కావటం తన స్త్రీత్వానికే తలవంపులుగా భావించిన దేవయాని దుఃఖిస్తూ, యయాతిమీద కోపంతో ఆడనాగులా బుసలు కొడుతూ విసవిసా నడిచింది తనపాలిట దైవమైన తన తండ్రి దగ్గరకు.

## వంశోద్ధారకుడు

దేవయాని దుఃఖంతో, కోపంతో తండ్రి దగ్గర కెళ్ళటం చూసి గజగజలాడిపోయాడు యయాతి. ప్రశాంతంగా, ఆనందంగా గడుస్తున్న తన జీవితం ఒక్కసారి అల్లకల్లోలమైందని పరితపించాడు.

దేవయాని పట్ల అనంతమైన ప్రేమ ఉంది యయాతికి. ఆమె సౌందర్యాతిశయం, ఆమె సమయస్ఫూర్తి అతణ్ణి అనురాగబద్ధుణ్ణి చేశాయి. మూర్తీభవించిన స్త్రీత్వంతో నిత్య యౌవనవతిగా భాసిస్తూ, యయాతిని నిత్యయౌవనుడుగా చేసిందామె.

శర్మిష్ఠతో తన సాంగత్యం కేవలం తన జీవితాన్ని మరింత సుఖమయం చేసింది కానీ, తన జీవితాన్ని సఫలీకృతం చేయదని యయాతికి పూర్తిగా తెలుసు.

దేవయాని లేని తన జీవితం దుర్భరం, అంధకారమయం - ఈ తలపులు యయాతిని మరింత కలవర పెట్టాయి.

తన మనసులోని మాట, జరిగిన సత్యం చెపితే దేవయాని సహించదు. అంతేకాదు, శుక్రాచార్యులవారంటే తనకి ఎడతెగని ఆదర గౌరవాలే కాక భయం కూడా ఉంది. ఆయన పెట్టిన ఆంక్షను తను అతిక్రమించాడు. శుక్రుడికి కుమార్తె అంటే ఎంత ప్రేమ ఉందో తనకి తెలియంది కాదు. యయాతికి ఆ నిముషం మరీ భయం కలిగింది. ఆందోళనతో దేవయానిని ప్రతిమాలాలని, శుక్రాచార్యునికి విషయం విన్నవించుకుందామనీ వేగంగా శుక్రుణ్ణి సమీపించి, నమస్కరించాడు యయాతి.

కానీ అప్పటికే జరగాల్సింది జరిగిపోయింది. దేవయాని గద్గదకంఠంతో తన భర్త చేసిన అన్యాయాన్ని తండ్రికి చెప్పుకుంది. యయాతి నోరు విప్పేందుకు అవకాశమియ్యలేదు.

మహోగ్రుడయ్యాడు శుక్రాచార్యుడు. యయాతి నా ఆంక్షనే ధిక్కరించాడా? ఇంత అహంకారమా? సర్వ శాస్త్రవేత్త, శాంతమూర్తి అయిన శుక్రుడు క్షణంలో రుద్రుడయ్యాడు. నయనాలు అగ్నిశిఖలై ప్రజ్వరిల్లాయి.

"నా ఆంక్ష తిరస్కరించావు. నిన్ను కోరి వరించిన నా కుమార్తెను అవమానించావు. రూపయౌవన మదాంధకారంతో నా కుమార్తెకే అన్యాయం చేశావు కనుక, ఆ రూప యౌవనాలే నీకు ఇక దూరమవుతాయి! జరాభార పీడితుడవై జీవితమంతా గడుపు!" అని శపించాడు.

శుక్రుడి శాపం అక్కడికక్కడే ప్రభావం చూపింది. దేవయాని చూస్తుండగానే, రూపయౌవనాలతో అందర్నీ ఆకర్షించిన యాయాతిని వృద్ధాప్యం ఆక్రమించుకుంది. ఆ రూపం చూడలేక దేవయాని కళ్ళు మూసుకుంది. ఏ సౌందర్యమూర్తిని చూసి తను మోహించిందో అతని రూపమా ఇది! నిట్టూర్చింది దేవయాని.

శుక్రుడు దేవయానిని తిలకించాడు. ఆమె దీనవదనం అతని మనసుకి బాధ కలిగించింది. తన పుత్రికపైన ప్రేమకొద్దీ తనిచ్చిన శాపం, ఆమెకు ఆవేదన కలిగిస్తోందే!

యయాతి వంక చూశాడు శుక్రుడు. వృద్ధాప్యంతో ముడతలు తేరిన శరీరం, వణుకుతున్న శిరస్సు, పటుత్వం తప్పిన అవయవాలు - ఈ వృద్ధ రూపం పొందిన యయాతితోనా తన కూతురు జీవితమంతా గడపవలసింది? తన కుమార్తెకు తను ఏం న్యాయం చేసినట్లు? కుమార్తె భవిష్యజ్జీవితాన్ని గురించి పరివరివిధాల తలపోస్తుంటే, సవినయంగా మనవి చేసుకున్నాడు యయాతి.

"ఆచార్యా! నేను దోషినని, మీ ఆజ్ఞను అతిక్రమించానని మీరంటే తల వంచుతాను. మీరు విధించిన శిక్ష అనుభవిస్తాను. కానీ నాది ఒక్క మాట. తమరు పెట్టిన నియమం ఏ విపత్కర పరిస్థితుల్లో దాటవలసి వచ్చిందో మీరు వింటే మీరు నన్ను క్షమించగలరు. తమకు అత్యంత అభిమానురాలై, పుత్రికా సమానురాలైన, శర్మిష్ఠ ఋతుమతియై, సంతానార్థం నన్ను ప్రార్థిస్తే నేను ఆమె మనోరథం తీర్చాను. ఋతుమతియైన స్త్రీ సంతానార్థం పురుషుని వేడుకున్నపుడు ఆ కోరిక తిరస్కరిస్తే అది భ్రూణహత్యాపాతక మవుతుందని శాస్త్రం ఉద్బోధించటం లేదా? కేవలం భోగలాలసుడినై మీ ఆంక్షను అతిక్రమించలేదు. ఆచార్యా! ఆ విపరీత పరిస్థితులు నన్ను..." తరువాత యయాతి ఏమన్నాడో శుక్రుడు వినిపించుకోలేదు.

యయాతి మాటల్లో కొంత నిజం ఉందని శుక్రుడు మనసుకి అనిపించింది. అయినా తన ఆజ్ఞను లక్ష్యం చేయనందుకు శిక్ష అనుభవించాలి- తప్పదు!

శుక్రాచార్యుడి మనసు కొంత కరిగిందని గ్రహించినా, వారి మనసు పూర్తిగా మారలేదని తెలుసుకున్నాడు యయాతి. తన మనసులోని మాట సిగ్గు విడిచి చెప్పక తప్పదనిపించింది.

"అయ్యా! దేవయాని అంటే నా కున్న ప్రేమకు అవధులు లేవు. విష యోపభోగవాంఛలలో నాకింకా తృప్తి తీరలేదు. దేవయానితో భోగమయ జీవితం గడపాలనే కోరిక నాకు ఇంకా ఉండగా, ఈ వృద్ధాప్యం రావడం నేను భరించలేను. దయతో శాపోపశమన మార్గాన్ని సెలవియ్యండి." చేతులు జోడించాడు యయాతి వినమ్రుడై.

యయాతి మాటల్లోని సత్యాసత్యాలు పరిశీలిస్తూ, దేవయాని వంక తిరిగాడు శుక్రాచార్యుడు.

ఆమె ముఖంలో దైన్యమే కాదు, యయాతిపైన నేరారోపణ చేశానన్న పశ్చాత్తాపం కూడా ప్రస్ఫుటంగా కనిపించింది.

యయాతిని శపించి, తన ధర్మం నిర్వర్తించాననుకున్నాడు కానీ, అది తన కుమార్తెకు పరోక్షంగా శాపమే అవుతుందని అనుకోని శుక్రాచార్యుడు కొద్దిసేపు పరితపించాడు. దీనికి మార్గాంతర మాలోచించాలని నిశ్చయించుకున్నాడు.

యయాతి వంక తిరిగాడు.

"నీ విన్నపం అంగీకరించాను. నీ వృద్ధాప్యం నీ పుత్రులెవరైనా గ్రహిస్తే, వారి యౌవనం నువ్వు స్వీకరించు. నీవు భోగవాంఛాపరితృప్తుడవయ్యాక, వారికి తిరిగి వారి యౌవనాన్నిచ్చి, నీ వృద్ధాప్యాన్ని నువ్వు గ్రహించు" అన్నాడు.

యయాతి, దేవయాని ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు.

"ఎవడు నీ వృద్ధాప్యం స్వీకరిస్తాడో, అతడే నీ రాజ్యార్హుడు, అతడే నీ వంశోద్ధారకుడు!"

శుక్రుడి మాట పన్నీటి జల్లు అయింది యయాతికీ, దేవయానికీ.

"నీ వృద్ధాప్యం తీసుకుని, అతని యౌవనాన్ని నీ కిస్తేనే." శుక్రుని గొంతు ప్రతిధ్వనించింది.

దేవయాని ఉలిక్కిపడింది.

పాదాభివందనం చేసి యయాతీ, దేవయానీ ప్రయాణమయ్యారు.

దైవ వశాన వచ్చిన వృద్ధాప్యాన్ని అనుభవించ వచ్చు కానీ, రాజ్యం కోసం, తండ్రి భోగమయ జీవితం కోసం వృద్ధాప్యం కోరుకునే అవివేకు లెవరుంటారు? దేవయాని కొడుకులు, శర్మిష్ఠ ఇద్దరు కొడుకులు కూడా తల్లిదండ్రుల కోరికను నిర్మొహమాటంగా తిరస్కరించారు.

తల్లిదండ్రుల కోసం త్యాగం చేయడానికి ముందుకొచ్చే కుమారులే లేరా? దేవయానికి, యయాతికి నిరాశ ఎదురైంది.

అంతలో ఆశాజ్యోతిలా తల్లిదండ్రుల ముందు నిలిచాడు శర్మిష్ఠ చివరి కొడుకు.

"మీ అభీష్టాన్ని నెరవేర్చటమే నా కర్తవ్యం. మీ వృద్ధాప్యాన్ని స్వీకరించి, నా యౌవనాన్ని వెంటనే మీకు సమర్పిస్తాను. ఈ విధంగా నా తల్లి తండ్రులకు సేవ చేసే భాగ్యం కలిగినందుకు ధన్యుణ్ణి" అంటూ పాదాభివందనం చేశాడు.

అతనే యయాతి తరువాత రాజ్యాభిషిక్తుడైనవాడు, త్యాగమూర్తి పూరుడు !

యయాతిని వృద్ధాప్యం వదలిపోతుంటే, యౌవనం నిశ్శబ్దంగా యయాతిని ఆక్రమించుకుంటుంటే, సజల నయనాలతో తిలకించింది దేవయాని.

(ఆధారం : కవిత్రయం వారి శ్రీమదాంధ్ర మహాభారతం:
ఆదిపర్వం : తృతీయాశ్వాసం)
(ప్రచురణ: ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక :
2-9-1987 నుండి 4-11-1987 వరకు.)

# మేనక

దేవలోకంలో మేనక తీరుబడిగా కొలనువైపు నడుస్తోంది. తన హొయలు తనకే ముచ్చటగా ఉంది. తన సౌందర్యాన్ని అందరూ మెచ్చుకుంటారు. కానీ స్త్రీ పురుషులెవ్వరూ తన సౌందర్యాన్ని సంపూర్ణంగా ఆలోకనం చేశారనే నమ్మకం ఎన్నడూ కలుగలేదు. దేవేంద్రుడు కూడా తను సౌందర్యవతి అనుకుంటాడు. అంతేకానీ ఆయనకూ తను పూర్తిగా తెలియదు.

కొలనులో నీరు నిశ్చలంగా ఉంది. ప్రతిబింబాన్ని తిలకించింది మేనక. ఆలోచనలు వెంటాడుతున్నాయి. అందమైన దేవకాంతల పేర్లు చెప్తూ తన పేరూ చెప్తారు. రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ అంటారు. తను కూడా దేవకాంతల సమూహంలో ఒక కాంత.

పురుషుల అజ్ఞానం - ఆమెకి నవ్వొచ్చింది. బాధ కలిగించింది. ఏ ఒక్క స్త్రీ సౌందర్యాన్ని కూడా సంపూర్ణంగా గ్రహించలేని పురుషులు ఎందరో స్త్రీల మీద కాంక్ష పెట్టుకుంటారేమిటో? సృష్టిరహస్యం, పురుషుల పశుప్రవృత్తి- మేనకకు చికాకు అనిపించింది.

తన ప్రతిబింబాన్ని మళ్ళా ఓసారి నిశ్చలమైన నీటిలో చూసుకుంది. స్త్రీ సౌందర్యాన్ని అందరూ వర్ణించే పదజాలం తనని వర్ణించేందుకు సరిపో తుందా? తన శరీర సౌందర్యాన్ని తృప్తిగా చూసుకుంది మేనక.

ఈ సౌందర్యాన్ని భరించటం తనకు సాధ్యం కావటం లేదు నీటిలో దిగి ప్రతిబింబాన్ని కనబడకుండా చేయాలి అనుకుంటూ నిశ్చలమైన నీటిలోకి దిగింది. నీటిని చెల్లాచెదరు చేసింది. నీటి నిశ్చలతతోబాటు ప్రతిబింబమూ మాయమైయింది. ఈ సౌందర్యమంతా దేవేంద్రుడి ముందు నృత్యం చేయటానికి మాత్రమేనా? మేనక కసిగా తృప్తి పడింది కల్లోలితమైన నీటిని చూస్తూ.

పాదాలు నీటముంచి కొలను గట్టున కూచుంది. మనసు పరిపరివిధాల పోతోంది.

అంతలోనే, దేవేంద్రుడి దర్శనార్థం వెంటనే రమ్మనే వార్త అందింది. దేవేంద్రుడు తన ప్రభువు అయినా ఏనాడూ రమ్మని పిలిపించలేదేః ఏమిటో ఆత్రుత, ఏదో ప్రత్యేకత ఉన్నాయి. ఈ నాటికి దేవకాంత లందరిలోనూ తన ఔన్నత్యాన్ని గుర్తించి, అతని హృదయంలో ప్రధాన స్థాన మిస్తున్నాడాః

ఆనందంతో, ఆశతో వేగంగా దేవేంద్రుడి దర్శనార్థం బయలుదేరింది మేనక. ఆవేశంతో, ఉద్వేగంతో ఆహ్వానించి గౌరవిస్తాడనుకొన్న ఇంద్రుడు దీనంగా, విచారగ్రస్తుడై ఉండటం దూరంనుంచే గమనించింది మేనక. ఆమెకి నిరాశ ఎదురైంది.

మేనక సమీపిస్తుంటే, దేవేంద్రుడు ఆమెను నఖ శిఖ పర్యంతమూ పరిశీలనగా మొదటిసారి చూసినట్లుగా చూశాడు. మేనకకి ఏమీ అర్థం కావటం లేదు. తనను చూస్తుంటే ముఖంలో విషాదచ్ఛాయలు కొంతవరకు మాయమవటం గమనించింది.

మేనక దేవేంద్రుడికి నమస్కరించి నిలబడింది. ఆమె ప్రతి కదలికనూ పరీక్షిస్తున్నాడు దేవేంద్రుడు. అతని ముఖంలో తృప్తి, ధైర్యం చోటు చేసుకున్నాయి. అభిమానంతో, ఆప్యాయతతో, గౌరవంతో ఆమెను ఆసీనురాలిని చేశాడు.

"మేనకా! లోక కళ్యాణార్థం నువ్వొక బృహత్కార్యం చేపట్టాలి. నువ్వు తప్ప ఎవ్వరూ ఆ కార్య నిర్వహణకి సమర్థులు కారు."

"ప్రభూ! మీ సేవకురాలిని. మీరు నన్ను ఇంతగా మన్నించటం తగదు. ప్రభుసేవ నా కర్తవ్యం కాదాః"

"విశ్వామిత్ర మహర్షి తపఃప్రభావం విశ్వమంతా వ్యాపించటం నువ్వూ గమనించే ఉంటావు. ఒక వ్యక్తిలో అనంతమైన శక్తి కేంద్రీకృతం కావటం ఎన్నో అనర్థాలకి దారితీస్తుంది. ఒకప్పుడు ఆ మహర్షిలో రజోగుణం విపరీతంగా ఉండేది. అందుకే భయం..."

దేవేంద్రుడి మాటల్లో అంతర్యం మేనకకు అంతు పట్టటం లేదు. ఆయన తపస్సుకీ, తనకీ ఏమిటి సంబంధంః పైగా ఆయన మహర్షి తను దేవకాంత.

"ఈ సందర్భంలో నేను చేయగల కార్యం - ఆజ్ఞాపించండి ప్రభూ!"

"విశ్వామిత్ర మహర్షిని సమ్మోహితుణ్ణి చేసి..."

"సమ్మోహితుణ్ణి చేశా?" ఉలిక్కిపడింది మేనక.

"సమ్మోహితుణ్ణి చేసి తపోభంగం చేయాలి."

ఇంద్రుడు గంభీరంగా నెమ్మదిగా ఆజ్ఞాపించాడు.

మేనక గజగజలాడి పోయింది. మహర్షిని సమ్మోహితుణ్ణి చేయటం సాధ్యమా? తన ప్రభువు కోసం, దేవలోకవాసులకు సహాయం చేయటం కోసం సిద్ధమే. కానీ ఆ మహర్షి శాపానికి శాశ్వతంగా గురి కావటానికి తను సిద్ధంగా లేదు - ఆ సాహసం తను చేయలేదు!

"ప్రభూ! విశ్వామిత్రుని శక్తి సామర్థ్యాల గురించి విన్నాను. వశిష్ఠ మహర్షివంటి తపశ్శక్తిసంపన్నుడు, తన కుమారులను విశ్వామిత్ర మహర్షి చంపేస్తుంటే ఏమి చేయలేకపోయాడు. ఆ మహర్షి కోపిస్తే పర్వతాలు బద్దలవుతాయి. సముద్రాలు ఇంకిపోతాయి. అటువంటి మహత్తర శక్తి ఉన్న మహర్షి వద్ద నాలాటి అల్పురాలు వెళ్ళి ఏం చేయగలదు? ఇది నిప్పుతో చెలగాటం కాదా ప్రభూ?"

మేనక గొంతులో భయం, ముఖంలో దైన్యం నిండిపోయాయి.

దేవేంద్రుడికి భయం వేసింది. ఈ మేనక కాదంటే, ఈ కార్యం నిర్వర్తించే శక్తి యుక్తులున్న దేవకాంత లెవరున్నారు? తనకి ఇక దిక్కెవరు?

మేనకను బెదిరించినా, శిక్షించినా, శపించినా ప్రయోజనం లేదు. ఇంద్రుడు ఆందోళనగా ఆమె వైపు చూశాడు.

"నేను నీ మీద ఎంత గురుతరమైన బాధ్యత పెట్టానో నాకు తెలుసు. కానీ, నువ్వు తప్ప మరెవ్వరూ ఈ కార్యం నిర్వహించలేరు. బహుదీర్ఘంగా ఆలోచన చేసిన తరువాతనే ఈ నిర్ణయం తీసుకున్నాను. లోక కళ్యాణార్థం, ఈ దేవలోకం కోసం, నా కోసం నువ్వు ఈ పని చేయాలి మేనకా!"

దేవేంద్రుడు తటాలున లేచి ఆమె చేతులు పట్టుకున్నాడు.

దేవేంద్రుని ముఖంలోని దైన్యం, భయం, ఆత్రుత మేనక గమనించింది. ఆమె మనసు కరిగిపోయింది. దేవేంద్రునంతటివాడు అసహనంగా తనను అభ్యర్థిస్తున్నాడు.

"స్వామీ! పరిణామాలు ఆలోచించకుండా ప్రభువు ఆజ్ఞ పాలించటం నా కర్తవ్యం. నా శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తాను. ఆశీర్వదించండి." అవనత వదన అయింది మేనక.

క్షణంలో మేనక కళ్ళలో గర్వం తొణికిసలాడింది. ఈ ఘనకార్యం తను మాత్రమే చేయగలదు. దేవేంద్రుడే వాచ్యంగా అంగీకరించి, తనని వేడుతున్నాడు. దేవకాంత దేవేంద్రుని వద్ద సెలవు తీసుకుని బయలుదేరింది కార్య నిర్వహణార్థం.

## తపోభంగం

మేనక లోక కళ్యాణార్థం దేవేంద్రుడికి సహాయం చేయటంకోసం విశ్వామిత్ర మహర్షి తపస్సు భంగం చేయటానికి అంగీకరించింది. దేవేంద్రుడు తనని దీనంగా కోరటంలో తమ సామర్థ్యం కాని, తన చేయబోతున్న పని మంచిదా, చెడ్డదా అని కాని ఆలోచన చేయలేదు. చాలా తొందరపడి దేవేంద్రుని మాటలు నమ్మి ఒప్పుకున్నదేమో!

మేనక శతవిధాలా పర్యాలోచన చేసింది. విశ్వామిత్ర మహర్షి గొప్పతనం విన్నది. ఆయనను ఎన్నడూ చూడలేదు. ఆయన ఎట్లా ఉంటారో, వారి స్వభావమేమిటో కూడా తనకి తెలియదు. తనకు తెలిసినదంతా ఇతరులు చెప్పగా విన్నది మాత్రమే.

విశ్వామిత్రుడు ఘోరతపస్సు చేస్తున్నాడని, రాజసం, క్రోధం ఆయనకు ఎక్కువని అర్థమైంది. ఆ మహర్షి అతి వృద్ధుడై, ముసలిరూపంతో బక్కచిక్కి, తెల్లనిజుట్టు, జడలు కట్టి స్త్రీ కాంక్షలేని విరాగి అయితే తన ప్రయత్నం విఫలం కాక తప్పదు. తను మహర్షి శాపంతో సర్వనాశనం కావటమూ తప్పదు!

ఆ భావనతో మేనక శరీరం కంపించింది. గుండె ఆగినట్లే అనిపించింది. ఇప్పుడు తనేం చేయలేదు. ప్రయత్నం చేస్తానని ఇంద్రుడికి మాటకూడా ఇచ్చేసింది కదా!

తను ఏమి సాధించినా అది తన సౌందర్యంపైనా ప్రవర్తనపైనా ఆధారపడి ఉంటుంది. సర్వాంగ సుందరంగా అలంకరించుకుని ప్రయాణానికి సిద్ధమైంది మేనక. తనకు తోడుగా మలయమారుతాన్ని వెంట తీసుకెళ్ళింది.

ఆసక్తితో, ఆత్రుతతో బయలుదేరిన మేనక హిమవత్పర్వత ప్రాంతంలో విశ్వామిత్ర మహర్షి తపోవనం చేరింది.

మలయమారుత ప్రభావంతో వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది. ప్రకృతి ప్రశాంతంగా ఉంది.

ఘోర తపస్సు చేస్తున్న విశ్వామిత్ర మహర్షి కొద్ది క్షణాలు విశ్రాంతికోసం నిశ్చల హృదయంతో ప్రశాంతంగా ఉన్నాడు. అది మేనక అదృష్టం.

తపోవనంలో అడుగు పెడుతూనే దూరంనుంచే విశ్వామిత్ర మహర్షిని తిలకించింది మేనక.

ఆశ్చర్యం! కాంతిపుంజంలా కనిపించాడు మహర్షి. నల్లనిగడ్డంతో, నల్లని కేశపాశంతో గొప్ప శరీ సౌష్టవంతో ఆకర్షణీయంగా ఉన్నాడు.

భయం భయంగా అతి జాగ్రత్తగా మహర్షిని సమీపిస్తోంది మేనక. మహర్షుల్లో ఇంత రూపవంతులుంటారా! మేనక ఆశ్చర్యం పెరిగిపోయింది.

మహర్షిని సమీపించింది. ఏదో విశిష్టత గోచరిస్తోంది మహర్షిని దర్శిస్తున్న కొద్దీ. ఇంతముందు తను ఎంతమంది మహర్షులనో, తపస్సంపన్నులనో చూసింది. ఇలాంటి రూపవంతుడైన మహర్షిని చూడలేదు.

మహర్షిని సమీపిస్తున్న మేనక తానే సమ్మోహితురాలవటం గ్రహించి విస్మయం పొందింది. ఇటువంటి మహర్షి తపస్సు భంగం చేయటమా? మనసు వెనక్కి లాగుతుంటే, విశ్వామిత్రుని రూపం, ప్రభువు ఆజ్ఞ ముందుకు నెట్టుతున్నాయి.

మహర్షికి నమస్కరించి వెనక్కి వెళ్ళిపోయే శక్తి తనకు లేదా?

మహర్షి రూపం అయస్కాంతంలా ఆమెను ఆకర్షిస్తోంది. ఆయన చెంత చేరి అమిత భక్తితో, సహజమైన నమ్రతతో పాదాలకు నమస్కరించింది. ఏమి చిత్రం! రాజసంతో, సౌందర్యంతో దేవేంద్రుణ్ణి మించి భాసిస్తున్నాడు. మేనక చూపు మరల్చుకోలేకపోయింది. ఆ అదనుకోసం ఎదురుచూస్తున్న మన్మథుడు, అతని స్నేహితుడు వసంతుడు ఒకేసారి కలసి విజృంభించి, మలయమారుతానికి సహాయం చేశారు.

ఆ ప్రాంతంలో చెట్లన్నీ విరబూశాయి. ఆహ్లాదకరమైన వాతావరణానికి పక్షుల కిలకిలారావాలు మరింత శోభను చేకూర్చాయి.

"దేవకాంతను. తమ దర్శన భాగ్యం కలిగినందుకు ధన్యురాలిని. ఆజ్ఞానంతో రిక్తహస్తాలతో వచ్చాను. తమరు అనుమతిస్తే క్షణంలో తిరిగి దర్శనం చేసుకుంటాను" అంది మేనక ఓరగా చూస్తూ.

ఆమె వినయ విధేయతలు, భక్తి తత్పరత మహర్షిని ప్రసన్నుణ్ణి చేశాయి. చిరునవ్వుతో అంగీకారం తెలిపాడు.

విశ్వామిత్ర మహర్షి వదనాన్ని ఆశ్చర్యంతో, భక్తితో తిలకిస్తూనే, వెనక్కి అడుగులు వేసి వెనుదిరిగింది మేనక.

ఆమెలో ఏదో విశిష్టత ఉందని మహర్షి గమనించాడు. కేవలం దేవకాంత కాదీమె. సౌందర్య దేవత! ఆమె మధురంగా మాట్లాడే తీరు మహర్షికి మరీ అహ్లాదాన్ని కలిగించింది.

సమీపప్రాంతంలోనే చెట్లనుండి పూలు ఏరుకొస్తోంది మేనక. వాటిని పైటకొంగులో నింపుతోంది. అలా పూలు నింపుతుంటే, వక్షోజాలపైన అచ్ఛాదనం తొలగిపోయిన ధ్యాసేలేదు మేనకకి. ఆమె ఏకాగ్రతకి మహర్షి సంతసించాడు. ఏరి ఏరి కోసిన పూలు జారిపోకుండా ప్రతి అడుగూ జాగ్రత్తగా వేస్తూ నడుస్తోంది మేనక.

మహర్షిని సమీపించి, పైట పరచి పూలతో ఆయన పాదాలను అభిషేకించింది.

ఆ పూల సౌరభంతో నిండిన మలయమారుతం, మేనక చేస్తున్న పాదపూజ మహర్షికి మధురానుభూతిని కలిగించాయి.

పూర్వాశ్రమంలో, రాజ్యపాలచేస్తూ సౌందర్యవతులైన స్త్రీలనెందరినో చూశాడు విశ్వామిత్రుడు. కానీ మేనకలాంటి సౌందర్యరాశిని, భక్తురాలిని మొదటిసారిగా చూస్తున్నట్టనిపించింది.

అపాదమస్తకం అమెనే పరిశీలించాడు. మహర్షి పాదాలు పూలతో పూజించి, తత్తరపాటుతో లేచిన మేనక కటి వస్త్రం సడలించి. సిగ్గుతో కుంచించుకుపోయింది అప్సరోభామిని.

అమె సంపూర్ణ సౌందర్యం మహర్షి కళ్ళకు మిరుమిట్లు గొలిపింది. ఆమె ప్రతి అవయవమూ మహర్షిని సమ్మోహితుణ్ణి చేసింది.

అనిమిష కాంతను చూస్తూ మహర్షి అనిమిషుడయ్యాడు. మేనక జారిన వస్త్రాన్ని విలాసంగా వంగి తీసుకోబోయింది. మదన పరశత్వంతో మహర్షి ఆమె బాహువులు పట్టి దగ్గరికి తీసుకున్నాడు.

రాజసం, ప్రణయం రూపొందిన విశ్వామిత్ర మహర్షి పురుషోత్తముడిలా, ప్రేమమూర్తిలా అనిపిస్తుంటే, ఆ పరిష్వంగంలో తన్మయురాలైంది మేనక.

## వీడ్కోలు

ఏ క్షణంలో మేనకా విశ్వామిత్రులు ఒకరి నొకరు వీక్షించారో కానీ, అది మహత్తరమైన ముహూర్తమయింది. సృష్టికి ప్రతిసృష్టి చేయగల మహర్షి, దేవ కాంతల్లో అపురూపలావణ్యవతి మేనక శారీరకంగా, మానసికంగా, ధార్మికంగా, ఐక్యం కావటం ప్రకృతికే మహద్భాగ్యం. ఆ సమాగమ ప్రతిఫలం బృహత్తర మైంది.

మేనకా విశ్వామిత్రుల సహజీవనకాలమంతా నిత్యనూతనమై ఒప్పారింది. ఋతువులు రంగులు మార్చుకుని, వాటి ధర్మాలు మరిచిపోయాయా అన్నట్లు ఎల్లవేళలా వసంతంతోనే తపోవనం శోభాయమానమైంది.

మహర్షి అంటే భయమో, గౌరవమో కాని కర్మసాక్షి తన ప్రతాపాన్ని ఆ పరిసర ప్రాంతాలకు చేరనీయకుండా, ఆ ప్రణయానికి దోహదం చేశాడు. వెన్నెలరాజు మేనక సిగలో పూవై ఆమె సోయగాన్ని ఇనుమడింపచేశాడు.

విశ్వానికి మిత్రుడైన మహర్షి ప్రణయకలాపాలకి ప్రకృతే పరవశించి, సహకరించింది.

మేనకా విశ్వమిత్రులు ఒకరి సాహచర్యంలో ఒకరు తమ జన్మ ధన్య మైందనే భావనతో మనసు నింపుకున్నారు. శృంగార రస సామ్రాజ్యాధినేతలై మేనకా విశ్వామిత్రులు లోకాన్నీ కాలాన్నీ విస్మరించారు.

గర్భవతి అయిన మేనక రోజు రోజుకూ వింత వింత సొగసులు సంత రించుకుంటే సర్వజ్ఞానియైన మహర్షి కూడా అబ్బురపాటుతో ఆమెను గమని స్తూనే ఉన్నాడు. ఓ శుభముహూర్తాన శిశువును కన్న మేనక మాతృత్వంతో మైమరచి ఆ పసికందును గుండెకు హత్తుకుంది.

తమ ప్రణయఫలితమైన పసికందును చూస్తూ మేనకా విశ్వామిత్రులు భవిష్యత్తును గురించి ఆలోచించటం ప్రారంభించారు.

ఆ ఆలోచన వారిద్దరి మనసులకి సంక్షోభాన్ని కలిగించింది.

దేవకాంతలు శిశుపోషణాది సంసారబంధాలకు అతీతులు. ఈ పసిగుడ్డును తనతో దేవలోకానికి తీసికెళ్ళే అర్హతే లేదు తనకి. పోనీ, తానే శాశ్వతంగా భూలోకంలో ఉండిపోతే?

తను ఈ భూలోకంలోనే ఉండిపోతే మహర్షికి తనే తీరని అన్యాయం చేసినట్టే! తనమీది అనురాగంతో మహర్షి తన తపోనిష్ఠనే విస్మరించారు. ఇప్పటికే జరగరానిది జరిగింది. దేవేంద్రుని ఆజ్ఞ చెవుల్లో మారుమోగుతుంటే దీర్ఘంగా నిట్టూర్చింది మేనక.

విశ్వామిత్ర మహర్షి ఆమె సద్బుద్ధికి సంతసించాడు. కానీ, ఆమెను విడిచి ఉండటానికి ఆయన మనసూ అంగీకరించటంలేదు. అలా అని మేనకతో ఎప్పటికీ సంసారబంధం పెంచుకోవటం- తన జీవితలక్ష్యం కాదు. అందుకే దేవలోకం చేరాలన్న మేనక అభీష్టాన్ని వ్యతిరేకించలేదు.

విదారవదనంతో, చెక్కిట చేయి చేర్చి శూన్యంలోకి చూస్తున్న మేనక వంక ప్రశ్నార్థకంగా చూశాడు మహర్షి.

"స్వామీ! నేను రెండు తప్పులు చేశాను. తమ తపస్సుకి భంగం కలిగించాను. తమమీది అనురాగంతో, ఆలోచన లేకుండా ఈ పసిదానికి జన్మనిచ్చాను. అర్హతలేని మాతృత్వాన్ని ఎదురెళ్ళి ఆహ్వానించాను. బాధ్యత ఇప్పుడు తమపైన పెట్టడం నా నేరం కాదా?" మేనక వంచిన తల ఎత్తలేదు.

''మేనకా! జరిగినదానికి విచారించే స్వభావం నాది కాదు. మన సమాగమం ఎలా దైవికమో, మన ఎడబాటూ అంతే. నా తపోదీక్ష కొంత చెడిన మాట వాస్తవమే. కానీ, నువ్వు నా కందించిన ఈ ప్రణయానుభవాలు, ఈ స్వర్గసుఖాలు నేపోగొట్టుకున్న తపస్సంపదకి పరిహారం కాదా? ఈ విషయం మనోభావాన్ని బట్టి ఉంటుందనుకో మరి.''

మహర్షి ముఖంలో మందహాసం మెరిసింది.

"నీపట్ల నాకెప్పుడూ సదభిప్రాయమే ఉంది. స్త్రీకారణంగానే నే నొక ప్రేమమూర్తినని గుర్తించగలిగాను."

"స్వామీ, ఈ పసికందు బాధ్యత?" మేనక గొంతు విప్పింది.

మహర్షి క్షణం మేనక వంక చూశాడు. నిశ్చల హృదయంతో భవిష్యత్తును ఆలోకనం చేశాడు. ఆనందంగా తృప్తిగా మేనకవైపు చూపు నిలిపాడు.

"ఈ శిశువుకి గొప్ప భవిష్యత్తు ఉంది. ఈ శిశువు బాధ్యత విషయం నీవు చింతించకు. మహా తపోధన సంపన్నుడనైన నాకు, అప్సరోభామినుల్లో అగ్రగణ్యవైన నీకు జన్మించిన భాగ్యశాలిని ఈ పసిబిడ్డ రక్షణ బాధ్యత ప్రకృతే వహిస్తుంది." మహర్షి నిమీలిత నేత్రాలు మేనకకి ఊరట కలిగించాయి.

మహర్షి మనోభావాన్ని వెలిబుచ్చారా, ప్రకృతినే ఆజ్ఞాపించారా అనే విషయం మేనకకి అర్థం కాలేదు. కానీ, ఆ సర్వజ్ఞుని మాట లాలకిస్తుంటే, ఈ మహర్షి తపశ్శక్తే ఈ పసిబిడ్డకి రక్షణ అనే భావం కలగగానే, ఆమెకి కొంతంత బలం, ధైర్యం చేకూరాయి.

మాలినీ నదీతీరాన ఇసుకతిన్నెపైన మెత్తని ఆకులు పరిచింది మేనక. చేతులు వణుకుతుంటే, వదలలేక వదలలేక ఆ పసికందును అక్కడుంచింది.

అడుగు ముందుకు పడటం లేదు. మనసు ఎక్కడో స్తంభించింది. మాతృత్వపు మాధుర్యాన్ని నెమరువేసుకుంటూ మబ్బులతోపాటు మాయమైంది మేనక.

క్షణం పశ్చాత్తపుడై మరుక్షణంలో తేరుకున్నాడు మహర్షి.

పసికందును ఒక్కసారి వీక్షించాడు. భవబంధాలకు దూరంగా మనసును నిశ్చలం చేసుకున్నాడు.

తన లక్ష్యసాధనకోసం తపోవనంవైపు తరలిపోయాడు మహర్షి విశ్వామిత్రుడు.

*

(ఆధారం: కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం : ఆదిపర్వం: చతుర్థాశ్వాసం)

(ప్రచురణ: ఆంధ్రప్రభ సచిత్రవార పత్రిక: 11-11-1987 నుండి 25-11-1987 వరకు)

# శకుంతల

## 1

దుష్యంత మహారాజు "ధర్మ ప్రభువు." ఆయన ధ్యేయం తన దేశంలోని ప్రజలంతా సుఖశాంతులతో జీవించటమే.

అడవి జంతువులు అందమైనవి. కాని, వాటి సంఖ్య విపరీతంగా పెరిగిపోతే ప్రకృతికి భారం, ప్రజలకి భయం. వాటి నుంచి ప్రజలను కాపాడవలసిన బాధ్యత ప్రభువుది. దుష్యంత మహారాజు ప్రజలకి రక్షణ కల్పించడం కోసం వేట మీద తనకుండే సహజమైన కోరిక తీర్చుకోవటం కోసం, అడవికి బయలుదేరాడు. ఆయనతో బాటు ఆయన పరివారమూ బయలుదేరింది. క్రూర జంతువుల్ని చీల్చి చెండాడాడు.

దుష్యంతుడు వేటాడి, వేటాడి ఆ వేట వేగంలో తన సైనికుల్ని కూడా వదిలేసి, కొద్ది పరివారంతో ఓ నది ఒడ్డుకు చేరుకున్నాడు.

ఆ నది నీటితో సేద తీరాక, మహారాజు మనసుకు ఎంతో ఉల్లాసం కలిగింది. అరణ్యమంతా ఉద్యానవనంలా ఒప్పింది. ఎటు చూసినా పూలు, పళ్ళు, కాయలతో, పొదరిళ్ళతో కల కలలాడుతోంది ఆ ప్రాంతమంతా.

అప్పుడాయనకి స్ఫురించింది అది కణ్వ మహర్షి ఆశ్రమ ప్రాంతమని. తనతో ఉన్న కొద్ది పరివారాన్ని విశ్రాంతి తీసుకోమని చెప్పి, కణ్వ మహర్షిని దర్శించి వస్తానని బయలుదేరాడు ఒంటరిగా దుష్యంతుడు.

దుష్యంత మహారాజు వెడుతుంటే ఆ ప్రయాణానికే ఓ అర్థమున్నట్లు, ప్రకృతి సంతసించినట్టు, చెట్ల నుంచి పూలు జల జలా రాలి ఆయన శిరసు పైన పడ్డాయి. అవి అక్షతల్లా భాసించాయి. అలసట పోయింది మహారాజుకి. వినూత్నమైన శక్తి ఆయన శరీరాన్ని ఆక్రమించుకుంది. ఉత్సాహంతో ముందుకు నడుస్తుంటే, ఆశ్రమ ప్రాంతంలోని కుటీరాలు కనిపించాయి. వేద ఘోషతో ఆ ప్రదేశం మారుమోగుతోంది.

అక్కడి చెట్లు పళ్ళతో, పూలతో నిండి, భారంగా వంగి, వాటి బాధ్యత నిర్వర్తిస్తున్నట్టుగా ఉండి దుష్యంతుడికి ఆశ్చర్యాన్ని కలిగించాయి. అటువంటి ఉద్యానవన శోభ ఇంతవరకూ ఎక్కడా చూడలే దనిపించింది.

అలా నడుస్తున్న దుష్యంతుడి శిరసు పైన మళ్ళా పూల జల్లు, మళ్ళా పూల జల్లు - మహారాజు శిరసున మాత్రమే కాదు, ఆయన నడిచే మార్గంలో అడుగు ముందుకు పడుతుంటే, అంతకన్నా ముందే పూల వాన కురుస్తోంది. తను చక్రవర్తి అయినా, ఇంత గొప్ప, సహజమైన ఆహ్వానం ఎన్నడూ లభించ లేదు. ఇది ప్రకృతి అందిస్తున్న ఆహ్వానం! దుష్యంతుడి మనసుకి సంతోషమే కాదు, ఏదో శుభం కలగబోతున్న దనిపించింది. ఏమై ఉండవచ్చు? మహర్షి ఆశీర్వచనమా?

దుష్యంతుడు ఉత్సాహంగా ఆశ్రమం వైపు నడిచాడు. అక్కడి దృశ్యాలు ఆయన్ను తబ్బిబ్బు చేశాయి. ఏనుగుల నీడల్లో సింహాలు విశ్రాంతి తీసుకుం టున్నాయి. ఆశ్రమవాసులు విడిచిపెట్టిన భూత పిండాలు పిల్లులూ, ఎలుకలూ కలసి తింటున్నాయి. సహజ వైరాన్ని అంతరింపచేసిన మహత్తు కణ్వ మహర్షిది!

దుష్యంతుడు ఆహ్లాదకరమైన వాతావరణాన్ని తిలకిస్తూ కణ్వాశ్రమంలో అడుగు పెట్టాడు.

దుష్యంతుడు మహారాజని, చక్రవర్తి అని గుర్తించడం ఎవరికైనా సులభమే. ఆ మహారాజు రూప సౌందర్యాలు, శౌర్య సాహసాలు ప్రజలందరికీ పరిచితాలే. దుష్యంతుణ్ణి అంతకు ముందు చూడకపోయినా, ఆశ్రమంలో అడుగు పెడుతుంటేనే శకుంతల దుష్యంతుణ్ణి గుర్తించింది. తను విన్నదానికి, చూసిన దానికి ఒకటే తేడా. విన్నదానికన్నా మిన్నగా ఉన్నాడు. రాజఠీవి, దర్పం, రాజసం, మన్మథుణ్ణి మించిన సౌందర్యం, విశిష్టమైన వేష భూషణాలు-అతన్ని ఎంత చూసినా ఇంకా తనివి తీరనట్టే అనిపించింది శకుంతలకి.

దుష్యంత మహారాజు అడుగుపెడుతూనే మెరుపు తీగలా భాసిస్తూ, నూత్న యౌవనం సంతరించుకున్న కన్యను చూశాడు. వేయి కళ్ళతో ఆమెనే పరిశీలిం చాడు. తను చక్రవర్తి అయి ఉండి, ఆశ్రమ వాసిని అయిన కన్యను అలా వీక్షించటం అసభ్యమని కూడా అతనికి ఆ సమయంలో అనిపించలేదు. సృష్టిలో ఇలాటి కన్యామణి ఉండడమే అసంభవ మనిపించింది. ఆమెకు సంబంధించిన అనంతమైన రహస్యమేదో ఉందని మనసుకి తోచింది దుష్యంత మహారాజుకి.

వన దేవతల ఆశీర్వాదం ఈ లావణ్యవతి దర్శనభాగ్యం కోసమేనా? ఈనాడెంత సుదినం!

దుష్యంతుడు శకుంతల వంక తిరిగి, "మేము దుష్యంత మహారాజులం, పూజనీయులైన కణ్వ మహర్షి దర్శనార్థం వచ్చాం" అన్నాడు ఠీవిగా.

అతని చూపు ఆమెను విడిచిపెట్టలేదు. మహారాజు తనవైపు చూస్తున్న తీరు సిగ్గును కలిగిస్తుంటే, శకుంతల తన విషయం ముందుగా చెప్పుకోవటం మంచిదన్నట్టు తల వంచి నమ్రతగా "నేను కణ్వ మహర్షి కుమార్తెను. నన్ను శకుంతల అంటారు. నా తండ్రి సమిధలు, పండ్లు, పూలు తేవడానికి ఇప్పుడే అడవికి వెళ్ళారు. ముహూర్త కాలంలో రావచ్చు. తమరు విశ్రమించండి" అంది.

దుష్యంత మహారాజుకు అతిథి మర్యాదలు చేసి, సుఖాసీనుణ్ణి చేసింది శకుంతల.

ఆమె రూపాన్ని ఎంతసేపు చూసినా మహారాజుకి ఇంకా చూడాలనే ఉంది. తనకు కనిపించిన శుభ సూచనల పరమార్థం ఈ సౌందర్యరాశిని దర్శించటం మాత్రమే కాదేమో! ఆ మహదానందంలో ఆయన మనసు ఆమె పైన లగ్నమైంది. 'ఈమె నా భార్య అయితే, నా జీవితమే ధన్యమవుతుంద!' అనుకున్నాడు.

మహారాజు దృష్టి ఆమెలోని రాచకన్య లక్షణాల పైన కేంద్రీకృతమయింది. అంతటితో ఆగలే, ఆమె ధరించిన వస్త్రాల పైనా నిలిచాయి చూపులు. మునిపల్లెలో కన్యలు ధరించే ఆ నారచీరలు ఆమె శరీరం పైన ఎంతో కృతకంగా కనిపించాయి. ఈ కన్య పట్టుపీతాంబరాలతో, రత్నాలంకారభూషితురాలైన రాచకన్యగా చెంత ఉండుట ఊహించుకుంటేనే మహారాజు మన్మథ వివశుడయ్యాడు. ఆమెను తన బాహువుల్లోకి తీసుకోవాలనే కోరిక బలంగా కలిగింది.

కానీ, చటుక్కున గుర్తొచ్చింది ఈమె ముని కన్య అని, కణ్వ మహర్షి కూతురు అని. ఆమె పట్ల తనకు అటువంటి భావన కలగడం అధర్మం, అక్రమం!

అంతలో మెరుపులా మరో ఆలోచన వెంటపడింది. ఈమె ముని కన్య అయితే, ఈ రూప లావణ్యాలు, రాచ కన్య లక్షణాలు ఎలా సంతరించుకుంది? పైగా కణ్వ మహర్షి తపస్సంపన్నుడైన బ్రహ్మచారి.

శకుంతలను దుష్యంతుడు తదేకంగా పరిశీలిస్తుంటే, కళ్ళు వాల్చి నిలబడింది. అతనిలో ఏదో ఆందోళనను గమనించింది శకుంతల.

## 2

దుష్యంత మహారాజు ముఖ కవళికలు గమనించిన శకుంతల మనసు పరిపరివిధాల పోయింది. మహారాజు యెడల మర్యాదలోపమేమీ చేయలేదు కదా తను అనుకుంది ఒకసారి. రాజులకు ఆగ్రహం, అనుగ్రహం ఎప్పుడొస్తాయో తెలియదు. శకుంతల బెదురుతూ దుష్యంతుడివైపు చూసింది. దుష్యంతుడి చూపుల్లో ఏదో తీక్షత కనిపించింది.

"కణ్వ మహర్షి నిష్ఠగల బ్రహ్మచారి. అటువంటి మహర్షి నీ జనకుడు అంటుంటే ఆశ్చర్యంగా ఉంది."

దుష్యంతుడి మాటలకి శకుంతలకి నవ్వొచ్చింది. కాని, నవ్వితే మహారాజు ఆగ్రహిస్తే ఎలా అనుకుని, ఆ నవ్వుని పెదాలు దాటి రానీయకుండా జాగ్రత్త పడింది.

రాజ్యపాలన చేస్తూ, ప్రజల సమస్యలను తీర్చే రాజుకు ఇంత చిన్న విషయం ఊహకే అందకపోవడమేమిటి?

"మహర్షి నా కన్నతండ్రికాదు. పెంపుడు తండ్రి." నెమ్మదిగా అంది.

మహారాజు మనసు ఆ మాటలతో తేలికపడింది.

కుతూహలంతో వెంటనే ప్రశ్నించాడు:

"మరి నీ తల్లితండ్రు లెవరో, నీ జన్మ వృత్తాంతమేమిటో చెప్పు."

"నా జనకుడు మరొక మహర్షితో నా జన్మవృత్తాంతం చెప్పగా విన్నాను. నా తల్లి తండ్రులు మేనకా విశ్వామిత్రులు."

ఆ మాట వినగానే దుష్యంతుడి మనసులోని ఆందోళన అదృశ్యమైంది. ఉత్సాహం ద్విగుణీకృతమయింది.

తన మనసు ఆమెవైపు ఆకర్షితమవటంలో అధర్మం లేదు. ఈ కన్యను భార్యగా స్వీకరించడానికి ఏ ధర్మశాస్త్రమూ అడ్డురాదు. ఈమె అన్ని విధాల తనకు తగిన కన్య.

మహారాజు ముఖకవళికల్లో కనిపిస్తున్న మార్పు శకుంతలకు భయాన్ని కలిగించింది.

మహారాజు ఆవేశంతో గబగబా చెప్పటం మొదలు పెట్టాడు.

"శకుంతలా! నీ దగ్గరకు వస్తుంటేనే దేవతలు ఆశీర్వదించిన అనుభూతి కలిగింది నాకు. నిన్ను చూడగానే నా మనసు నీపైన లగ్నమైంది. నువ్వు ముని కన్యవంటే నమ్మలేకపోయాను. నువ్వు రాచకన్యవి. నిన్ను భార్యగా స్వీకరిస్తాను."

దుష్యంతుని మాటలకు శకుంతలలో భయం, ఆశ్చర్యం, ఆనందం సమ్మిళితమయ్యాయి. ఆమె హృదయంలో ఆశ రేకెత్తింది.

'భార్యగా స్వీకరిస్తాను' అని అతడన్నమాటలు ఆమెకు అమితానందాన్ని కలిగిస్తుంటే, ఓరకంటితో మహారాజును చూసింది.

అసమానమైన దుష్యంతుని సౌందర్యం, దృఢమైన శరీరం, చక్రవర్తి రాజఠీవి, ఆయన ధరించిన వేషం, రత్నహారాలు - ఆ మహారాజును చూస్తూ, ఆయన భార్యగా అతని కౌగిలిలో తనను తాను ఊహించుకుంటుంటే శకుంతలలో ఉత్సాహం పరవళ్ళు తొక్కింది. క్షణమాగి..

"మహారాజా, నేను స్వతంత్రురాలిని కాను. కొద్దిసేపట్లోనే మా తండ్రిగారు వస్తారు. మీ అభిమతం ఆయనకు తెలియజేస్తే..." శకుంతల మాటలు తడబడ్డాయి. చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి.

శకుంతల వివాహానికి సుముఖంగా ఉందని గ్రహించిన దుష్యంతుడు ఆమెను స్పృశించకుండా అరనిముషం ఆగలేకపోయాడు. మహారాజు ఆమె భుజాలపైన చేతులు వేయగానే శకుంతల ఒళ్ళు పులకరించింది. వెంటనే, ధైర్యం కూడదీసుకుంది. రెండడుగులు వెనక్కి వేసింది.

"మహారాజా! ఒక విన్నపం. మనకి వివాహం కాలేదు. మహర్షి క్రమశిక్షణలో పెరిగిన నేను అధర్మంగా ప్రవర్తించలేను."

శకుంతల మాటలు దుష్యంతుని ఆవేశానికి అడ్డుపడలేదు.

"మేము మహారాజులం. ధర్మాధర్మాలు మాకు తెలుసు. మహారాజులకు ఉచితమైన వివాహపద్ధతుల్లో గాంధర్వమొకటి. మనసు లగ్నమైన క్షణమే సుముహూర్తం. దానికి మంత్రాలతో పనిలేదు."

ఆ మాటలు పూర్తిగా అర్థం చేసుకునే లోపలే దుష్యంతుడు శకుంతలను బాహువుల్లో బంధించాడు.

ప్రథమ పరిష్వంగ ఆనందానుభూతినుంచి తేరుకొని, పర్యాలోచన చేయసాగింది శకుంతల.

హితవు చెప్పడానికి తండ్రి దగ్గర లేడు. దుష్యంతుణ్ణి కాదని కోపం తెప్పిస్తే ఏంలాభం? దుష్యంతుడు శౌర్యధైర్య సంపన్నుడు. అతని భార్యగా, రాణిగా, రాజమాతగా తనకు బంగారు భవిష్యత్తును అతను అందిస్తుంటే కాల దన్నుకోటం సమ్మతం కాలేదు. శకుంతల మనసులో ఎటూ తేల్చుకోలేక పోయింది.

ఇంత కొద్ది సమయంలో తన భవిష్యత్తుగురించి తనే నిర్ణయించుకోవలసి వచ్చినందుకు లోపల బాధగా ఉన్నా తన శక్తిని కూడదీసుకుని, దుష్యంతుని పరిష్వంగం నుంచి బయటపడింది.

"నా విన్నపం వినండి మహారాజా! నా బాగోగులు శ్రద్ధగా చూసే నా తండ్రి ఇప్పుడిక్కడలేడు. మీరు మహారాజులు. నిత్యనూతనులు. మీరు ఎప్పుడు ఎక్కడ ఎవరినైనా చేపట్టవచ్చు. అందుకని నావోమనవి. మనకి పుట్టబోయే పుత్రుణ్ణి యౌవరాజ్యాధిపతిని చేస్తానంటే." శకుంతల తర్వాత ఏమీ అనలేదు. నుదుటిమీద స్వేద బిందువుల్ని తుడుచుకుంది.

మీతో గాంధర్వ వివాహానికి నేను అంగీకరిస్తానని శకుంతల అనక పూర్వమే, దుష్యంతుడు శకుంతలను బాహువుల్లోకి తీసుకుని, ఆమెను చుంబించాడు.

"శకుంతలా! నీ అభిమతం నాకర్థమైంది. పుట్టబోయే కుమారుణ్ణి యువరాజును చేస్తాను. నీ గర్భాన ఎంత గొప్ప పుత్రుడు జన్మించగలడో ఊహించగలను. నువ్వు సామాన్యురాలివా? రాజర్షి విశ్వామిత్రుడి పుత్రికవి. ఇదే నా వాగ్దానం."

దుష్యంత మహారాజుకు తనంటే ఉన్న అవధుల్లేని ప్రేమకు పరవశిస్తూ, ఆయనలోని ప్రేమపురుషుడిలో లీనమైంది మేనకా విశ్వామిత్రుల ప్రేమఫలం, కణ్వ మహాముని గారాలపట్టి శకుంతల.

# 3

దుష్యంత మహారాజుని, శకుంతల అందించిన ప్రణయానుభవం పరవశుణ్ణి చేసింది. దాంట్లోనుంచి తేరుకుని, శకుంతల ముఖం పరీక్షగా చూశాడు. ఆమెకు తనంటే ఉన్న విశ్వాసం, గౌరవం, భక్తి, ప్రణయం అన్నీ ఆ ముఖంలో స్పష్టంగా కనిపించాయి దుష్యంతుడికి ఆ సమయంలో.

ప్రణయ లోకంనుంచి ఈ లోకానికి రాగానే దుష్యంతుడికి తను మహారాజుననీ, తన పరివారం దగ్గరలోనే ఉందనీ, వేటకని తనతో బయలుదేరిన మరికొందరు సైనికులు అడవిలో ఉన్నారనీ వెంటనే గుర్తొచ్చింది. తను కణ్వ మహర్షి వచ్చేవరకూ ఇక్కడే ఉండి, జరిగింది ఆయనకు విన్నవించాలా అనే ఆలోచనా కలిగింది.

అంతలో, మహారాజు మనసు ఆందోళనచెందింది. శకుంతల కణ్వమహర్షి ముద్దుల కుమార్తె. గారాబంగా పెంచుకున్నాడు మహర్షి. లోకంపోకడలేమీ తెలియని అమాయకురాలు, కన్య, తండ్రిచాటు పిల్ల. గాంధర్వ వివాహంతో తండ్రి అనుమతి లేకుండా తను స్వాధీనపరుచుకున్నాడు ఆమెను.

మహర్షికి యథార్థం చెప్పి, తన ప్రవర్తన ధర్మసమ్మతమేనని ఒప్పించాలి. తను విషయం వివరించేలోపునే ఆయనకు ఆగ్రహం కలిగితే- సద్భావంతో, సదాశయంతో శకుంతలను తను చేపట్టినట్లు మహర్షిని అంగీకరింపచేయగలడా?

కణ్వమహర్షి గొప్ప తపోధనుడు, నియమపరుడు అని విన్నాడు. కానీ ఆయన స్వభావం సాత్త్వికమో కాదో తనకు తెలియదు. అధర్మమని ఆయన అనుకుంటే కోపగించి, శపిస్తాడేమో?

అయితే శకుంతల తెలివితేటలు, చాకచక్యం ఉన్న స్త్రీ అని విశ్వాసం కలిగింది దుష్యంతుడికి.

గాంధర్వ వివాహ విషయం శకుంతల చెప్తేనే కణ్వుడి మనసు మెత్తబడుతుంది. శకుంతల తనమీదున్న పూజ్యభావంతో తనను మాట రానీయకుండా సమర్థించగలదు. మహర్షి రాకముందే తను బయలుదేరి వెళ్ళిపోవటం మంచిదని తోచింది మహారాజుకి.

"శకుంతలా! నాకోసం నా పరివారం ఎదురుచూస్తుంటారు. నేను త్వరగా వెళ్ళాలి. నీ తండ్రిగారికి మన వివాహ విషయం చెప్పు. నా మంత్రి పురోహితులను త్వరగా పంపి, రాచమర్యాదలతో నిన్ను నా రాజ్యానికి తీసుకువచ్చే ఏర్పాటు చేస్తాను."

మహారాజు మాటలు వింటూ దీనవదనంతో, బేలగా చూసింది శకుంతల. మహారాజు ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

"చూడు. మన ఎడబాటు కొద్దికాలమే." దుష్యంతుడి గొంతుదాటి మాటలు పెగిలిరావటం కష్టమైంది.

నీళ్ళు నిండిన కళ్ళతో చూస్తూ ఉండిపోయింది శకుంతల.

మహారాజు వెడుతుంటే శకుంతల గుమ్మంలో అలా నిలబడింది. దుష్యంతుడు అడుగు ముందుకు వేస్తున్నా ఆమె దీనమైన ముఖమే వెంటాడుతోంది ఆతన్ని. తనమీద సంపూర్ణ విశ్వాసంతో, మహారాజు అన్న పూజ్యభావంతో, తన కీర్తి ప్రతిష్ఠలమీద గౌరవంతో తననుతాను సమర్పించుకుంది ఈ శకుంతల. ఆమెను రాణిని చేసి, ఆమెకు పుట్టే కొడుకును యువరాజును చేస్తానని వాగ్దానం చేశాడు తను. చిన్నపిల్ల అయినా తెలివిగా, భవిష్యత్తును దృష్టిలో పెట్టుకు ఆలోచన చేసింది-తను అంగీకరించాడు-ఇప్పుడు ఆ మాట నిలబెట్టుకోవాలి.

ప్రజాభిప్రాయానికి, ప్రజాశ్రేయస్సుకీ అత్యంత ప్రాధాన్య మిస్తాడు దుష్యంతుడు. ఏ రాజ్యపాలకుడి కీర్తిప్రతిష్ఠలైనా వాటిపైనే ఆధారపడి ఉంటాయి. కదా! అదే రాజధర్మమని దుష్యంతుని అభిప్రాయంకూడా.

తన మంత్రిమండలి, తన ప్రజలు శకుంతలతో తన గాంధర్వ వివాహాన్ని మన్నిస్తారా, తన నిర్ణయాన్ని ఆమోదిస్తారా? ఈ భావన కలగగానే మహాబలసంపన్నుడు, రాజ్యపాలనాదక్షుడు అని పేరొందిన దుష్యంత మహారాజు మనసు కలతచెందింది.

రాజు నిత్యనూతనుడైనా, స్త్రీ లోలుడైనా ప్రజలు, మంత్రి మండలి కొంత వరకు సహించగలరేమో కానీ, రాణిగా మహారాజు ఎవరిని చేపట్టాలి? యువరాజుగా ఎవరికి పట్టాభిషేకం చేయాలి? అనే ముఖ్య విషయాలు నిర్ణయించే అధికారం పాలకులకేకాదు, పాలితులకి కూడా ఉంది. తను ఏక పక్షంగా

నిర్ణయం తీసుకుని శకుంతలకి వాగ్దానం చేశాడు. ఆమెకు ఆశ కల్పించాడు. మాట తప్పకుండా జరిపించవలసిన బాధ్యత తనపైనే ఉంది. అమాత్య బృందానికి వివాహ విషయం సందర్భం చూసుకుని తెలియపరచాలి. ఇది ఎంత బరువైన బాధ్యతో తనకు తెలుసు. ఇది స్వయంకృతం. ఆలోచించినకొద్దీ ఈ గాంధర్వం దుష్యంతుని కళ్ళకి పెద్ద సమస్యగా కనిపించింది.

వేటకి వెళ్ళి మునికన్యను గాంధర్వ వివాహం చేసుకున్నానంటే అప హాస్యం పాలవుతాడేమో తను తన ప్రజల ముందు. భయాందోళనలు అలుము కుంటుంటే, అనాలోచితంగా నిర్ణయం తీసుకున్నానేమో అనుకుంటూ దుష్యంత మహారాజు వేగంగా నడకసాగించాడు.

తన అశక్తత అంచనా వేసుకుంటుంటే, తటుక్కున ఒక ఆలోచన మన సులో మెదిలింది. దాంతో ఎంతో ధైర్యమొచ్చింది దుష్యంతుడికి.

శకుంతల కణ్వమహర్షి గారాలపట్టి. పెంచిన ప్రేమ చాలా గొప్పది. కన్నతండ్రికంటే ఎక్కువ బాధ్యతగా పెంచి పెద్దదాన్ని చేశాడు కణ్వుడు. శకుంతలమీద ఆప్యాయతతో కణ్వుడు తప్పక తన రాజ్యానికొస్తాడు. శకుంతలతో తన వివాహం ధర్మసమ్మతమేనని, శకుంతలకు తను చేసిన వాగ్దానం న్యాయ మైనదని చెప్తే?

కణ్వమహర్షి సర్వజ్ఞాని. ఆయన సౌశీల్య స్వభావాలు, తపశ్శక్తి, కీర్తి ప్రతిష్ఠలు ప్రఖ్యాతమైనవి. అవి తన ప్రజలందరికీ తెలుసు. కణ్వమహర్షి నిర్ణ యాన్ని హితవునూ కాదని చెప్పే ధైర్యం తన రాజ్యంలో ఎవరికీ ఉండదు. ఈ భావం దుష్యంతుడికి కొండంత బలాన్నిచ్చింది.

మహర్షి శకుంతలను అత్తవారింటికి పంపుతాడు. తాను వారిని సాద రంగా ఆహ్వానిస్తాడు. అసమాన సౌందర్యరాశి శకుంతల పట్టపురాణిలా సర్వాలంకారభూషితురాలై తన చెంత నిలుస్తుంది.

ఆ మధురమైన భావం ఒక దృశ్యంలా దుష్యంతునికి కళ్ళముందు నిల్చింది. ఉత్సాహం ఉరకలు వేస్తుంటే, వేగంగా తన పరివారాన్ని చేరాడు దుష్యంత మహారాజు.

# 4

దుష్యంత మహారాజు శకుంతలను వీడి వెళ్ళిపోతూంటే ఏదో తెలియని ఆవేదన ఆమెను చుట్టుముట్టింది. ఎంతలో తన జీవితం మారిపోయిందో అనుకుంటూ తనను తాను పరిశీలనగా చూసుకుంది శకుంతల. కొద్ది క్షణాలక్రితం వరకూ ఆశ్రమంలో తండ్రిచాటున పెరిగిన మునికన్య, ఇప్పుడు వివాహిత! అంతేకాదు, మహారాజపత్ని. కాబోయే రాజమాత. తెలియకుండానే దుష్యంతుని స్పర్శానుభూతితో ఆమె శరీరం పులకించింది. చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి. కళ్ళలో కొత్త మెరుపు. తను ఒక్కసారిగా పెద్దదైపోయిందన్న భావం ఆవరించింది.

దుష్యంత మహారాజుకి తనంటే ఎంత ప్రేమ! తొలి చూపులోనే తనంటే ఇష్టపడి తననే కావాలని కోరుకోవడం నిజంగా తన భాగ్యమే! మహారాజెక్కడ? మునిపల్లెలో పెరుగుతున్న తనెక్కడ? పైగా తనకి పుట్టబోయేకుమారుణ్ణి యువరాజును చేయాలని తను కోరితే వెంటనే అంగీకరించాడు మహారాజు. ఎంత సహృదయుడు, ఎంత ప్రేమైకమూర్తి.

ఈ విశేషాలన్నీ విజయగర్వంతో తండ్రికి చెప్పాలి. తండ్రి తలపు రాగానే శకుంతల గుండె దడదడలాడింది. ముఖాన్ని అలముకున్న స్వేదబిందువుల్ని తుడుచుకుంది. తనుచేసిన పని నిజంగా గర్వపడవలసిందేనా? లేక తెలివి తక్కువతో తప్పు చేసిందా? తండ్రి అంగీకారం లేకుండానే గాంధర్వ విధిని మహారాజును వివాహమాడింది. ఇది తండ్రిని అగౌరవపరచినట్లో, దోషం చేసినట్లో అయితే? నిజానికి కణ్వ మహర్షి ఆశీర్వచనం పొందే వివాహం చేసుకుందామనుకుంది. కాని, రాజు చాలా తొందరచేశాడు. మహారాజును కాదనే ధైర్యం ఆ నిముషంలో తనకెందుకు లేకపోయిందో? కేవలం ఆయన అధికారం, ఆయన సంపదా చూసి తను మోహపడలేదుగా? బహుశః ఆయనలోని రాజఠీవి, ఆ మన్మథరూపం, ఆ సంభాషణాచాతుర్యం, ఆ నిర్మల మనసు, తన ఎడల చూపిన అనురాగం ఇలాంటి వెన్నెన్నో తనను అనురాగబద్ధురాలిని చేశాయి. పైగా క్షత్రియులకు గాంధర్వం ఉచితమేనని, శాస్త్ర సమ్మతమేనని ఒప్పించాడు కూడా.

మహారాజు అసత్యమాడుతాడా? మాట తప్పుతాడా? శకుంతల అటూ ఇటూ ఒక్కసారి పరికించింది.

'మహారాజు మాట తప్పడు!' శకుంతల తనకు తానే ధైర్యం చెప్పుకుంటుంటే ఆమెకు తెలియకుండానే ఏదో భయం, సంశయం, ఆమె మనసుని కదలించాయి. మహారాజే మాట తప్పితే తన గతేం కాను? తన సంరక్షకుడు, తన శ్రేయోభిలాషి అయిన కణ్వమహర్షికి తెలియపరచకుండా తనకు అప్పటివరకూ తెలియని వ్యక్తిని నమ్మి సమ్మోహ ప్రభావంతో తన జీవితాన్ని తనే తీర్చిదిద్దుకుంది. తన నిర్ణయం తప్పయితే ఆ బాధ్యత తనే వహించాలి. దుష్యంత మహారాజు మాట నిలబెట్టుకోకపోయినా, కణ్వ మహర్షి కోపించినా అనుభవించవలసింది తనే! శకుంతల దీర్ఘంగా నిట్టూర్చింది.

ఆటుపోటులతో అల్లకల్లోలిత సముద్రంలా ఉంది మనసు. ఆ ఆందోళనతోనూ, కొద్ది క్షణాల క్రితం కలిగిన ప్రణయానుభవంతో సమ్మిళితమైన భావోద్రేకం ఆమె ముఖంలో విస్పష్టంగా కనిపిస్తోంది.

కణ్వమహర్షి ఆశ్రమంలో అడుగు పెడుతూనే తలవంచుకుని దీర్ఘాలోచనలో ఉన్న కుమార్తెను చూశాడు. నవ్వుతూ లేడి పిల్లలతో సమంగా గెంతుతూ ఆడుకుంటూ మెరుపు తీగలా ఆశ్రమంలో విహరించే శకుంతల దీర్ఘాలోచనపరురాలై అలా తల వంచి కూర్చోటం మహర్షికి కొత్తగా, వింతగా కనిపించింది.

మహర్షి అడుగులు ముందుకు పడుతుంటే తండ్రి రాకను గమనించిన శకుంతల తత్తరపాటుతో లేచి తండ్రిచేతిలో కందమూల ఫలాలు చాలా యాంత్రికంగా అందుకుంది. శకుంతలను ఆపాదమస్తకం గమనించాడు కణ్వుడు. ముఖంలో వింత కాంతి, నడకలో ఏదో నెమ్మది, చూపుల్లో ఏదో బెదురు. ఏదో కొత్త మార్పు కనిపించింది శకుంతలలో. అమాయకంగా, బేలగా ఉన్న చిన్నపిల్లలా లేదు శకుంతల ఆయన కళ్ళకు. ఈ మార్పు స్వల్పమైంది కాదు. కానీ తను అడివికి వెళ్ళి వచ్చే లోపల జరిగిన ఈ బృత్తరమైన మార్పును గూర్చి ఆమెను ప్రశ్నించి ఆమెచేత చెప్పించడం తగదనిపించింది కణ్వమహర్షికి. నిలదీసి ప్రశ్నించే కఠినమైన స్వభావం కాదు తనది. కణ్వమహర్షి ఒక్కసారి పరిసరాలు పరికించాడు. సిగ్గుతో, భయంతో ఒకమూల దాగిన శకుంతలను చూశాడు.

ఈమె భూత భవిష్యత్ వర్తమానాలు తనకే అవగాహన కావాలి అనుకుంటూ కణ్వుడు ధ్యాన నిమగ్నుడయ్యాడు. కణ్వుడి దివ్యదృష్టికి అంతా క్షణంలో తేటతెల్లమైంది.

"తల్లీ! మహారాజు చెప్పిన మాట సత్యం. రాజులకు గాంధర్వం శాస్త్ర సమ్మతమే!"

శకుంతల ఉలిక్కిపడింది. తండ్రికి విషయం తెలిసిపోయింది.

"నీవు గర్భవతివి. నీ గర్భాన అసమాన బలతేజోవంతుడై, కీర్తి ప్రతిష్ఠలతో విలసిల్లే చక్రవర్తి జన్మిస్తాడు తల్లీ!" కణ్వుడు మహదానందంతో శకుంతల శిరసు నిమిరాడు.

శకుంతల ఉత్సాహంగా ఊపిరి పీల్చుకుంది.

"నువ్వు విచారించాల్సిన పనిలేదు. నీకు తగిన వరుణ్ణి ఎన్నుకున్నావు. అది నీ అదృష్టం. వేటకని వచ్చిన దుష్యంత మహారాజు వెతుక్కుంటూ వచ్చి నిన్ను చేపట్టడంతో నీ జన్మ ధన్యమైంది!" మహర్షి కళ్ళలో ఆనందబాష్పాలు నిండాయి.

శకుంతల గర్భ సంరక్షణ విధులు నిర్వహించే బాధ్యత ఆశ్రమ పుణ్యస్త్రీలకు అప్పగించాడు కణ్వమహర్షి.

శకుంతలకు పట్టరాని సంతోషం కలిగింది. ఆమె భయాందోళనలు మటుమాయమయ్యాయి. ఆశ్రమంలో అందరూ ఎంతో ఆప్యాయతతో, గారాబంతో ప్రత్యేకమైన శ్రద్ధతో తనకు పరిచర్యలు చేస్తుంటే తన జీవితమే కొత్త మలుపు తిరిగిందనిపించింది శకుంతలకి. మునికన్యలా కాక, మహారాజు పత్నిగా తనను మన్నిస్తుంటే ఆ అనుభూతి మనసుని గిలిగింతలు పెట్టింది.

తన శరీరం తనకే కొత్తగా కనిపిస్తోంది. శరీరంలో ప్రతి కదలిక చిత్రమైన అనుభూతి నిస్తోంది. దుష్యంత మహారాజుతో గడిపిన మధురక్షణాలు మళ్ళీ మళ్ళీ తల్చుకుని మైమరుస్తోంది శకుంతల.

తనకు పుట్టబోయే కుమారుడిలో చక్రవర్తి దుష్యంతుని రూపురేఖలు ఊహించుకుంటుంటే శకుంతల కళ్ళలో శరజ్జ్యోత్స్నలు వెల్లివిరిశాయి.

# 5

గర్భ సంరక్షణ నిమిత్తం కణ్వ మహర్షి ఆశ్రమ స్త్రీలకు ఆజ్ఞాపించిన కార్యక్రమం పూర్తి అయిన తరువాత నవమాసాలు గడిచాయి. అయినా శకుంత లను చూస్తుంటే ప్రసవ సమయ మాసన్నమైనట్లే అనిపించలేదు ఆశ్రమంలో ఎవరికీ. అనుభవజ్ఞులైన ఆశ్రమ స్త్రీలు శకుంతలను కనిపెట్టుకునే ఉన్నారు.

రోజులు గడుస్తున్నాయి. రోజులు మాసాలవుతున్నాయి. శంకుంతల స్థితి ప్రకృతి విరుద్ధంగా కనిపించి, అక్కడి వారందరికీ భయాందోళనలు కలిగించింది.

కణ్వమహర్షి విశ్రాంతిగా ఉన్న సమయం చూసి, ఆశ్రమ స్త్రీలు తమ సందేహాన్ని వెలిబుచ్చారు ఆయనకు.

మహర్షి వారి మాట లాలకించి, చిరునవ్వు నవ్వాడు. "శకుంతలకి సామాన్య మానవ ధర్మాలు వర్తించవు. అప్సరోభామిని మేనక ఈమె తల్లి. తపోధనుడు విశ్వామిత్రుడు ఈమె తండ్రి. దైవనిర్ణయం ప్రకారం శంకుంతల ప్రసవం జరుగుతుంది. వేచి ఉండటమే మన కర్తవ్యం" అంటూ ధైర్యం చెప్పాడు.

వారి పాదాలకు నమస్కరించి సెలవు తీసుకున్నారు వచ్చినవారంతా.

శకుంతల వాళ్ళందరికీ మునుపటి కంటే మిన్నగా కన్నబిడ్డలా అయిపో యింది ఆమె ప్రతి కదలికా వారి దృష్టినుంచి తప్పించుకోలేకపోతోంది. కాల గమనం వారి దృష్టిలో లేదు.

మూడు వసంతాలు గడిచాయి. ఓ శుభసమయాన శకుంతల ప్రసవిం చింది. ఆ శిశువు జననం అందరికీ ఆహ్లాదమే - అందరికీ ఆశ్చర్యమే! ఆ శిశువు ఆక్రందన ఒక ఆజ్ఞలాగా ఆశ్రమవాసులు ఆలకించి, భయంతో చుట్టూ చేరేవారు.

ఆ పసికందు ఉదయభానుడిలా ఉన్నాడంటే కూడా, అది ఆ పసికందు గురించి పూర్తిగా వర్ణించనట్టే!

శకుంతల మనసు ఆనందంతో నిండిపోయింది. తను ఇంతకుముందు ఎందరో శిశువుల్ని చూసింది. కానీ తన గర్భాన జన్మించిన ఈ పసికందు అందరికంటే గొప్పగా, ఏదో ప్రత్యేకతతో కనిపిస్తున్నాడు తన కళ్ళకు.

శకుంతల పొత్తిళ్లలో ఉన్న పసిగుడ్డును చూసింది. తను తల్లి కనుక తన కీ భావన కలుగుతోందా? - మళ్ళీమళ్ళీ అలాగే చూస్తూ, గుండెలకి హత్తుకుంది.

ఆశ్రమవాసులు పసిగుడ్డును అనుక్షణం కని పెట్టుకొని ఉండటం, కొద్దిగా గొంతు విప్పితే చాలు, భయంతో పరుగుపరుగున వచ్చి లాలించటం చూస్తుంటే శకుంతలకి ఆశ్చర్యంగా ఉంది. తన తండ్రి కణ్వ మహామునికి తనంటే అనంతమైన అనురాగముంది. ఆయన తపస్సామ్రాజ్యాధిపతి. ఆ మహర్షి ఆశీర్వచన ఫలమే ఇది. శకుంతల కళ్ళలో తిరిగిన ఆనందబాష్పాలను ఒత్తుకుంది.

పసిబిడ్డకు భరతుడు అని నామకరణం చేశాడు కణ్వముని.

దినదినప్రవర్థమానుడవుతూ భరతుడు ఆ ఆశ్రమవాసులకి కంటి వెలుగయ్యాడు. అక్కడి క్రూరజంతువులు కూడా భరతుడిపైన భక్తిని, గౌరవాన్ని చూపించటం మరీ ఆశ్చర్యకరమైంది.

శిశువైన భరతుడు బాలుడయ్యాడు. తల్లి, దాదులు ఇచ్చే రక్షణ వదిలేశాడు. సింహపు పిల్లల చెవులుపిండి ఈడ్చుకువస్తుంటే దగ్గరే ఉన్న తల్లిసింహం చూస్తూ ఊరుకుంటోంది. ఏనుగుల తొండాలు గడ్డిపోచల్లా మెలివేస్తుంటే, అవి కిక్కురుమనటంలేదు. బహుశః అది భరతుడితో స్నేహమో, లేకపోతే, భరతుడి ఆధిపత్యాన్ని గౌరవించడమో అయి ఉంటుంది. క్రూరజంతువులతో ఆటలాడుకునే బాలుణ్ణి చూసి, భయాందోళనలతో శకుంతల, ఆశ్రమవాసులు కణ్వమునికి తెలియపరిచారు. కణ్వమహర్షి ఉదాసీనత ఎవరికీ అర్థం కాలేదు.

కుమారుణ్ణి చూసి అనుక్షణం మురిసిపోయేది శకుంతల. తన జన్మ ధన్యమైంది. ఈ భరతుడు రాజ్యాధిపతి అవుతాడు. వంశకర్త అవుతాడు సువిశాల దేశ నిర్మాత అవుతాడు. దేశం,రాజ్యం,చక్రవర్తి అనే భావన రాగానే శకుంతల కళ్ళముందు దుష్యంతుడు నిల్చాడు. తన ప్రియుడు, భర్త అయిన దుష్యంతుణ్ణి మరిపించాడు ఈ బాలుడు. తన కాలాన్ని, తన ఆలోచనల్ని అన్నిటినీ ఇంత వరకు ఈ బాలుడే కొల్లగొన్నాడు. భార్యగా తన బాధ్యతలే విస్మరించిందా తను? తన భర్త ప్రేమ తనకి ముఖ్యం. అంతేకాదు, ఈ భరతుడి ప్రజ్ఞా విశేషాలు తండ్రి అయిన దుష్యంత మహారాజు తిలకించి ఆనందిస్తే తన జన్మ ధన్యంకాదా? గాంధర్వ వివాహఫలితంగా జన్మించిన ఈ భరతుణ్ణి యువరాజుగా ప్రకటిస్తే తన జన్మ తరించదా? మహారాజుకీ, ఆయన ప్రజలకీ కూడా ఆ మహద్భాగ్యం

కలిగించిన తృప్తి తనకు వద్దా? శకుంతల మనసు భావవీచికల్లో తేలిపోయింది. ఆనందంతో బాటు దుష్యంత మహారాజు సాంగత్యసుఖం స్మరణకు రాగానే మనసు పరవశించింది.

ఆలోచనాసముద్రంలో అల్లల్లాడుతున్న శకుంతలని దయానిధి అయిన కణ్వమహర్షి గమనించాడు. ఎప్పుడూ తప్పు చేయని కణ్వమహర్షికి, ఆ నిముషం ఏదో తప్పు చేస్తున్నానా అనే భావం మనసులో కదిలింది.

స్త్రీకి భర్త సాంగత్యమే ధర్మం, సహజం. తను ప్రేమతో పెంచిన శకుంతలకి ప్రస్తుతం అది దూరమైందే! ఇంతవరకు ఆ విషయంపైన తనకు ధ్యాసపోలేదు. భరతుని బాల్యచేష్టల్లో, ఆటపాటల్లో మునిగి తృప్తి చెందిన శకుంతల తనకు మరో ఆలోచన రానీయలేదు. శకుంతల, భరతుడు తన ఆశ్రమానికి సహజమైన శోభ అనే తలంపు కలిగింది ఇంతవరకు. కానీ, అది ప్రకృతి ధర్మం కాదనిపించింది కణ్వుడి మనసుకి.

ఆ విషయం అతి సున్నితంగా శకుంతలకు చెప్పి, భర్త దగ్గరకు ఆమెను పంపే ఏర్పాట్లు చేయదలచాడు కణ్వుడు.

శకుంతల మనసు పరిపరివిధాలా పోయింది ఆ విషయం వినగానే. ఎంత కాలమైంది తను దుష్యంతమహారాజును చూసి! అన్నిటికీ మించి తన భరతుడు యువరాజు కావటం తను చూడాలని కోరుకుంటున్నదే. దుష్యంత మహారాజును తను చేరబోతున్నదనే భావం శకుంతలకి కొండంత ధైర్యాన్ని చేకూర్చింది.

బాల దుష్యంతుడిలా కనిపిస్తున్న భరతుణ్ణి చూస్తూ కూర్చుంది శకుంతల.

## 6

ఏనాటినుంచో సంయమనం అలవడిన కణ్వమహర్షి మనసుకి ఆనాడెందుకో కలవరపాటు కలిగింది. శకుంతల, భరతుడు తన ఆశ్రమాన్ని వదిలి వెళ్తున్నారనే భావం నిర్వికారమైన మహర్షి అంతరంగంలో కొత్త అనుభూతిని రేకెత్తించింది. అది సుఖమో, దుఃఖమో మహర్షికే తెలియని స్థితి.

మహర్షి కళ్ళకి మాలినీ నదీతీరం సాక్షాత్కరించింది. శకుంతాల చేత సంరక్షణ పొందిన ఆ పసిబిడ్డని తెచ్చుకున్నాక, తానే ఆ పిల్లకు తల్లీ, తండ్రీ, సంరక్షకుడూ, గురువూ అయ్యాడు ఇంతవరకు. శకుంతల గాంధర్వ వివాహం చేసుకుందని తెలిసినప్పుడు, ఆమె కుమారుడు సర్వదమనుడు ముద్దుగా తన ఆశ్రమంలో ఆడుకుంటున్నప్పుడు తన మనసు ఆనందంతో నిండిపోలేదూ?

ఒక సమయంలో ఈ మమతానుబంధాలకు కట్టుబడిపోతానేమోనని భయపడ్డాడు కూడా. మహర్షి కళ్ళు చెమర్చాయి. పెంచిన ప్రేమ ఇంత బలమైందా?

దుష్యంత మహారాజును చేరే సమయం ఆసన్నమవుతున్నకొద్దీ కణ్వాశ్రమంలో తను గడిపిన జీవిత విశేషాలు దొంతరలు దొంతరలుగా శకుంతల మనసుని ఆక్రమించాయి. తను పెంచిన చెట్లు విరగబూసి కనిపిస్తున్నాయి. ఎదురుగా, తను లాలించిన పక్షులు కిలకిలా రావాలు చేస్తున్నాయి చెవుల విందుగా. ఆశ్రమంలో తను అందరి దగ్గర నుంచి పొందిన అన్నిఅప్యాయతలనూ వదులుకుని అందరికీ దూరమైపోతుందా? అప్రయత్నంగా శకుంతల కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

ఆరోజే ప్రయాణం. ఆశ్రమ ముత్తైదువలు ఆశీర్వదించి మంగళాక్షతలు చల్లారు. శకుంతల తండ్రిని సమీపించింది. గంభీర సముద్రంలా ఉన్న కణ్వునికి పాదాభివందనం చేస్తుంటే ఆగని కన్నీళ్ళు జలజలా పాదాలపైన పడ్డాయి. కణ్వుడు శకుంతలను లేవనెత్తి శిరసు నిమిరాడు.

తపోధనులైన మహర్షి శిష్యులు వెంటరాగా, శకుంతల కుమారుడి చేయి పట్టుకుని వేగంగా ముందుకు నడిచింది. దుష్యంత రాజపత్నిగా అక్కడ అడుగుపెడుతున్నాననే తలంపు ఆమెకు ఆనందోత్సాహాలను కలిగించింది.

రాజభవనం చేరిన శకుంతల గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. ఎదురుగా సింహాసనంలో రాజఠీవితో ప్రకాశిస్తున్న మహారాజు కనిపించాడు. కన్నార్పకుండా చూస్తోంది అలానే నిలబడి.

అది నిండు సభ. మంత్రి, సామంత, పురోహిత, పౌరజన పరివారంతో కిక్కిరిసి ఉంది. ఒక్కసారి సభను కలయజూసి దుష్యంతుని వైపు చూపు నిలిపింది శకుంతల.

ఆనందోత్సాహాలతో ఆస్థానంలో అడుగుపెట్టిన శకుంతల క్షణం నివ్వెర పోయింది. మహారాజు తనకు ఎదురొచ్చి ఆహ్వానిస్తాడని కొండంత ఆశతో ఉన్న ఆమెకు తీరని నిరాశ ఎదురైంది. మహారాజు తనవంకే చూడకపోవడం ఎంతో అవమానంగా తోచింది.

అలాగే నిలబడింది శకుంతల. తనను నిజంగా గుర్తించలేదా, లేక రాజకార్య నిర్వహణలో మరచిపోయాడా? పెదాలపై చిన్న నవ్వు నిల్చింది. గాంధర్వ వివాహం చేసుకున్న భర్త మరచిపోవడమా?

మహారాజు మరిచిపోతే తనే గుర్తు చేస్తుంది. నవప్రియులైన రాజులు ఇలాగే ఉంటారేమో? ఆశ్రమంలో పెరిగిన మునికన్యగా తనకు లోకానుభవం చాలా తక్కువ. శకుంతల మనసుకి ధైర్యం చెప్పుకుంది.

సింహాసనంపై నుంచి దుష్యంతుడు ఒక్కసారి ఇటు చూశాడు. ఆ చూపుల్లో తీక్షత, నిర్లక్ష్యం శకుంతలను కదిలించాయి. సభ అంతా తననే చూస్తున్నారని పించింది.

ఇక ఆలస్యం పనికి రాదనిపించింది శకుంతలకి. జరిగిన విషయాన్ని అందరి ముందూ చెప్పాల్సిందే! మార్గాంతరం లేదు.

అందరూ ఆశ్చర్యంతో, ఆందోళనతో ఆమె మాటలు వింటున్నారు. దుష్యంతుడు భ్రుకుటి ముడిచాడు. ఆశ్రమం నుంచి వచ్చి, ఒకణ్ణి వెంటబెట్టు కుని 'ఇతడు నీ కుమారుడు, నేను నీ భార్యను' అంటూంటే శ్రద్ధగా ఆలకిస్తున్న వారంతా తనను గురించి ఏమనుకుంటారు? వాళ్ళందరికీ తనేం సమాధానం చెప్తాడు? ధర్మప్రభువుగా పేరుపడిన తాను ఒక్కసారిగా ప్రజల ప్రేమాభి మానాలు పోగొట్టుకుని దిగజారిపోలేడు. దుష్యంత మహారాజు ఒక నవ్వు నవ్వాడు. శకుంతల అతనివైపు చూసింది.

"నీ వెవరో నాకు తెలియదు. అనుచితాలు పలుకక సభను వదిలిపో!"

గంభీరంగా ధ్వనించింది మహారాజు గొంతు.

ఇంతవరకు దాచుకున్న శకుంతల కన్నీరు ఆగలేదు. క్షణంలో తేరుకుంది.

ఈ ఓటమి తను అంగీకరించదు. తిరిగి కణ్వాశ్రమంలో అడుగుపెట్టదు. ధైర్యం, సాహసం శకుంతలపక్షాన చేరాయి.

"మహారాజా! ధర్మప్రభువుకి ధర్మాలు చెప్పడం నాకు తగదు. ఈ కొడుకు నీ ప్రతిబింబం. ఈ సభలోని వారందరినీ ఈ బాలుణ్ణి చూడమను మరొక్కసారి. నన్ను కేవలం అబలలా అంచనావేయకు. ఆనాటి మన గాంధర్వం మన ఇద్దరికే కాని ఎవరికీ తెలియదనుకుంటున్నావా?"

శకుంతల గొంతు హెచ్చరించింది. కళ్ళు అగ్నిజ్వాలల్లా కనిపిస్తున్నాయి.

"నేనెవరనుకుంటున్నావ్? మహర్షి విశ్వామిత్రుడికీ, దేవకాంత మేనకకీ జన్మించినదాన్ని. అసత్యాలు పలుకుతానా? ఈ పంచభూతాలూ, అంతరాత్మ-ఇవేవీ సాక్ష్యాలు కావనుకుంటున్నావా?"

శకుంతల క్షణం ఆగింది.

ఆమె నిజమే చెప్తోందనే భావం సభవారి మనసులకి తోస్తోంది. అయినా తమ ప్రభువు అసత్యం పలుకుతాడా? అదీ వాళ్ళ మనసుకి అర్థం కావడంలేదు.

అంతా తనకేసి చూస్తున్నట్టు గమనించాడు దుష్యంతుడు.

"మహారాజును నే నేమిటి, మునికన్యవు నీ వేమిటి? ఈ కుమారు డేమిటి? అధిక ప్రసంగం ఆపి, తక్షణం సభ వదిలి వెళ్ళిపో!"

దుష్యంతుడి గొంతు మారుమ్రోగింది సభంతా.

శకుంతల నిశ్చలంగా నిలబడే ఉంది. కొన్ని క్షణాలు గడిచాయి. భరతుని చేయిపట్టుకుని గబగబా ముందుకువచ్చి "ఈ కుమారుణ్ణి కౌగిలించుకో. ప్రజలకి భయపడి అసత్యమాడినా ప్రకృతి ధర్మాన్ని దాచలేవు కదా? భార్యను తన భార్య కాదని, కుమారుణ్ణి తన కుమారుడు కాదని పల్కేవా రెవరికైనా ఇహపరాలుండవు తెలుసా?"

శకుంతల ఆవేశంతో ఊగిపోతోంది. భరతుడు తల్లిపక్కన నిలబడి మహారాజును, ప్రజలను, తల్లిని మార్చి మార్చి చూస్తున్నాడు.

శకుంతల అందరివంకా చూసింది. ఎవరూ నోరు విప్పి ఒక్క మాట పలకరేమి?

మళ్ళా సభవంక చూసింది. అంతా నిశ్శబ్దం.

ధర్మానికీ, సత్యానికీ స్థానమే లేకపోతే ఇక ఈ ఆస్థానంలో ఒక్క నిముషం తను నిలబడదు. దుష్యంత మహారాజుసు ఒక్కసారి చూసి భరతుడి చేయి పట్టుకుని ముందుకు అడుగువేయబోయింది శకుంతల.

ఆకాశం దద్దరిల్లింది వింత కాంతి ఆ ప్రాంతమంతా వ్యాపించింది.

అక్కడున్న అందరూ నభోవీథికేసి తల తిప్పారు.

ఆశ్చర్యం, మహదాశ్చర్యం!!

ఆకాశవాణి పలుకులు అందరికీ వినవచ్చాయి.

''శకుంతల సత్యం పలికింది. శకుంతల సత్యమే పలికింది!''

సభంతా ఆనంద తరంగాల్లో తేలియాడింది.

దుష్యంతుడి ముఖం వికసించింది. శకుంతల వంకా, భరతుడి వంకా కన్నార్పకుండా చూశాడు. సభవంక తిరిగి చేతులు జోడించాడు.

''గాంధర్వ వివాహం ఆమెకూ నాకే తెలుసు. మీనుంచి వచ్చే అపవాదానికి వెరిచాను. పాలితుల ఆమోదం, సదభిప్రాయం నాకు ముఖ్యమైనవి.''

ఆ తర్వాత దుష్యంతుడి పలుకులు ఎవరూ వినలేదు.

కరతాళ ధ్వనులతో మారుమ్రోగింది. దుష్యంత మహారాజుకీ, శకుంతలా దేవికీ, భరతుడికీ సభలో అందరూ ఏకగ్రీవంగా జేజేలు పల్కారు. ✽

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్రమహాభారతం : ఆదిపర్వం : చతుర్థాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక; 2-12-1987 నుండి 6-1-1988 వరకు)

# మహాభిషుడు

బ్రహ్మ సభ తీర్చాడు. దేవర్షిగణంతో, దేవలోకాన్ని చేరిన మహర్షి గణంతో సభ కిక్కిరిసి ఉంది. సృష్టికర్తని సేవించటం భాగ్యంగా భావించిన వారంతా భక్తితత్పరతతో అక్కడికి చేరారు.

ఉన్నట్టుండి అక్కడి వాతావరణంలో ఏదో మార్పు గోచరించింది. వాయు వీచికలు ఆ ప్రాంతమంతా నిండిపోయాయి. వాయుదేవుడు అంతటా తానేయై బ్రహ్మను కొలుస్తున్నాడా అన్నభావం కలిగేట్టుగా ఉంది అక్కడి పరిస్థితి.

వాయుదేవుని సేవకు తోడైనట్టుగా మధురమైన ధ్వని ఎటునించో వచ్చి ఆ ప్రాంతం అంతా వ్యాపించింది. లయకు తోడై రాగం కలిసినట్టుగా వినిపించింది అక్కడందరికీ. కానీ ఏ దిక్కునుంచి వస్తోందో తెలియలేదు ఎవ్వరికీ. బ్రహ్మదేవార్చనార్థులై. అక్కడి వాళ్ళ దృష్టి బ్రహ్మ పాదాలపైనే ఉంచారు. బ్రహ్మదేవుడు మహదానందభరితుడు కాగా, సదా బ్రహ్మను సేవించే వాయు దేవుడు భక్తిపారవశ్యంతో మైమరిచాడు. సభాసదుల్ని ఆనందవరదాలన్న భావంతో విజృంభించాడు.

అప్పుడే దేవగంగ బ్రహ్మసభని సమీపిస్తోంది. వాయువీచికలు అధికంగా వీచాయి. ఆ స్థితి గమనించకుండానే వేగంగా ముందు కొచ్చింది గంగ. ఆమె దృష్టి అంతా బ్రహ్మ పాదాలపైనే ఉంచి. ఆమె ప్రతి కదలికా అప్రయత్నంగా తాళలయాన్వితమైంది. ఆమె కురులు గాలిలో అల్లల్లాడాయి. ఆ కురుల సందుల దాగిన గాలి నుంచి, సహస్రతంత్రులు సున్నితంగా సుమధురంగా మీటుతున్న ధ్వని వినవస్తోంది. ఆమె పాదమంజీరాల నవ్వడి ఆ ధ్వనితో కలిసిపోయి శ్రవణపేయమైంది. బ్రహ్మ, సభాసదులు అనిర్వచనీయమైన ఆనందతరంగాల్లో ఓలలాడారు.

బ్రహ్మను వీక్షిస్తూ దేవగంగ అడుగు ముందుకు వేసింది. భక్తి పారవశ్యంతో ఆమె ఎవరినీ గమనించటంలేదు. అంతకుమించిన భక్త్యావేశంతో వాయుదేవుడు బ్రహ్మదేవుణ్ణి సేవిస్తున్నాడు.

గంగ సమీపిస్తుంటే ఆమెను రెప్పపాటు లేకుండా వీక్షిస్తున్నది ఒక్కడే. అతనే మహాభిషుడు. ఇక్ష్వాకు వంశంలో జన్మించిన కీర్తివంతుడు. యజ్ఞ యాగాదులు చేసి పుణ్యం సంపాదించిన ధన్యజీవి. దేవతలను మెప్పించి, దేవర్షి గణంతో పాటు బ్రహ్మను సేవించడానికొచ్చాడు.

దేవగంగ బ్రహ్మసభను చేరుతుంటే ఆమె కురుల సౌందర్యాన్ని విస్తుపోయి చూసినవాడు మహాభిషుడే. వాయుదేవుని ఉద్ధృత వేగానికి గంగ పయ్యెద తొలగితే ఆ కుచద్వయ సౌందర్యాన్ని వీక్షించిందీ మహాభిషుడే.

వాయువేగానికి గంగ కటివస్త్రం సడలింది. నగ్నంగా ఊరువులు కనబడగానే అక్కడి దేవర్షి గణం అంతా పరాఙ్ముఖులయ్యారు. మహాభిషుడు ఆమెను సాభిలాషతో చూస్తున్నాడు. అతని శరీరం పులకాంకితమైంది.

ఆహా! ఎంతటి సౌందర్యవతి దేవగంగ. సౌందర్యాన్ని తను సంపూర్ణంగా చూడగలగటం తన అదృష్టం. భూలోకంలో తను ఎడతెగకుండా చేసిన యజ్ఞ యాగాదుల ఫల మిది.

దేవగంగ బ్రహ్మను సమీపించి ఆయన పాదాలకు మొక్కింది. బ్రహ్మ చూపు గంగపైన లేదు. మహాభిషుని వంక బ్రహ్మ చూపు నిలిచింది. మహాభిషుడు దేవగంగను నఖశిఖపర్యంతం చూస్తూ ఆ సౌందర్యాస్వాదనాలోలుడై మైమరిచాడు. మహాభిషుడు తనవైపే చూడటం గమనించిన దేవగంగ, సిగ్గుతో తన వస్త్రాన్ని సరిచేసుకుంది. మహాభిషుడు చిరునవ్వు నవ్వాడు. దేవగంగని మరింత మన్మథపరవశుడై తిలకించాడు.

బ్రహ్మ చూపులను తీక్ష్ణత ఆవరించింది. అది ఆగ్రహమైంది. అంతవరకు ఆయన మనసులో ఉన్న ఆహ్లాదం ఆ క్షణంలో అదృశ్యమైంది. మహాభిషుడు తన పట్ల చూపుతున్న భక్తి కంటే, ఆ దేవగంగ సౌందర్యంపైన చూపుతున్న రక్తే మరీ ఎక్కువ అనిపించింది బ్రహ్మకు.

"మహాభిషా!"

బ్రహ్మ గొంతు సభాప్రాంగణమంతా మారుమోగింది. ఉలిక్కిపడ్డాడు మహాభిషుడు.

''నేటి నీ ప్రవర్తన నా సభకు తగినది కాదు. ఎన్ని పుణ్యకర్మలు ఆచరించినా, భూలోకపు పోకడలు ఇంకా నిన్ను వీడిపోలేదు. తిరిగి నువ్వు అక్కడే జన్మించు!''

మహాభిషుడు ఇంతవరకు పొందిన ఆనందం పటాపంచలైంది. అయినా తను విచారించదలచుకోలేదు. దేవగంగ సౌందర్యాలోకనభాగ్యం తనకు కలి

గింది. తిరిగి భూలోకంలో జన్మించినా, ఉత్తమ స్థితిని పొందాలి తను. మహాభిషుడు తల ఎత్తి బ్రహ్మ వంక సానునయంగా చూశాడు.

"తమ శాపం నాకు అజ్ఞాతుల్యమే. కానీ ఒక్క మనవి. భూలోకంలో ధర్మప్రభువైన ప్రదీప మహారాజు కుమారుడుగా జన్మించే యోగ్యత అనుగ్రహించండి, చాలు."

మహాభిషుడి కోరికలో దురాశ కనపడలేదు బ్రహ్మకి. పైగా మహాభిషుడి శీలసంపదలు, ధర్మబుద్ధి బ్రహ్మకు తెలియనివి కావు. తన సభా మర్యాదను అతిక్రమించినందుకు శిక్షించినా, అతని విన్నపానికి ఆమోదం సూచించాడు బ్రహ్మ.

బ్రహ్మకు నమస్కరించి మహాభిషుడు వెనుదిరుగుతుంటే, గంగ రూప సౌందర్యవంతుడైన మహాభిషుని సానురాగంగా వీక్షించింది. బ్రహ్మదేవుడి ఆగ్రహానికి కారణం తనే. యజ్ఞ యాగాదులు చేసి మహత్తర శక్తిసమన్వితుడై బ్రహ్మలోకాన్ని చేరిన మహాభిషుడు తన సౌందర్యారాధన కారణంగా తిరిగి భూలోకంలో జన్మించటం గంగ మనసును కదిలించింది. తన సౌందర్యాన్ని వీక్షించే కాంక్షతో, తను సాధించినదంతా పోగొట్టుకుందుకు సిద్ధపడ్డాడే ఈ మహాభిషుడు- ఎంతటి త్యాగమూర్తి! రూపం, గుణం, ధర్మం, త్యాగం అన్నీ కలిసిన సంపూర్ణమైన వ్యక్తి. తనను అంతగా ఆరాధిస్తున్న వ్యక్తికోసం తనేమీ చేయలేదా?

మనసులో పరిపరి విధాల తలపోసింది గంగ. మహాభిషుడి వంటివానితో జీవించడం కంటే తనకి సార్థకత మరేముంటుంది? అంతకు మించిన అనుభూతి మరేముంది? గంగకు అతని వ్యక్తిత్వంపైన గౌరవాభిమానాలు పెరిగిపోయాయి అతని చూపుల్ని ఆమె గుండెల్లో దాచుకుంది.

"మహారాజా, నా కారణంగా మీరు భూలోకంలో పునర్జన్మ పొందితే..."

మహాభిషుడు వెనక్కి తిరిగాడు.

గంగ తన వెంట వస్తోంది. గంగ కిలకిల నవ్వింది.

"నేనూ భూలోకంలో మీ కోసం జన్మిస్తాను. మీ వంటి ప్రేమైకమూర్తి లభించటం నా భాగ్యం. మీతో సహజీవనం చేయటమే నా అభిలాష."

గంగాదేవి దేవలోకాన్ని వీడి పయనం సాగించింది.

ఆమె ప్రేమానురాగాలు పరవశుణ్ణి చేశాయి మహాభిషుణ్ణి. *

(ఆధారం : కవిత్రయం వారి శ్రీమదాంధ్ర మహాభారతం:
ఆదిపర్వం : చతుర్థాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 13-1-1988)

# శంతనుడు

గంగా నదీతీరంలో ఉన్న అడవుల్లో వేటకు వెళ్ళాడు శంతన మహారాజు. అతనికి వేటంటే వ్యామోహం. అలా సంచరిస్తూ అడవిదాటి గంగా నదీతీరానికి వచ్చాడు. నీటిపైనుంచి వచ్చే చల్లనిగాలి అతని మనసుకి ఉల్లాసాన్ని కలిగించింది. నది ఒడ్డున ఇసుక తిన్నెలపైన నిలబడ్డాడు ప్రశాంతమైన ప్రకృతిని తిలకిస్తూ.

ఆ ఏకాంతాన్ని చెడగొట్టి - తనవైపే చూస్తూ నడిచివస్తున్న స్త్రీమూర్తిని గమనించి విస్తుపోయాడు శంతనుడు. కీకారణ్యాల నానుకుని ఉన్న ఈ తీర ప్రాంతంలో ఒంటరిగా ఒక స్త్రీ విహరించడమా? ఇది కలా-నిజమా? శంతనుడు అలా అనుకుంటూండగానే ఆ స్త్రీ మరీ దగ్గరవుతోంది. సర్వాలంకార భూషిత ఆమె. ఆమె బిగువైన వక్షోజాలు, సన్నని నడుము ఆ సౌందర్యాన్ని మరీ అతిశయింప జేశాయి. కళ్ళు మిలమిలా మెరుస్తున్నాయి. నల్లని కురులు గాలిలో కదలాడుతున్నాయి. ఆమె రూపాన్ని రెప్పవేయకుండా చూస్తున్నకొద్దీ శంతన మహారాజుకి సందేహం కలిగింది.

ఈమె మానవకాంత కాదు. ఏ వనదేవతో, ఏ నాగకన్యకో అయి ఉండవచ్చు. ఈమె శరీరచ్ఛాయ, రూపరేఖా విలాసాలు ప్రత్యేకతని సంతరించుకున్నాయి. ఏ దేవకాంతో దివినుంచి భువికి విహారానికి వచ్చిందేమో!

దగ్గరగా వచ్చిన అమెకేసి మరీ ఆశ్చర్యంగా చూశాడు శంతనుడు. ఆమె శంతనుడి యౌవన రూప సౌందార్యాలపైనే దృష్టిని కేంద్రీకరించింది. ఆమె చూపుల్లో నిశ్చలత, ధైర్యం, ఆత్మవిశ్వాసం కనిపించాయి శంతనుడికి. ఆమె చూపుల్లో ఏదో తృప్తి, ఏదో పోగొట్టుకుని తిరిగి సంపాదించుకున్న ఆనందం కనిపించాయి అంతలోనే అతనికి. అతనూ అలాగే ఆమెను చూస్తున్నాడు ఆ చూపులు కలిశాయి.

''నీ వెవరు?'' అని అడుగుదామని అనుకుంటున్నాడు శంతనుడు. కానీ అమె ఒక అడుగు ముందుకువేసి - కళ్ళలో కళ్ళుపెట్టి చూస్తూ ''నన్ను భార్యగా స్వీకరిస్తే-'' మాటలు అక్కడ ఆపింది.

"నిన్ను భార్యగా స్వీకరించడంకన్నా మహాభాగ్యమింకేది?" ఆనందంతో మాటలు తడబడ్డాయి. ఈ హఠాత్సంఘటన శంతనుణ్ణి ఆవేశపరవశుణ్ణి చేసింది.

ఆమె గలగలా నవ్వింది. "ఒక్క మాట!" ... వీణ మీటినట్టే వినిపించింది అతని చెవులకి.

"నా ఇష్టాన్ని ఎప్పుడూ కాదనకూడదు...నేనేం చేసినా వారించకూడదు."

శంతనుడు ఆమెవైపే చూస్తున్నాడు. ఆ సౌందర్యారాధనలో కరిగిపోతున్నాడు.

"ఎప్పుడూ, దేనికీ కాదనను. నువ్వు నా దేవివైతే నీ ఇష్టమే నా ఇష్టం! నా ప్రణయినికోసం ఏం చేయమన్నా చేస్తాను." శంతనుని మాటలు వింటూ చిరునవ్వు నవ్వింది.

"ఎప్పుడైనా, ఎందుకైనా నన్ను వారిస్తే నిన్ను వదలివెళ్ళిపోతాను" ఆమె శంతనుడికేసి చూస్తూ అంది. ఆ రూపం ఎక్కడో - ఎప్పుడో, చూసినట్టే అనిపించింది శంతనుడికి ఆ క్షణంలో.

శంతనుడికి వెంటనే గుర్తొచ్చింది - ఒకనాడు తండ్రి ప్రదీప మహారాజన్న మాట. "ఏనాడైనా గంగాతీర ప్రాంతంలో ఒక అపురూప లావణ్యవతి ఎదురైతే ఏమీ ప్రశ్నించకుండా వివాహం చేసుకో!" ఆ మాట నిజమైందే! - శంతనుడు ఆమె ప్రవృత్తికి ఆశ్చర్యపోతూనే ఆమెతో సహజీవనం చేసే అదృష్టం కలిగినందుకు ఆనందభరితుడయ్యాడు.

శంతనుడి దాంపత్య జీవితం మధురాతిమధురంగా సాగింది. భర్త ప్రేమానురాగాలకు పాత్రురాలైంది ఆమె.

ఆనాటి నీరెండలో ఆమె చెక్కిళ్ళ నిగనిగలు, కళ్ళ తళతళలు చూస్తుంటే ఆమెను కొత్తగా చూస్తున్న అనుభూతి కలిగింది శంతనుడికి. ఆ చూపులకి ఆమె శరీరం పులకించింది

గర్భవతిగా ఆమె సౌందర్యం రోజురోజుకీ ఇనుమడిస్తోంది. ఆమె గర్భాన ఎంతటి గొప్పవాడు జన్మిస్తాడో అని ఊహిస్తూ పొద్దస్తమానం గడుపుతున్నాడు శంతనుడు.

మగశిశువుని ప్రసవించింది ఆమె. ఆ శిశువు పసిడి ముద్దలా మిస మిస లాడుతున్నాడు. ఆ శుభ సమయంకోసం ఎదురు చూస్తున్న శంతనుడి ఆనందం పట్టరానిదైంది.

పసికందును గుండెలకి హత్తుకుందామె శంతనుడు ఆ పసివాడి లేత బుగ్గలు నిమిరాడు.

పసికందును చేతుల్లోకి తీసుకుందామె. వేగంగా బయటకు నడుస్తుంటే విస్తుపోయి చూస్తున్నాడు శంతనుడు.

ఆమె అలా వెళ్ళి వెళ్ళి గంగానది తీరాన నిలిచింది. ఆమె ముఖం ఒక్క సారి వివర్ణమైంది. మరుక్షణంలో తేరుకుని - పసికందును నదిలో వదిలేసింది!

ఒట్టి చేతులతో తిరిగి వచ్చిన పచ్చి బాలెంతను చూస్తూ - నిప్పులు కురి శాయి శంతనుడి కళ్ళు. గుండె భగ భగ మండిపోయింది. అంతే! - ఆ గుండె దాటి వాటిని చేరిన మాటలు అక్కడే స్తంభించిపోయాయి.

ఈ దారుణాన్ని చూస్తూ భరించే మనస్థైర్యం ఎక్కడి నుంచి వచ్చిందో అంతుపట్టలేదు శంతనునికి. ఆనాడు ఆమెకు చేసిన వాగ్దానం అతన్ని కట్టిపడే సింది. శంతనుడు దీర్ఘంగా నిట్టూర్చి మనసులోని ఉద్వేగాన్ని ఉపశమింప జేసుకున్నాడు.

జరిగిన సంఘటనతో తనకేమీ సంబంధం లేనట్టుగా ఆమె మళ్ళీ శంతనుడి మనసుకి చేరువైంది.

ఋతువులు గడిచాయి. మళ్ళీ శంతనుని కళ్ళలో ఆశాంకురాలు తలెత్తాయి. ఆమె ప్రసవించే రోజులు దగ్గరవుతున్న కొద్దీ శంతనుని మనసులో భయాందో ళనలు ఎక్కువయ్యాయి. "ఈ మాటు పుట్టే బిడ్డను నా సంరక్షణలో దాచు కుంటాను - అనుకుంటూ ఆమెకేసి చూశాడు శంతనుడు - "ఇంత నిర్మలమైన మూర్తికి అంత కఠినమైన మనసెలా ఇచ్చాడో ఆ భగవంతుడు!" అనుకున్నాడు.

నిండు గర్భిణి శంతనుడికేసి చూచి చిరునవ్వు నవ్వింది.

మరో మగ బిడ్డను ప్రసవించిందామె. శంతనుడి ఆనందానికి హద్దుల్లేవు. పసి గుడ్డును చేతుల్లోకి తీసుకుంది మళ్ళీ. తిన్నగా నది ఒడ్డుకి నడిచింది...వట్టి చేతుల్తో అడుగు పెడుతున్న ఆమెను చూస్తూ అవాక్కయి పోయాడు శంతనుడు.

ఈ రాక్షసాన్ని చూస్తూ ఊరుకోవడమా?...మాట తప్పి ఆమెని పోగొట్టుకోవడమా?... శూన్యంలోకి చూస్తూ నిస్సహాయంగా ఉండిపోయాడు శంతనుడు.

ఆమె పిల్లల్ని కంటూనే ఉంది. అంతా వంశోద్ధారకులు, మగపిల్లలే-ఒకళ్ళా ఇద్దరా, ఏడుగురు!

శంతనుడికి సహనం నశించింది. ఇంత అధర్మాన్ని భరించే శక్తి ఇక తన మనసుకి లేదు. ఆమె ప్రవర్తన ఎంత దుంఖాన్ని కలిగిచినా ఇంతవరకూ సహించాడు. మాట నిలబెట్టుకోవడం కోసం మనసు చంపుకున్నాడు తను. శంతనుడు మనసులో నిశ్చయించుకున్నాడు.

భర్త ముఖకవళికలు గమనిస్తున్న ఆమె మనసుకీ బాధ కలిగింది - కానీ అంతా విధి నిర్ణయం!

ఓ శుభోదయాన మగ బిడ్డని ప్రసవించింది మళ్ళీ ఆమె. ఆమె ఏం చేయబోతోందో తెలుసు శంతనునికి. పసికూనని చేతుల్లోకి తీసుకోగానే శంతనుని కళ్ళు అగ్ని వర్షం కురిశాయి.

"దేవీ! - నువ్వు స్త్రీవా? తల్లివా? ఏడుగురు కొడుకుల్ని గంగపాలు చేసిన పుత్రఘాతివి - ఈ ఘోరాన్ని నేను ఇక భరించను!"

శంతనుడి గర్జన విందామె. శంతనుడి మోములో దైన్యాన్ని చూసిందామె.

శంతనుడికేసి ప్రశాంతంగా చూసింది.

"ఈ పసివాణ్ణి నదిలో పారేయను - నేనే పెంచి పెద్దచేసి నీ కిస్తాను"

శంతనుడి ముఖంలో ఆనంద రేఖలు వెల్లివిరిశాయి.

"కానీ - నా కిచ్చిన వాగ్దానం విస్మరించావు - నన్ను వారించావు ఇక ఒక క్షణం కూడా ఉండను ఇక్కడ."

శంతనుడు వివర్ణుడయ్యాడు. ఈమె తనను వదిలి వెళ్ళిపోతుందా? ఆమెను వెళ్ళవద్దని ఎంతగానో వారించాడు.

పసివాణ్ణి చేతుల్లోకి తీసుకుందామె. క్షణం ఆగింది.

"నేనెవ రనుకున్నావ్? త్రిభువన పావనియైన గంగను. వసిష్ఠ శాపం పొందిన వసువులకు జన్మనిచ్చి నువ్వు తరించావు. నా అష్టమ గర్భాన జన్మించినవాడు ప్రసిద్ధుడై కలకాలం జీవిస్తాడు. వీణ్ణి పెంచి, విద్యా బుద్ధులు గరిపి తిరిగి నీకు అప్పగిస్తా."

గంగ సానునయంగా పలికి - చరచరా నడిచి వెళ్ళిపోయింది.

తన దాంపత్య జీవితం అలా ముగుస్తుందని ఎన్నడూ ఊహించని శంతనుడు నిశ్చేష్టుడయ్యాడు.

గంగా వియోగ తప్తుడై, ఆ ఇసుక తిన్నెలలో ఒంటరిగా కూర్చుని-మిలమిలా మెరిసే ఆ గంగానదీ జలాలను అశ్రునయనాలతో చూస్తూ కాలం గడిపాడు శంతనుడు. *

(ఆధారం : కవిత్రయం వారి శ్రీ మదాంధ్ర మహాభారతం: ఆదిపర్వం : చతుర్థాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 20-1-1988)

# దేవలుడు

తపస్సు ద్వారా మోక్షం సాధించాలనుకున్న దేవలుడి మనసు యోగ విద్యవైపు కూడా మరలింది త్వరలోనే ఆ విద్య కరతలామలకమైంది. తాప సోత్తములు సాధించలేని ఎన్నో విద్యలు అతను సంపాదించగలిగాడు.

మోక్షం సాధించడానికి తపస్సే మార్గమా, గృహస్థాశ్రమం తగదా- అని ఎన్నిమార్లో అతనికి అనిపించింది. అది అతని మనసులో ఒక ప్రశ్నగా రూపొందింది. ఆ ప్రశ్న కోరికగా మలుపు తిరిగింది. అదే అతని జీవిత ధ్యేయంగా తయారయింది.

తను గృహస్థు కావాలనే భావం అతని మనసులో స్థిరపడిపోయింది.

దేవలుడు యమునా నదీతీరాన ఉన్న అడవుల్లో చాలాసార్లు సంచరించాడు. ఆ నది దాటటానికి అతను ఎన్నడూ నావ ఎక్కనేలేదు. యోగవిద్యలో ఆరితేరిన అతనికి నది దాటటం సునాయాసమైంది.

ఆనాడు నది దగ్గర కొచ్చిన దేవలుని దృష్టి అక్కడ పడవ నడిపే స్త్రీమూర్తిపైన ప్రసరించింది గృహస్థు కావాలనే ఆలోచనతో నిండిన అతని మనసు ఆమెవైపు పరుగులు తీసింది. దేవలుడు ఆనాడు నది దాటకుండానే గృహోన్ముఖుడయ్యాడు. వివాహం చేసుకుందామనే ఆలోచన వచ్చినప్పటినుంచీ తనకు తగిన కన్య ఎవరా అని ఎన్నోసార్లు అనుకున్నాడు.

దేవలుడు కళ్ళముందు ఆ పడవ నడిపే యువతి మెరుపులా భాసించింది. యౌవన భారంతో సౌందర్య రాశిలా ఉన్న ఆమెరూపం అతను ముందు కదలాడింది. ధ్యానం కుదరని దేవలుడు ఆశ్రమంవదలి యమునాతీరానికి వచ్చాడు. నావ లేదక్కడ. పడవ నడిపే ఆమె కూడా లేదు. దేవలుడికి ఆమెను ఎలాగైనా చూడాలనే తహతహ ఎక్కువైంది. అవలి ఒడ్డున ఉన్న ఆమెను ఇటురమ్మని చేయి ఊపాడు. కేక వేశాడు. ఆమె తనకోసం ఇప్పుడే ఇటువస్తుందా! ఏమో. దేవలుడు అక్కడ చాలాసేపు నిలిచాడు.

నావ వడ్డును చేరుతుంటే దేవలుడికి మహదానందమైంది. ఈమెతో సంభాషించటానికి, ఈమెను పరిశీలనగా చూడటానికి ఇదొక నెపం కానీ, ఈ

నది దాటటం తనకి సాధ్యం కాకనా? దేవలుడు చిరునవ్వుతో ఆమెను సమీపించాడు.

దాశరాజు కూతురు సత్యవతికి అప్పుడు గుర్తొచ్చింది - నీటి మీద తేలి పోతూ నది దాటే మునీశ్వరుడు ఇతనేనని. ఇతను ఏనాడూ తన నావ ఎక్క లేదు. అయినా మునీశ్వరుడు నావలో నది దాటించటమంటే తను దాటించాలిగా?

దేవలుని చూపుల్లోని భావం సత్యవతి గమనించగలిగింది. అతని నల్లని రూపమే ఆమెకు భయం కలిగిస్తోంది. అతను ఆమెను ఆపాదమస్తకం పరీక్షిస్తుంటే ఆమెకు చాలా చిరాకుగానే ఉంది. ముఖం పక్కకు తిప్పుకుని నావ నడుపుతోంది సత్యవతి.

ఆమె తనపట్ల ఎలాటి శ్రద్ధ చూపకపోవటం దేవలునికి బాధ కలిగించినా, అతని చూపు ఆమెనించి మరలటంలేదు. తన ప్రేమను ఆమెకు ఎలా తెలియ పరచాలి? తను గృహస్థాశ్రమం స్వీకరించదలచానని, ఈమెను వివాహం చేసు కుందుకు నిశ్చయించుకున్నానని ఆమెతో ఎలా మనసు విప్పి చెప్పాలి? ఆమె మనసు తెలుసుకోవటం ఎలా?

దేవలుని చూపు ఆమె సోగకళ్ళపైన, ఆమె నున్నని కంఠంపైన, ఆమె బిగువైన వక్షోజాలపైన, ఆమె సన్నని నడుముపైన నిలుస్తుంటే, వేగంగా నావ నడిపి ఒడ్డున ఆపింది సత్యవతి.

దేవలుడు ఆశ్రమం చేరాడు. మనసు దేనిపైనా లగ్నం కావటంలేదు. వేదాధ్యయనం వెనకబడింది. యోగాభ్యాసం ఆగిపోయింది. అగ్నిగృహం నిస్తేజ మైంది. ఆమెపైన ప్రేమ అతన్ని ఆశ్రమంలో నిలవనీయటంలేదు. తన ప్రేమ ఎలాగైనా ఫలించాలనే ప్రగాఢమైన వాంఛ అతనిలో బలపడింది.

తెల్లవారింది. ఉదయ సూర్యుని కిరణాలు ఆశ్రమంలో చెట్లపైన బంగారు తీగలు అల్లుకున్నట్లున్నాయి. దేవలుడు చరచరా వచ్చి యమునా నదీతీరాన ఆగాడు.

అతను నావ ఎక్కడానికి వస్తుంటే సత్యవతి ముఖం ముడుచుకుంది. ఆమె పడవ నడుపుతుంటే నది దాటటం అతనికి నిత్యకృత్యమైంది. ఆ నావలో అతను గడుపుతున్న సమయమే మధుర క్షణాలుగా తలపోస్తున్నాడు.

రోజులు గడుస్తున్నాయి. దేవలుడికి ఆమెను ఎలాగైనా వివాహం చేసుకోవాలనే కోరిక రోజు రోజుకీ పెరిగిపోయింది. ఆమె తండ్రిని కలుసుకోవాలని నిర్ణయం తీసుకుని నది ఒడ్డుకి చేరాడు దేవలుడు ఆనాడు.

అప్పుడే నావని ఒడ్డుకు చేర్చి ఇంటిముఖం పట్టిన సత్యవతి అక్కడ నిలబడ్డ దేవలుణ్ణి చూసి భయపడిపోయింది. శనిగ్రహంలా ఈ ముని తనని వెంటాడుతున్నాడనిపించింది.

భయాందోళనలతో ఇల్లు చేరిన సత్యవతిని చూశాడు దాశరాజు. ముఖాననున్న స్వేదబిందువుల్ని తుడుచుకుంటూన్న ఆమెను గమనిస్తున్న దాశరాజుకి నదీతీరాన ఏం సంభవించిందో అర్థం కాలేదు.

అంతలోనే వాకిట అసితుడైన దేవలుడి రాక గమనించాడు దాశరాజు. అంతటి మునీశ్వరుడు తన ఇంటికి రావటం మహా అదృష్టం అనుకుంటూ అర్ఘ్య పాద్యాదులు అర్పించాడు సవినయంగా.

ఆసీనుడైన అసిత దేవలుడు అన్ని దిక్కులూ పరికించాడు. "కన్యార్థినై వచ్చాను... సత్యవతిపైన నా మనసు లగ్నమయింది."

నిశ్చలంగా ఉంది దేవలుడి గొంతు.

దాశరాజుకి అర్థమైపోయింది సత్యవతి భయానికిగల కారణం. ఆమెకి ఈ అసితదేవలుడితో వివాహం ఇష్టం లేదని వెంటనే గ్రహించ గలిగాడు దాశరాజు. అయినా, రూపం, ధనం లేని ఇతన్ని వివాహమాడమని తను మాత్రం కూతురితో ఎలా అనగలడు? దేవలుడు మహాముని అనీ, మహాశక్తి సంపన్నుడనీ తనకి తెలుసు. అయినా ఆమెకు ఇష్టం లేకుండా ఎలా అంగీకరించమని చెప్తాడు?

దాశరాజు ఇంటి లోపలికి చూశాడు. గది గుమ్మంలో దాగి, భయం భయంగా దేవలుణ్ణి చూస్తున్న సత్యవతి ముఖం దాశరాజుకి కనిపించింది. ఆమె ముఖంలోని దైన్యం కూడా అతని కళ్ళకి కనిపించింది.

ఈ పరిస్థితి నుంచి తప్పించుకొనే ఉపాయం ఆలోచిస్తుంటే, మెరుపులాంటి ఆలోచన అతనికి తట్టింది.

"మునీంద్రా! ఈమె నా పెంపుడు కూతురు. ఈమె తండ్రి రాజర్షి ఉపరి చరుడు. ఆయన ఆజ్ఞ ప్రకారం ఈమెను మహారాజు కిచ్చి వివాహం చేయాలి నేను. ఆమె తండ్రి ఆజ్ఞను తిరస్కరించే అధికారం నాకు లేదు. తమరు ధర్మ వరులు." దాశరాజు మునీంద్రుని పాదాలకు మొక్కాడు.

లోపలున్న సత్యవతి హాయిగా ఊపిరి పీల్చుకుంది.

అలా తన కోరికను తిరస్కరిస్తాడని ఊహించని దేవలుడు వెంటనే వెను దిరిగాడు నిరాశతో.

ఆశ్రమంలో అడుగుపెట్టిన దేవలుడి మనసు వికలమైంది. మరో కన్యని వివాహమాడి గృహస్థాశ్రమం స్వీకరించే స్థితికి అప్పట్లో అతని మనసు అంగీక రించలేదు. సత్యవతిని తన మనఃఫలకం మీదనుంచి తుడిచివేయటానికి తపస్సే శరణ్యం అనుకుంటూ ఆదిత్య తీర్థానికి చేరాడు మహాముని అసితదేవలుడు.

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం
ఆదిపర్వం : చతుర్థాశ్వాసం)
(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 27-1-1988)

# సత్యవతి

సత్యవతి యమునా నదీ తీరానికి బయలుదేరుతుంటే దాశరాజు ఆమె వివాహ విషయం ఆలోచించసాగాడు. సంపూర్ణ యౌవనంతో తొణికిసలాడుతోంది సత్యవతి. ఆమె రూపయౌవనాలు ఎందర్నో ఆకర్షించినా, ఆమె ఎవరినీ వివాహం చేసుకుందుకు ఇష్టపడటంలేదు. ఆమెకు వివాహ శుభఘడియలు ఎప్పుడొస్తాయో, ఏమో అనుకున్నాడు దాశరాజు.

సత్యవతికి ఆ రోజు ఎంతో ఉత్సాహంగా ఉంది. రోజూ తను చేరే ఆ నావ ఈనాడెందుకో కొత్తగా కనిపించింది. యమునా నదీజలాలు, దగ్గరలో ఇసుక తిన్నెలు ఆమెకు రోజూకన్నా అందంగా కనిపించాయి. నదీజలాల గలగలలు సంగీత స్వరాల్లా ఆమె చెవులకి సోకాయి. పరాశరముని వరప్రభావం వల్ల తనున్న ప్రాంతమంతా సుగంధ పరిమళభరితమవటం అనుభవంతో ఉన్నదే. తనను ప్రేమించి వివాహం చేసుకుందుకు వచ్చేవారెవరైనా తనకు ఇష్టం కలగటంలేదు. తను ఇలాగే ఉండిపోతుందా ఇక? మెడలో ఉన్న హారాల్ని సరి చేసుకుంటూ, చెంగు చెంగున గంతులేస్తూ వచ్చి వయ్యారంగా నావని అనుకుని నిలబడింది సత్యవతి.

యమునా నదీ తీరాన వేటకని వచ్చి ఆ ప్రాంతమంతా సంచరిస్తున్న శంతన మహారాజు ఆ ప్రాంతంలోని అపూర్వమైన సుగంధాన్ని ఆఘ్రాణిస్తూ, అదే దిక్కుకి నడక సాగించాడు ఆశ్చర్యంతో. అతని ఆశ్చర్యం కొన్ని రెట్లు పెరిగిపోయింది ఎదురుగా ఉన్న స్త్రీమూర్తిని చూడగానే.

సత్యవతిని అలా చూస్తూ యమునా నదీ తీరాన నిలబడ్డాడు శంతనుడు. ఆమె విశాల నయనాలు, పురివిప్పిన నెమలి పింఛంలా వ్యాపించిన ఆమె కేశపాశం, ఆమె మనోహరాకృతి, శరీర సౌరభం అతన్ని ఒక్కసారిగా మదన పరవశుణ్ణి చేశాయి. దేవకాంతలా కనిపించిందామె. ఆ సౌందర్యం ఇంతకు ముందెన్నడూ చూడనట్టే ఉంది. ఆమె విలాసం అతన్ని అనురాగబద్ధుణ్ణి చేస్తుంటే ఆమెవైపునుంచి చూపు మరల్చుకోలేకపోయాడు శంతనుడు.

ఇంత కాలంగా ఓడ నడుపుతున్నా ఏనాడూ ఇలాటి రాజఠీవితో ఒప్పిన సౌందర్యవంతుడైన పురుషుణ్ణి చూడలేదు తను - అనిపించింది సత్యవతికి అతన్ని చూస్తుంటే. ఆజానుబాహుడైన ఆ మహారాజు రూపం ఆమెను ఎంతగానో ఆకర్షించింది. తనను ప్రేమించిన వారందరినీ తను తిరస్కరించింది కానీ, ఈ మహారాజుపైన తన మనసు లగ్నమవటం చిత్రంగా అనిపించిన సత్యవతి, అతని వంక వాలుచూపులు చూస్తూ, తల వంచి నిలిచింది.

"నువ్వెవరు, ఈ నదీతీరంలో ఒంటరిగా, ఇలా నావ నడుపుతూ?..." శంతనుడు ఆ ముగ్ధమనోహరమూర్తిని చూపులతో ఆరాధిస్తున్నాడు.

చిరునవ్వు నవ్వి వంచిన తల ఎత్తింది.

"దాశరాజ కూతుర్ని. మా తండ్రి మాట ప్రకారం ఈ నావ నడుపుతున్నా".

ఆమె గొంతులో కోయిలలు పల్కినట్లైంది మహారాజుకి. దాశరాజు గురించి ఇంతకుముందు విన్నాడు.

గంగ తనను వదిలి వెళ్ళిన తరువాత స్త్రీ వైపు ఏనాడూ మనసు మరల లేదు. మరొక స్త్రీని తను కన్నెత్తి చూడలేదు. ఈనాడు ఈమెను చూసిన దగ్గర నుంచీ తన మనసు ఆమె చుట్టూ పరిభ్రమిస్తోం దెందుకో?

ఇంతకాలానికి ఆమెపైన తన మనసు మరలటం ఆనందంగానూ ఆశ్చర్యంగానూ ఉంది శంతనునికి. ఈమెను వివాహం చేసుకుంటే తన జీవితంలో తిరిగి వసంతం ప్రవేశించదా? సత్యవతీ దేవి ప్రణయ సామ్రాజ్యపు ఊహల్లో తేలిపోయాడు శంతను డపుడే.

కన్యార్థి అయి శంతన మహారాజు స్వయంగా రావడంతో ఆనందంతో, గర్వంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు దాశరాజు. అత్యంత భక్తిశ్రద్ధలతో మహారాజుకు అతిథిపూజ లొనర్చాడు.

సత్యవతి వివాహానికి వెంటనే తను అంగీకారం తెలిపితే ఎలా?

దాశరాజు ముఖకవళికలు గమనిస్తున్నాడు శంతనుడు.

"మనసులో ఏముందో చెప్తే, మేము వింటాం." శంతనుని గొంతు విని ఉలిక్కిపడ్డాడు దాశరాజు.

"నా కోరిక తమరు మన్నిస్తే-" చేతులు కట్టుకున్నాడు.

"అంగీకరించదగిందైతే అంగీకరిస్తాం అంగీకరించ తగనిదైతే అంగీకరించం, మీ కోరిక ఏమిటో?" శంతనుడు దాశరాజు వంక చూశాడు.

"సత్యవతికి పుట్టే కొడుకే యువరాజు కావాలి."

శంతనుని గుండెకి తిన్నగా బాణంలా గుచ్చుకుంది ఈ కోరిక. ఆ కోరిక తను అంగీకరించలేడు. తన గాంగేయునికి అన్యాయం చేయలేడు. ధర్మాతిక్రమణం తను చేయడు.

"ఇంకేదైనా కోరుకో. ఇది మాత్రం సాధ్యం కాదు." దీర్ఘంగా నిట్టూర్చాడు శంతనుడు.

"ఇదే నా కోరిక, ఇంకేదీ లేదు." నిర్మొహమాటంగా, గట్టిగా అన్నాడు దాశరాజు.

దాశరాజు చేత తిరస్కృతుడైన శంతనుడు నిరాశతో రాజ్యానికి తిరిగి వచ్చాడు.

సత్యవతికి కన్నీళ్ళాగలేదు. తనను ప్రేమించిన వ్యక్తిని వివాహం చేసుకోనివ్వని తండ్రి కోరిక ఆమెను బాధించింది. ఎలాటి ఉత్సాహమూ లేకుండా నది ఒడ్డుకు వెడుతోంది. ఏనాడైనా మహారాజు కనిపించకపోతాడా అనే ఆశతో ఎదురు చూస్తూ యమునా నదీతీరంలోనే ఎక్కువ కాలం గడుపుతోంది.

శంతనుడు సత్యవతీ విరహతప్తుడై, రాజ్య కార్య నిర్వహణాసక్తిని వదిలేశాడు. మందిరం దాటి బయటకు కదలటంలేదు. కృశించిపోతున్న తండ్రిని చూస్తూ ఏం చేయాలో తోచక తికమకపడ్డాడు కొద్ది రోజులు దేవవ్రతుడు.

దేవవ్రతుణ్ణి చూడగానే శంతనుని ముఖం వెలవెలపోయింది. తన ప్రేమ గురించి, తన విరహం గురించి కొడుకుతో ఏం చెప్పుకుంటాడు తను? తప్పని సరిగా పరిస్థితిని ఎదుర్కోవలసి వచ్చింది.

"నాకు ఒకటే చింత. ఏకపుత్ర దోషం నన్ను బాధిస్తోంది. అందుకే ఇంకా కొడుకులు నాకు కావాలి. వివాహం చేసుకుందామని అనుకుంటున్నా."

తండ్రి మాటలు తడబడుతుంటే, ఆ మాటలు ఏదో నెపంతో అన్నవిగా గ్రహించాడు దేవవ్రతుడు.

తండ్రి మనసు దోచుకున్న సత్యవతి విషయం తెలుసుకున్నాడు. పరివారంతో బయలుదేరాడు దాశరాజు దగ్గరికి.

దాశరాజు పరమానందంతో దేవవ్రతుణ్ణి ఆహ్వానించి అర్ఘ్యపాద్యాదులతో పూజించాడు.

దాశరాజు కోరికను అంగీకరించిన దేవవ్రతునికి, ఇంకా దాశరాజు ముఖంలో ఏదో అసంతృప్తి కనబడింది.

"ఇంకేమైనా కోరిక ఉందా?" దాశరాజుకేసి చూశాడు.

"అయ్యా! తమరు ధర్మప్రభువులు. కానీ తమ కుమారులు..." నసిగాడు దాశరాజు.

అర్థమైంది అతని సందేహ మేమిటో. తను వివాహమే చేసుకోకపోతే? అదే తన నిర్ణయం!

దేవవ్రతుడు దాశరాజు వంక తిరిగి "నేను వివాహమే చేసుకోను. నీ మనుమడే యువరాజు. సరేనా? ఇంకేమైనా కోరిక లున్నాయా?" దాశరాజు భుజం తడుతూ అన్నాడు దేవవ్రతుడు నవ్వి.

దాశరాజు ముఖం సంతోషంతో వెలిగిపోయింది.

"ధర్మప్రభువులు!" దేవవ్రతుని పాదాలకు మొక్కాడు.

ఆ క్షణమే దేవవ్రతుడు భీష్ము డయ్యాడు.

సత్యవతీ - శంతనులు అన్యోన్యానురాగంతో ఆదర్శవంతులై జీవితాన్ని గడిపారు.

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం)
ఆదిపర్వం : చతుర్థాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 8-2-1988)

# సాళ్వుడు

రూపవతులు, గుణవతులు అయిన కన్యకాత్రయం తనకు సంతానం కావటం అదృష్టంగా భావించాడు కాశీరాజు. ఎంతమంది రాజులు, చక్రవర్తులు తన కుమార్తెలను కాంక్షించి వివాహం చేసుకుంటామన్నారో తనకు తెలుసు. తన కుమార్తెల సౌందర్యానికి శిరసువంచని పురుషుడే లేడేమో అనిపిస్తుంది కాశీరాజుకి వారిని చూస్తుంటే.

శత్రువులను జయించడంలో, పాండిత్యప్రకర్షలో, ధర్మ సంస్థాపనలో మేటి అయిన సౌంభపురవల్లభుడు సాళ్వుడు తన కుమార్తెను అంబను కోరితే కాదనలేదు తను. కాశీరాజు తన కుమార్తెలను చూసుకుని చాలా గర్వపడు తున్నాడు. అతను అప్రయత్నంగా అంబవైపు తిరిగాడు.

స్వయంవర మంటపం కిటకిటలాడుతోంది. అంబిక, అంబాలికలతోపాటు, అంబను కూడా స్వయంవరాలంకృతను చేశారు. సర్వాలంకారభూషితురాలైన అంబ సభను కలయచూసింది. ఎదురుగా ఆసీనుడైన సాళ్వరాజును చూడగానే అంబ మనసు పరవశించింది. శరీరం పులకించింది.

ఆమెను గమనిస్తున్న తండ్రి ముఖం విప్పారింది ఆనందంతో. వెతకబోయిన తీగలా ఎదురైన సాళ్వభూపతిని చూస్తూ 'తగిన జంట' అనుకున్నాడు తృప్తిగా.

అంబా సాళ్వులు ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకుని కూడా స్వయంవర సమయంకోసమే ఎదురుచూస్తున్నారింతవరకూ. తన ప్రియుడైన సాళ్వుని బాహువుల్లో ఒదిగిపోయే సమయమాసన్నమైందని తలపోస్తూ, తీయని ఊహల్లో తేలిపోతుంటే, అంబ చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి. వాలుచూపులతో సాళ్వుని వీక్షిస్తోంది అంబ.

కాశీరాజు స్వయంవర వేదికను పరిశీలనగా చూశాడు. అతనికి రెండు సమస్యలు కళ్ళముందు నిల్చాయి. అంబా సాళ్వుల ప్రేమానురాగాలను వివాహపూర్వకంగా స్వయంవరసభలో సాధికారికంగా ప్రకటించాలి. అంబిక, అంబాలిక

లకు స్వయంవరంలో తగిన వరులు లభించాలి - ఈ రెండూ నిర్విఘ్నంగా, సక్రమంగా నెరవేరితే తను ధన్యుడు.

కురువంశోద్ధరణ ధ్యేయంగా పెట్టుకుని, సమస్త త్యాగాలకూ సిద్ధపడిన జితేంద్రియుడైన భీష్మునికి కాశీరాజు కుమార్తెల స్వయంవర ప్రకటనను చారులు నివేదించారు కురువంశాధారం విచిత్రవీర్య డొక్కడే. నూత్న యౌవనంలో అడుగిడుతున్న విచిత్రవీర్యుడు అమిత పరాక్రమ సంపన్నుడే కాక, విలాస వంతుడు కూడా. వంశ గౌరవ బాధ్యత భుజస్కంధాలపైన మోస్తున్న భీష్మునికి విచిత్రవీర్యునికి వివాహం చేయడం తక్షణ కర్తవ్య మనిపించింది. దానికి స్వయం వర ప్రకటన దోహదం చేసింది.

స్వయంవర సభాప్రాంగణాన్ని ధనుర్విద్యాపారీణుడైన భీష్ముడు ఒంటరిగా ప్రవేశించాడు. అక్కడున్న రాజాధిరాజు లెవరూ మహావీరులుగా అతని కళ్ళకి కనబడలేదు అందరి వంకా ఒక్కసారి కలయచూసి, స్వయంవర వేదిక సమీ పించాడు. ముగ్గురు కన్యలనీ అధీనం చేసుకున్నాడు హఠాత్తుగా. స్వయంవరా లంకరణలో అందంగా భాసిస్తూ సాళ్వపతితో తన ప్రేమానురాగ జీవితాన్ని గూర్చి కలలు కంటున్న ముగ్ధమనోహరి అయిన అంబ ఈ హఠాత్సంఘటనతో నిశ్చేష్ట రాలైంది. స్వయంవర మంటపంలో కలకలం చెలరేగింది.

"క్షాత్రధర్మంతో యుద్ధంలో ఓడించి కన్యలను స్వాధీనం చేసుకోవడం ప్రఖ్యాతమైందే, ఎవరైనా నన్ను ఎదిరించదలిస్తే రండి."

భీష్ముడు మేఘగర్జన చేస్తూ, కన్యకాత్రయాన్ని రథమెక్కించాడు.

వివిధ దేశాధిపతుల పోరాటం భీష్ముని రథచక్రాల దరికి చేరలేకపోయింది.

అంబతో సహా కదిలిపోతున్న రథాన్ని వెంబడించాడు వీరావేశంతో సాళ్వుడు. అస్త్రశస్త్ర విద్యాపారంగతుడైన సాళ్వభూపతిని భీష్ముడు ఎదుర్కొ న్నాడు, ఘోర యుద్ధంలో ప్రత్యర్థు లిద్దరూ మహావీరులై పోరాడారు. పరశు రాముని శిష్యుడైన గాంగేయుని అస్త్రవిద్యా ప్రభావం ముందు సాళ్వుడు నిలువ లేకపోయాడు.

నూత్న యౌవనంతో, రాజఠీవితో వెలిగిపోతున్న తమ్ముడు విచిత్ర వీర్యునిముందు, సవతితల్లి సత్యవతీదేవి ముందు ఆ కన్యకాత్రయాన్ని నిలబెట్టాడు. విజయ గర్వంతో భీష్ముడు. ఆ కన్యల రూపసౌందర్యాలకు ముచ్చట పడింది సత్యవతి.

అంబకు కన్నీళ్ళు ఆగలేదు. అనుకోని ఈ సంఘటన అంబ మనసుని కలచివేసింది. తనను ప్రేమించిన సాళ్వభూపతి పొందిన అవమానం ఆమె గుండెల్ని పిండేసింది. తన ప్రేమ ఇలా నిరర్థకమవటం తను భరించలేదు.

మహావీరుడైన భీష్ముణ్ణి సజలనయనాలతో సమీపించింది. చేతులు జోడించింది.

"ఆర్యా! సకలశాస్త్రాలూ, సమస్త విద్యలూ అభ్యసించి, సకల ధర్మాలూ తెలిసి, సృష్టి స్థితి లయలు అర్థంచేసుకోగల మహాజ్ఞానివి, మహామనీషివి నీవు... నేను సాళ్వభూపతిని మనసారా ప్రేమించాను. అంబిక అంబాలికలతో పాటు స్వయంవరాలంకృత నయ్యానుగాని, మానసికంగా నా వివాహం సాళ్వపతితో ఎన్నడో జరిగింది ... నా మనసు చంపుకుని నీ సోదరుని వివాహమాడటం ధర్మమా? సాళ్వభూపతికి అంకితమైన నా మనసు మరొకరికి ఎలా అర్పించగలను? ఈ కన్నీళ్ళతో నీ పాదాలు పూజిస్తున్నాను. నా ప్రియుడైన సాళ్వరాజు లేని జీవితం నాకొద్దు... నువ్వు బలపరాక్రమాలతో క్షత్రియులందరినీ జయించావు కానీ నా మనసును జయించలేదు. మనసులేని మగువతో నీ తమ్ముని కాపురం చేయమనటం నీకు న్యాయమా?"

అంబ నీళ్ళు నిండిన కళ్ళు భీష్ముని మనసు కరిగించాయి. ఇక్కడ పొరబాటు జరిగిందని గుర్తించాడు. అధర్మాన్ని తను అంగీకరించడు. ధర్మాన్ని విస్మరించడు. భీష్ముడు అంబకేసి సాదరంగా చూశాడు. అంబ కళ్ళలో ఆనంద బాష్పాలు నిండాయి.

పురోహితులతో సంప్రదించి, ముత్తైదువల వెంట సాళ్వుని దగ్గరకు అంబను సాగనంపాడు గాంగేయుడు.

భీష్ముని ధర్మపరతని ప్రశంసించుకుంటూ, పరమానందంతో సాళ్వభూపతిని చేరింది అంబ. కానీ, సాళ్వభూపతి ముఖం పక్కకు తిప్పుకున్నాడు. ఆ నిరాశని తట్టుకోలేని అంబ, సాళ్వభూపతి పాదాలపైన పడింది.

"నీకోసం ఆ భీష్ముణ్ణి బతిమాలి, సమాధానపరిచి వచ్చాను. నీ సన్నిధిలో నా జన్మ ధన్యం కావాలి. నీ ప్రేమతో నా జీవితం పునీతం కావాలి."

అంబ కన్నీళ్ళు సాళ్వభూపతి పాదాలు తడుపుతున్నాయి. అయినా భీష్ముని వద్ద ఎదురైన అవమానం అతన్ని దహించేస్తోంది. అతని మనసు అవమానాన్ని భరించే స్థితిలో లేదు. స్వయంవర సంఘటన అతని అణువణువునూ ఉద్వేగానలంతో నింపుతోంది.

"నువ్వు విజితవు. క్షాత్రధర్మం ప్రకారం నువ్వు పరాధీనవే. ఆ భీష్ముని దయాభిక్షలు నాకక్కరలేదు. తిరిగి వెళ్ళిపో!"

అతని కళ్ళు నిప్పుకణాల్లా ప్రకాశిస్తున్నాయి, అతని గొంతు ఆవేశంతో మారుమోగింది. అతని మనసు పాషాణమైంది.

అంబ నిశ్చేష్టితురాలైంది. ఈ సాళ్వుని ప్రేమ తను ఎన్నటికీ జన్మలో ఇక పొందలేదనే భావం ఆమెను నిలువెల్లా కంపింపచేసింది.

భవిష్యత్తు ఆమెకు అగమ్యగోచరంగా ఉంది. శత్రుత్వం తనను వీడదు ఇక. శాత్రం తనను వీడదిక, పగ తనను వీడదిక. తన ధ్యేయం ఎలాగైనా తన ప్రియుడైన సాళ్వుని మనసు తనవైపు మరలేటట్లు చూడటం. అలా కాకపోతే, తన ప్రియుడైన సాళ్వుని సాంగత్యం నుంచి తనను దూరం చేసిన ఆ భీష్ముని సర్వనాశనం-అంతే! అంబ మనసును స్థిమితపరచుకుని, తన నిర్ణయాన్ని నిశ్చలంగా తల్చుకుంటుంటే, భీష్ముని గురువైన పరశురాముడు ఆమె కళ్ళ ముందు నిల్చాడు.

తన మాతామహుడు, పరుశురాముడు స్నేహితులు. తనకి సహాయమూ చేస్తాడు. భీష్ముణ్ణి జయిస్తాడు ఆ మహావీరుడు. అంబ కళ్ళలో ఆశాదీపాలు వెలిగాయి.

పరశురాముని ఆశ్రయించింది అంబ.

"తప్పక సహాయం చేస్తాను నీకు. ఒక్కమాట చెప్పు, నేను సాళ్వునిపైన పగ సాధించాలా?"

పరశురాముని గొంతు ఆప్యాయంగా వినిపించింది అంబకు.

సాళ్వుడు తనను తిరస్కరించినా తన ప్రియుడే. అతనికి ఎలాటి అపకారమూ జరగటానికి వీల్లేదు. ఇన్ని అనర్థాలకీ మూలమైన భీష్ముడే ఇప్పుడు తనకి శత్రువు అంబ తలవంచి ఆలోచిస్తోంది.

పరశురాముడు అంబకేసి చూస్తూ "సాళ్వుని పైన పగ సాధించాలా, భీష్ముడిపైన పగ సాధించాలా!" అని రెట్టించాడు.

"భీష్మునిపైననే, భీష్మునిపైననే పగ సాధించాలి. ఎన్ని జన్మలెత్తినా భీష్మునిపైననే నా పగ!"

అంబ గొంతు ప్రతిధ్వనిస్తుంటే, పరశురాముడు సానునయంగా నవ్వాడు.

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం : ఆదిపర్వం : చతుర్థాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 10-2-1988)

# సంవరణుడు

మహారాజు లందరికీ ఉండే వనవిహార లాలసత్వం సంవరణ మహా రాజుకీ ఉంది. మృగయా వినోదార్థం సమీపారణ్యంలో సంచరించటం సంవరణునికి పరిపాటే. కాకులు దూరని కారడవుల్లో క్రూరజంతువుల్ని వేటాడటమే కాక, ఆ ప్రకృతి శోభను తిలకిస్తూ పరవశిస్తుంటాడు. అనంతమైన తేజస్వీ సూర్యభగవానుడుకూడా చొరలేని కీకారణ్యంలో అతను విజృంభించి వేటాడగలడు.

ఓనాడు సంవరణుడు అరణ్యంలో తిరుగాడుతుంటే కళ్ళ ముందు ఒక మెరుపు మెరిసినట్లైంది. ఆ కాంతికి అక్కడి పచ్చని ఆకులు బంగారు రంగు దాల్చాయి. ఆ సమయంలో సంవరణుడి దృష్టి మిరుమిట్లు గొలిపే అపురూప సౌందర్యవతిపై నిల్చింది.

ఆ మూర్తిని రెప్పపాటు లేకుండా, గమనించాడు సంవరణుడు. ఆమె అరణ్య ప్రాంతంలో విహరిస్తుంటే, ఆమె వెనువెంట నడిచాడు. అది కలో నిజమో అతనికి తెలియరాలేదు.

వనలక్ష్మి ఒంటరిగా విహారాని కొచ్చిందా అనుకున్నాడు కొంతసేపు. సూర్యప్రభ ఇలా భూమిమీద అవతరించిం దనిపించింది మరో నిముషం ఏ గంధర్వ కన్యో ప్రకృతి రామణీయకాన్ని తిలకించటాని కొచ్చిందేమో అనుకున్నాడు మరోసారి.

ఆమె శరీరపు బంగారు ఛాయ, మెరుపులాంటి కళ్ళకాంతి, ముగ్ధమనోహ రాకృతి ఏ మానవ కన్యకూ ఉండటం అసాధ్యమనిపించి, ఆమె వెంట నడిచాడు సంవరణుడు. ఈరోజు తన పుణ్యవశాన ఈమెను చూడగలిగాడు. ఈ సుకుమారి ఈ కంటకాల మధ్య నడుస్తుంటే, ఆ ఎర్రని పాదాలు కందిపోవా? సంవరణుడు ఆపాదమస్తకం ఆమెను చూశాడు.

"ఎవరు నువ్వు? ఇలా పర్వతారణ్య ప్రాంతంలో ఒంటరిగా తిరుగుతున్నావు. ఇక్కడి క్రూర మృగాలు..."

సంవరణుని గొంతు విని వెనక్కి తిరిగింది ఆమె. అతని రూపరేఖలు ఆమెకి విస్తుగొల్పాయి. ఆజానుబాహుడతను. వీరత్వం అతని ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. ఆమె అతని వంక పరిశీలనగా చూసింది.

ఈ వ్యక్తి తనని ఇంతగా ఆకర్షిస్తున్నాడేమిటో? భూలోక విహారాని కొచ్చిన తను ఇతనిపట్ల ఆకర్షితురాలవటం ఆశ్చర్యమే కలిగిస్తోంది తనకికూడా. తనని ఆరాధించేవారు ఎందరో ఉన్నారు. అంతేకాదు, తన తండ్రి తేజస్సునూ, శక్తినీ చూసీ భయపడి, తనను చేరడానికి వెనుకాడే వారెందరో తెలుసు తనకి. ఆమె అలా అనుకుంటూ సంవరణుని వంక చూసింది.

ఆమె వైపు నుంచి చూపు మరల్చుకోలేక పోయాడు అతను. అతన్ని చూస్తూ ఒక్క చిరునవ్వు నవ్వింది. సంవరణుని ముఖం విప్పారింది.

అంతే, ఆమె అదృశ్యమైయింది.

సంవరణునికి ఏం చేయాలో తోచలేదు. అడవి అంతా గాలించాడు. ఆమెను ఎలా చూడగలడిక? ఆమె తండ్రి ఎవరో, ఆమె ఎక్కడుంటుందో కూడా తెలుసుకోలేకపోయాడు తను. ఆమెను చూడక తను బతకలే డనిపించి సంవర ణుడు విలపిస్తూ, మూర్ఛితుడయ్యాడు. అలా అరణ్యంలో అచేతనుడై పడి వున్నాడు సంవరణుడు.

తనకై విలపిస్తున్న సంవరణుణ్ణి గగనతలం నుంచి తిలకించింది ఆమె. కేవలం దర్శన మాత్రంచేత తన కోసం పరితపిస్తున్న ఆ వ్యక్తి ఆమె మనసుకి మహాత్ముడులా కనిపించాడు. అతని స్థితి ఆమె మనసుని కలచి వేసింది. అతని పైన జాలి, ప్రేమ, గౌరవం ఒక్కసారిగా పెనవేసుకున్నాయి.

సంవరణుని ఎదుట నిల్చిందామె. ఆ అడుగుల సవ్వడికి చేతనుడై కళ్ళు తెరిచాడు సంవరణుడు. తన దేవత తన కళ్ళముందే కనబడగానే మనసు ఆనందంతో నిండిపోయింది. కళ్ళలో ఆనంద బాష్పాలు నిలిచాయి. అతని నవ యౌవన రూపం ఆమె మనసుని లోగొంటోంది. 'తనని ఇంతగా కోరే వ్యక్తిని తనూ కోరుకోవాలి.' ఆమె తన్మయత్వంతో అతని వంక చూసింది.

"ఎందుకు ఈ ఆవేదన?" సాదరంగా అంది. ఆ మధురమైన వాక్కు పన్నీటి జల్లయింది సంవరణునికి.

''నేను మహారాజును, సంవరణుడిని. ఎందరో స్త్రీలను చూశాను. కానీ ఏనాడూ నా మనసు స్పందించలేదు. కానీ, ఏ శక్తి ప్రేరేపించిందో, నిన్ను చూసిన క్షణం నుంచి నీ రూపం, నీ సౌందర్యం నన్ను ఉన్మత్తుణ్ణి చేశాయి. నీవు అదృశ్యమైన క్షణం లోకమే శూన్యంగా కనిపించింది నాకు. నిన్ను చూడక ఒక్కక్షణం జీవించలేను. నీ రాగ జలధిలో నన్ను ముంచివేయి."

సంవరణుని మాటలు ఆలకిస్తూ, ప్రేమ దృక్కులతో వీక్షిస్తోంది ఆమె.

''మనం గాంధర్వ వివాహం చేసుకుందాం. మనకి ఈ ప్రకృతి సాక్షిగా నిలుస్తుంది." సంవరణుడు ఆమెను ఆరాధిస్తున్నట్లుగా చూస్తూ మాటలు అనే వాడు. ఆమె మౌనం వహించింది.

వారి ప్రేమసంభాషణ విందామనే ఆసక్తితో ఉందా అన్నట్లుగా ఆ అరణ్యమంతా నిశ్శబ్దం ఆవరించింది. ఆమె వంచిన తలఎత్తి, సంవరణుని కళ్ళలోకి చూస్తూ, ''నేను సూర్యభగవానుని పుత్రికను. తపతిని. నిన్ను వివాహం చేసుకోవటం కన్నా మించిన భాగ్యంలేదు నాకు. కానీ..."

సంవరణుడు భయంగా ఆమెకేసి చూశాడు. "కానీ, నేను స్వతంత్రురాలిని కాను. నా తండ్రి క్రమశిక్షణలో పెరిగినదానిని. నీ తపస్సుతో నా తండ్రిని ప్రసన్నుణ్ణి చేసుకో'' తపతి సానునయంగా పలికి సూర్య మండలాని కెగసి పోయింది.

సంవరణుడు నిస్సహాయుడయ్యాడు సూర్యుణ్ణి ఎలా ప్రసన్నుని చేసు కోగలడు తను? ఆ సూర్యమండలానికెలా చేరగలడు? తపతీ వియోగం అతని మనసుని కలచి వేస్తోంటే, దృఢ నిశ్చయంతో కఠోర తపస్సుకు పూనుకున్నాడు సంవరణుడు. అరణ్య మధ్యంలో ఉండే, సూర్య భగవానుని కోసం తపసు ప్రారంభించాడు.

సంవరణుని తపస్సు నిరాటంకంగా కొనసాగుతోంది. తపో నిష్ఠతో, ఉపవాస దీక్షతో అతని శరీరం కృశించింది. కాలం గడుస్తోంది. ప్రియతమ శిష్యుణ్ణి చూడటానికి వచ్చిన వసిష్ఠ మహర్షి మనసుకి ఎంతో ఆవేదన కల్గింది. యోగ దృష్టితో పరిస్థితి గ్రహించాడు. తపతీ అనురాగ తప్తుడైన శిష్యుణ్ణి తను కాపాడుకోవాలి. ధర్మవిదుడూ, సద్గుణ సంపన్నుడూ అయిన తన అభి మాన శిష్యుడు సంవరణుడు కృశించి పోతుంటే తను సహించ లేడు. తపతీ

సంవరణుల వివాహ బాధ్యత తనే వహించాలి అనుకుని దృఢ నిశ్చయుడయ్యాడు.

మహా తపోధనుడు వశిష్ఠుడు. తపోబలంతో సూర్య మండలాన్ని చేరాడు. సంభ్రమంతో అతిథి పూజలు జరిపి వినమ్రుడై నిల్చాడు సూర్య భగవానుడు.

''తమరి రాక?'' సవినయంగా చేతులు జోడించాడు.

''ధర్మార్థ విదుడు, సద్గుణ శోభితుడు, అభిజాత్య సంపన్నుడు, నా శిష్యుడైన సంవరణుడు నీ కుమార్తె తపతికి తగిన వరుడు. నీకు కన్యాదాన ఫలం దక్కాలంటే తపతీ సంవరణ వివాహం జరిపించు."

వశిష్ఠుని వాక్కు వేదవాక్కులా వినబడింది సూర్య భగవానునికి. అది ఆజ్ఞలా శిరసావహించాడు వెంటనే.

వశిష్ఠుని ముఖంలో ఆనంద రేఖలు వెల్లివిరిశాయి. తపతీసంవరణుల వివాహం వైభవోపేతంగా జరిగింది.

ధర్మ బద్ధుడై, సామ్రాజ్య పాలకుడై, తపతీ ప్రేమ సామ్రాజ్యాధిపతి అయి జీవితం సాగించాడు సంవరణుడు.

(ఆధారంక : కవిత్రయంవారి శ్రీమదాంధ్రమహాభారతం :
ఆది పర్వం : సప్తమాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 17-2-1988)

# లోపాముద్ర

బ్రహ్మచర్య దీక్షాపరతంత్రుడై. తపోనిష్ఠాగరిష్ఠుడైన మహర్షి అగస్త్యుడు-ఒకనాడు అరణ్య ప్రాంతంలో తిరుగాడుతున్నాడు. కొంత దూరం రాగానే అడుగు ముందుకు పడక ఆగిపోయాడు. ఆ దృశ్యం అతని మనసుని కలచి వేసింది ఎదురుగా ఉన్న వృక్షానికి తలకిందులుగా వేలాడు తున్నారు తపోధనులు లోక శ్రేయస్సు కోసం. ఈ మహర్షులు చేస్తున్న తపస్సేమిటో అర్థం కాలేదు ఎంత ఆలోచించినా. సంభ్రమంతో వారిని సమీపించాడు అగస్త్యుడు.

"దేనికోసం తమ రీ ఘోర తపసు తలపెట్టేరో?" వినయంగా ప్రశ్నించాడు.

వారు సమాధానం చెప్పలేదు. వారి ముఖంలో దైన్యం కనిపించింది అగస్త్యునికి. మరొక్కసారి వారికేసి చూస్తూ ప్రశ్నించాడు.

"అయ్యా, మా వంశస్థుడైన అగస్త్యుడు బ్రహ్మచర్య దీక్షాపరుడై ఉన్నాడు. అతను వివాహం చేసుకుని, సంతానవంతుడైతే కదా మాకు ఊర్ధ్వ గతులు దక్కేవి! అంతవరకు మా స్థితి ఇంతే!" అన్నారు నిరాశతో.

అతని ముఖం వివర్ణమైంది. వారికి సద్గతులు కల్గించలేని తన తపోదీక్ష, బ్రహ్మచర్యం కొరగానివే. అగస్త్యుడు వివాహం చేసుకుందుకు ఆ క్షణమే నిశ్చయించుకున్నాడు.

కన్యాన్వేషణకి బయలుదేరిన అగస్త్యునికి ఆశాభంగమైంది. పితృదేవతల దీనస్థితి చూసి మనసు కరిగిందే కానీ, వివాహానికి తనకు తగిన కన్య లభించటం సాధ్యం కాదని తెలిసి అగస్త్యుడు పరితాపం చెందాడు.

తను చేసిన వాగ్దానం ఎలా నిలుపుకోవాలా అని చింతిస్తున్న అగస్త్యుని మనోమందిరంలో మెరుపులాటి భావన మెరిసింది.

తపశ్శక్తిని ఉపయోగించి ఒక కన్యకు జన్మనిస్తే? కానీ ఆ కన్య ఎక్కడ జన్మించాలి? ఎవరికి జన్మించాలి? తన తపశ్శక్తి ప్రభావంతో జన్మించే కన్యకి జననీ జనకులు కాదగిన దంపతు లెవరు? అల్లకల్లోలమైన తన మనసుని అదుపులో పెట్టాడు అతి కష్టంతో.

ధ్యానముద్రాంకితు డయ్యాడు అగస్త్యుడు. ధర్మపరుడు, నీతివిదుడు అయిన విదర్భరాజు అతనికి స్ఫురించాడు

అగస్త్యుడు మహదానందంతో విదర్భ రాజాస్థానం చేరాడు. ఎదురెళ్ళి ఆహ్వానించి అతిథి సత్కారాలు చేశాడు విదర్భరాజు.

"నా తపశ్శక్తి ప్రభావంతో నీకు పుత్రిక జన్మిస్తుంది." అగస్త్యుని ఆశీస్సు విదర్భరాజుకి గొప్ప ఆశని కలిగించింది. సంతానార్థియై పరితపిస్తున్న విదర్భరాజుకి అగస్త్యుని రాక గొప్ప శుభసూచకంగా భాసించింది.

లోపాముద్ర దినదిన ప్రవర్ధమానురాలైంది. సౌందర్యం రాశి పోసినట్లు, సౌకుమార్యం అంగాంగాలలో ప్రోది పోసినట్లు యౌవనశోభతో ముగ్ధమనోహరంగా రూపుదిద్దుకుంది. ఆమె విలాస సంపదకి ఆకర్షితులు కానివారు లేరు. కానీ, ఆమె జన్మవృత్తాంతం విన్న ఎందరో అగస్త్య భయంతో ఆమెను వరించడానికి వెనుకాడారు. విదర్భరాజుకి లోపాముద్రకి తగిన వరుణ్ణి ఎలా తేగలననే చింత ఎక్కువైంది.

వసంతాగమనంతో ఉద్యానవనమంతా విరబూసింది. పుష్పాపచయానికి స్నేహితురాళ్ళతో పుష్పవనాన్ని చేరింది లోపాముద్ర. ఎక్కువసేపు అక్కడే గడిపి ఇల్లు చేరిన లోపాముద్ర, తండ్రితో సంభాషిస్తున్న మునీశ్వరుని చూసి అడుగు ముందుకు పడక అక్కడే నిలబడిపోయింది.

ఆ మహర్షి చూపుల్లో ఏదో ప్రత్యేకత కనిపించిందామెకి. అతని కొనదేరిన నాసికలో గొప్ప పట్టుదల, కార్యదీక్ష కనిపించాయి. అతని విశాల ఫాలభాగం చెప్పరాని విజ్ఞతకి నిలయమన్నట్టనిపించింది. రెప్పపాటు లేకుండా మహర్షిని తిలకిస్తూంది లోపాముద్ర.

అగస్త్యుడు ఆమె వంక పరిశీలనగా చూశాడు. ఆమె వేగంగా లోపలికెళ్ళిపోయింది.

విదర్భరాజుకి లోపాముద్ర, అగస్త్యులు ఒకరి నొకరు పరిచయస్థుల్లా చూసుకోవటం ఆశ్చర్యాన్ని కలిగించింది.

అగస్త్య మహర్షి విదర్భరాజు వంక చూస్తూ, "లోపాముద్రను నా కిచ్చి వివాహం చేయి" అన్నాడు.

విదర్భరాజు విస్తుపోయాడు.

మహర్షి చిరునవ్వు నవ్వి, "రాజా! ఆనాడు సంతానార్థం వేదన చెందుతున్న నీకు నా తపఃప్రభావమే నీ ఇంటి కుమార్తెగా జన్మిస్తుందని చెప్పలేదా? లోకంలో ఏ కన్యా నాకు ధర్మపత్ని కాదగినది లేకనే ఆనాడు ఆ పని చేశాను. ఈమెను నా కిచ్చి వివాహం చేయి" అన్నాడు ప్రశాంతంగా.

విదర్భరాజుకి ఈ మాట అశనిపాతమైంది. ఆనాడు తనని ఆశీర్వదించాడనుకున్న మహర్షి, ఈనాడు తన్నిలా పరీక్షిస్తున్నాడేమిటి? అల్లారుముద్దుగా

పెరిగిన పిల్ల రాజపత్ని అయి అష్టైశ్వర్యాలతో తులతూగుతుందని ఆశించాడు కానీ, నార వస్త్రాలు ధరించి, కందమూలాలు తింటూ అరణ్యంలో సంచరించే మునీశ్వరునకు తన కుమార్తె నిచ్చి వివాహం చేయటమా?

రాకుమార్తె లోపాముద్ర ఎక్కడ, మహా తపస్వి అగస్త్యు డెక్కడ? ఇలా పొత్తు కుదరట మెలా? విదర్భరాజు మనసు తీవ్ర సంఘర్షణతో కొట్టుమిట్టా డింది. ఇంత గారాబంగా పెరిగిన పిల్లని ఇప్పుడు మునీశ్వరుని కిచ్చి, ఆమె జీవితం అడవిపాలు చేయటానికి మనసు అంగీకరించలేదు. ఈ విపత్కర స్థితిని ఎదుర్కోట మెలాగని రాజదంపతులు విచారమగ్నులయ్యారు.

అగస్త్యుని చూచినప్పటి నుంచీ లోపాముద్రకు చిత్రమైన అనుభూతి కలిగింది. ఈ మహర్షిని గూర్చి తన స్నేహితురాళ్ళు ఎన్నిసార్లో ముచ్చటించగా వింది. ఈ మహర్షి తపఃప్రభావమే తన శరీరంగా రూపొంది, ప్రాణం నింపు కుందని పసిబిడ్డగా ఉన్నప్పట్నుంచీ ఇంట్లో తల్లిదండ్రు లనగా వింది తను. తనకు తెలియకుండానే బాల్యం నుంచీ అగస్త్యునిపైనే మనసు లగ్నం చేసు కుంది. అందుకే మహర్షిని చూడగానే తన మనసు పరవశించింది - 'ఆ మునినే వివాహం చేసుకుని, ఆతని ధర్మపత్నిగా జన్మ ధన్యం చేసుకుంటాను.' లోపా ముద్ర మనసు అగస్త్యుని ప్రేమైకమూర్తిగా గుర్తించింది.

తల్లిదండ్రుల ఆవేదన తగ్గించి, వారికి ఊరట కలిగించాలని నిశ్చ యించుకుంది లోపాముద్ర.

"మహర్షిని వివాహమాడటం నాకు త్రికరణశుద్ధిగా సమ్మతమే!" లోపా ముద్ర చేతులు జోడించింది.

కుమార్తె నిర్ణయానికి తల్లితండ్రులు అవాక్కయి పోయారు. మహర్షి అగస్త్యుని కళ్ళలో ఆనందం తొణికిసలాడింది.

మహర్షికి, తమ కుమార్తెకి అభిమతమైన నిర్ణయాన్ని, కాదనగల శక్తి వారి కికలేదు.

అమిత భక్తి శ్రద్ధలతో మహర్షికి నమస్కరించారు. దివ్యాంబరాభరణాలు వదలి నార చీర ధరించింది లోపాముద్ర. అగస్త్య మహర్షి వెంట అతని ధర్మ పత్ని అయి గంగాతీర ప్రాంతానికి తరలి వెళుతుంటే, చెమర్చిన కళ్ళొత్తు కున్నారు రాజదంపతులు.

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం:
అరణ్యపర్వం : ద్వితీయాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవార పత్రిక : 24-2-1988)

# సావిత్రి

మద్రేశ్వరు డయిన అశ్వపతికీ, మాళపికి సావిత్రీదేవివరప్రసాదినిగా జన్మించింది ఒక ఆడపిల్ల. రాజదంపతులు ఆ పిల్లను అతిగారాబంగా పెంచారు. ఆడింది ఆట, పాడింది పాటగా పెరిగింది. ఆ పిల్ల- సావిత్రి.

యౌవన ప్రాంగణంలో అడుగుపెట్టిన సావిత్రికి సాళ్వ రాజకుమారుడైన సత్యవంతుని గుణగణాలు వీనులవిందు చేశాయి. ఆమె స్నేహితురాళ్ళు అనుక్షణం ఆ సత్యవంతుని రూపరేఖావిలాసాలు వర్ణిస్తుంటే, అతని ఊహాచిత్రం సావిత్రి మనసులో గాఢంగా చిత్రించుకుంది. అందరి నోట వింటున్న సత్యవంతుని గుణసంపద, ధర్మనిరతి ఆమె మనసు నాకట్టుకున్నాయి. అతని తండ్రి విధి వశాన అంధుడై, రాజ్యం పోగొట్టుకుని అరణ్యంలో జీవిస్తున్నాడని స్నేహితుల వల్ల విన్న సావిత్రి మనసు ఎంతో బాధ చెందింది. అయినా సత్యవంతునిపైనే ప్రేమానురాగాలు పెంచుకుంటూనే ఉంది.

ఆనాడు అశ్వపతి భవనానికి నారదముని ఏతెంచాడు. అతిథి పూజలు చేసి, కుశల సంభాషణలు జరుపుతుంటే, పూదోట నుంచి అప్పుడే వచ్చిన సావిత్రి తండ్రిదగ్గరకొచ్చి నిల్చింది. పుత్తడిబొమ్మలా ఉన్న ఆ పిల్లను చూస్తూ నారదుడు "ఈ అమ్మాయిని తగిన వరునికిచ్చి వివాహం చేయక ఎందు కింకా ఆలస్యం చేస్తున్నావ్?" అని ప్రశ్నించాడు.

"మహాముని, ఈ పిల్ల దేవతా వరప్రసాదిని. ఆమెకి తగిన వరుని నేను వెతికి తేగలనా? అందుకే అమ్మాయితో మనసుకి నచ్చిన రాజకుమారుని వరించ మని చెప్పాను'' అన్నాడు.

సావిత్రి సిగ్గుతో తల వంచుకుంది. ఆమె చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి. కానీ, తను సిగ్గుపడి మనసులో విషయం చెప్పకుండా దాచుకుంటే ఎలా అనుకుంది. ఇంతవరకూ పైకి చెప్పకుండానే ఊరుకుంది తాను. సావిత్రి కొంచెం ధైర్యం తెచ్చుకుంది.

"తండ్రీ! సాళ్వపతి కుమారుడైన సత్యవంతుని నేను వరించాను. అతని రూపగుణాలు విన్న నేను నా మనసు అతనికే అర్పించాను."

అశ్వపతి కనుబొమ్మలు ముడి పడ్డాయి. రాజ్యం పోగొట్టుకుని, అంధుడై అరణ్యంలో ఉంటున్న సాళ్వపతి కుమారుడు సత్యవంతుడు. అతన్నా తన కూతురు వరించింది? పైగా, అతన్ని చూడకుండానే అతన్ని గురించి విని వరిస్తోందా? భోగభాగ్యాలతో తులతూగుతున్న సావిత్రి భర్తతో అరణ్యంలో జీవిస్తూ కష్టాలు పడుతుందా? అశ్వపతి మనసు సావిత్రి నిర్ణయానికి చాలా నొచ్చుకుంది.

ఎదురుగా నారద మహాముని ఉన్నాడు.

"మునీంద్రా, తమ రెరుగని వా రుండరు. ఆ సత్యవంతుడు ఎలాంటి వాడో నాకు తెలియపరచండి. తండ్రిగా వివరాలు తెలుసుకోకుండా పిల్ల నిచ్చి వివాహం ఎలా చేస్తాను?" అన్నాడు అశ్వపతి. ఆందోళన అతని ముఖాన్ని ఆవరించింది.

"అతని పేరు చిత్రాశ్వుడు. ఎప్పుడూ సత్యమే పల్కుతాడు కనక సత్యవంతు డన్నారంతే. తేజస్సులో సూర్యుని లాటివాడు. బుద్ధిలో బృహస్పతి లాటివాడు. అంతేకాదు. దానం, త్యాగం, తపం, ధ్యానం, పాండిత్యం మొదలైన వన్నీ ఒకేచోట రాశిపోసి నట్లుంటాడు సత్యవంతుడు."

నారదుడు ఈ మాట అంటూ సావిత్రి వంక, అశ్వపతి వంక చూశాడు.

అశ్వపతి ముఖం విప్పారింది. మనసులో ఆవేదన చెదిరిపోయింది.

"ఇంకా ఏమైనా విషయాలు మీకు తెలిసినవి చెప్పండి మహర్షీ!" అన్నాడు ఉత్సాహంగా.

"ఒక్కమాట, శ్రద్ధగా ఆలకించు." నారదుడు గొంతు తగ్గించాడు - "నేటినుంచి ఒక్క సంవత్సర కాలంలో అతని ఆయుస్సు పరిసమాప్త మవుతుంది. నువ్వు నా ఆత్మీయుడవు కనుక చెప్పకుండా దాచకూడదు కనక చెప్తున్నా."

అశ్వపతి నిశ్చేష్టు డయ్యాడు. నోట మాట పెగలలేదు. ఎదురుగా సావిత్రి కనిపిస్తోంది. మనసు కూడదీసుకున్నాడు.

"తల్లీ, మహామునికి దేవరహస్యాలు తెలుస్తాయి. మృత్యు ముఖంలోకి త్వరలో వెళ్ళిపోతాడని తెలిసి తెలిసి ఈ పరిణయం ఎలా చేయగలను? నీ

మనసు మార్చుకో. తగిన వరుని వెతికి వివాహం జరిపిస్తాను." అశ్వపతి గొంతు గద్గదమైంది.

సావిత్రి మౌనం దాల్చింది.

"బంగారంలాటి బ్రతుకు పాడుచేసుకోకు. నీ మనసు మార్చుకో." అశ్వపతి సావిత్రిని బతిమిలాడాడు.

తండ్రి ముఖం చూస్తూ. ఇక మౌనంగా ఉండలేకపోయింది సావిత్రి. ఆమె చూపులో నిశ్చలత నిండింది. మునిమాట ఆమెకూ ఆశనిపాతమే అయింది. అయినా, ఇంతవరకు తన మనసులో నిలుపుకొన్న వ్యక్తిని, ఆయుర్భాగ్యం తక్కువైందని విని మనసు నుంచి తోసివేయగలదా? అతని స్థానంలో మరొకరిని ఊహించటం కూడా తనకు సాధ్యంకాదు. తన ప్రేమ పవిత్రమైంది. ఏ దేవతో తనపైన దయదలచి అతని ఆయువు పెంచకూడదా- ఏమో! సావిత్రి దృఢనిశ్చయంతో తండ్రి వంక చూసింది.

"త్రికరణశుద్ధిగా ప్రేమించిన సత్యవంతుని నేను మరచిపోలేదు. అతను ఎలాంటివాడైనా అతనే నా భర్త!"

సావిత్రి నిర్ణయానికి మూర్ఛితురాలైంది తల్లి.
ఎడతెగని కన్నీరు ఆపుకోలేక తల వంచుకున్నాడు అశ్వపతి.

"ఆమె పుణ్యవశాన అతని ఆయువు పెరుగుతుందేమో, విధి నిర్ణయాన్ని ఎవరు ఆపగలరు? సావిత్రీ, సత్యవంతుల వివాహం జరిపించండి. మనసుకి ఊరట కలిగించుకోండి." నారదుడు సానునయంగా అశ్వపతితో పలికాడు.

నిస్సహాయంగా అశ్వపతి, భార్య సావిత్రీ సత్యవంతుల వివాహాన్ని జరిపించారు అశ్రువులను ఆపుకుంటూ.

భర్త మరణకాలం సమీపిస్తున్నకొద్దీ వ్రతదీక్షాపరురాలైంది సావిత్రి.

ఆనాడు భర్తతో తనూ అడవికి బయలుదేరింది. మృత్యువు తోసుకొచ్చేస్తుంటే, గొడ్డలి నేలమీద పడేసి, సావిత్రి ఒళ్ళో తల వాల్చాడు సత్యవంతుడు. ఏం జరగబోతూందో సావిత్రికి తెలుసు.

యముడు తానే స్వయంగా వచ్చాడు. భర్త ప్రాణాలు తన వెంట కొనిపోతున్న ధర్మప్రభువు వెంట పరుగెత్తింది సావిత్రి.

"ఒక వ్యక్తి ప్రాణంకోసం నేను బయలుదేరి రాను. కానీ నీ శక్తి తెలిసే వచ్చాను. నీ భర్తపై నీకున్న ప్రేమానురాగాలు వినే నేను వచ్చాను. నీ భర్త ప్రాణం తప్ప నాలుగు వరాలు కోరుకో." వెంట వస్తున్న సావిత్రి నుద్దేశించి అన్నాడు యమధర్మప్రభువు.

సావిత్రి ఆలోచించింది. తన భర్త ప్రాణరహితుడైతే, తను ప్రాణసహిత ఎట్లా అవుతుంది? తన భర్త ప్రాణం ఎక్కడుంటే తనూ అక్కడే ఉంటుంది. అందుకే మొదటి వరం తప్ప తక్కిన మూడూ కోరతాను-అనుకుని ధైర్యంగా నిలబడింది.

సావిత్రి కోరిన మూడు వరాలూ అనుగ్రహించాడు. "మరి నాలుగో వరం కోరుకో."

"ధర్మప్రభూ, నాలుగో వరమే నా మొదటి వరం. అయినా, నువ్వు అది కోరవద్దన్నావుగా. నా భర్త ప్రాణాల వెంట నా ప్రాణాలు ఉంటాయని నీకు తెలుసుగా? అది అభేదం."

సావిత్రి మాటలు వింటుంటే యమధర్మప్రభువు మనసు మారుతోంది. సకల భూత చరాచర ప్రాణస్పందన ఎరిగిన ధర్మప్రభువుకి సూక్ష్మ సత్యం ఎదురైంది,

విధి నిర్ణయంవల్ల సత్యవంతుని ప్రాణాలు తను తీసికెళ్ళగలడు కానీ, విధి నిర్ణయంలో లేని సావిత్రి ప్రాణాలు ఎలా తీసికెళ్ళగలడు? ధర్మసూక్ష్మం ఎంత క్లిష్టతరమైందో అర్థమైంది యమధర్మరాజుకి.

"సావిత్రీ! నీ భర్తపైన నీకున్న ప్రేమ, నీ ధర్మనిరతి, నీ దీక్ష నన్ను వశపరచుకున్నాయి. ఇటు చూడు ఒక్కసారి." యమపాశాన్ని వదులుచేస్తూ అన్నాడు ధర్మప్రభువు.

తన కళ్ళను నమ్మలేకపోతోంది సావిత్రి. రిక్తహస్తాంతో యమధర్మ రాజు మరలిపోతుంటే, భక్తితో, ఆనందంతో, సాశ్రునయనాలతో చూస్తూ, చేతులు జోడించింది, భర్త ప్రాణాలు తిరిగి సంపాదించుకున్న ప్రేమమయి సావిత్రి .

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం
ఆరణ్యపర్వం : సప్తమాశ్వాసం)

(ప్రచురణ: ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 2-3-1988)

# సుదర్శన

మనువంశ రాజైన దుర్యోధనుడు, అతని భార్య నర్మద ఒకరి పట్ల ఒకరు బద్ధానురాగులై ఆదర్శమైన దంపతులుగా పేరుగాంచారు. దుర్యోధనుడు రాజకార్య నిర్వహణలో ధర్మప్రభువుగా కీర్తి పొందాడు.

ఆ దంపతుల ఏకైక పుత్రిక సుదర్శన. గారాల పట్టి అయినప్పటికీ, విధి నిర్వహణలో మంచి శిక్షణ ఇచ్చారా దంపతులు ఆమెకు పసితనంనుంచీ.

దుర్యోధన మహారాజు బహునిష్ఠాపరుడు. నిత్యాగ్నిహోత్రి. వర్ణాశ్రమ ధర్మ సంరక్షకుడు. తను ఆచరిస్తున్న ధర్మాలన్నీ సుదర్శన కూడా ఆకళింపు చేసుకోవాలని అతను క్షణక్షణం ప్రయత్నం చేస్తూండేవాడు. తను నిర్వహించే దైవసంబంధమైన కార్యక్రమాల్లో సుదర్శనకు ఎక్కువ బాధ్యత అప్పగించేవాడు.

సుదర్శనకు అప్పగించిన బాధ్యతలలో ముఖ్యమైనవి అగ్నిగృహాన్ని పరిశుభ్రపరచటం, అలంకరించటం, అగ్నిదేవుని ఆవాహనం చేయటానికి కావలసిన వస్తుసామగ్రిని సంసిద్ధం చేయటం మొదలైనవి. సుదర్శన అగ్నిగృహ సంబంధ కార్యాలూ బహుశ్రద్ధగా చేస్తూ, తండ్రి నిత్యానుష్ఠానానికి ఏ లోటూ రానీయకుండా చూసుకుంటోంది.

ప్రతి నిత్యమూ అగ్నిగృహంలో ప్రవేశించే సుదర్శన అగ్నిదేవుని గూర్చి తలపోయసాగింది ఆనాడు. ధర్మప్రభువులు, మహర్షులు అంతా నిత్యం అగ్నిని సేవిస్తున్నారంటే, అతనిలోని గొప్పతనమేమిటో అని విస్తుపోయేది ఒక్కొక్కసారి. ఆ అగ్నిపైన భక్తి గౌరవాలు సుదర్శనకు రోజురోజుకీ పెరుగుతున్నాయి. దేవతలకు అర్పించే నైవేద్యాలు అగ్నిదేవునిద్వారా వారికి చెందుతున్నాయని తెలిసిన సుదర్శన అగ్నిగృహ నిర్వహణలో మరీ ఎక్కువ శ్రద్ధ వహించటం మొదలుపెట్టింది.

సుదర్శన కనబరిచే భక్తిశ్రద్ధలు అగ్నికి ముచ్చట గొలిపాయి. నవయౌవనంలో అడుగుపెడుతున్న సుదర్శనను నిత్యం గమనిస్తున్నాడు. గృహాలంకరణ సమయంలో సుదర్శన చిగురుటాకుల్లా ఉన్న చేతుల సొంపును పరీ

క్షగా తిలకిస్తున్నాడు. అగ్నిని రాజేస్తుంటే ఆమె కనులలోని అరుణిమ అతనికి ఎంతో ఆకర్షణీయంగా కనిపించేది. ఆమె అడుగుల చిరుసవ్వడి అతని మనసుకి మన్మథరాగాలాపమైంది.

సుదర్శన రాకకోసం నిత్యం ఎదురుచూడటం అగ్నిహోత్రునికి పరిపాటి అయింది. ఆమె ముగ్ధమనోహరత్వం అతని మనసుని దోచుకుంది. ఆమెపైన ప్రేమ దిన దిన ప్రవర్ధమానమౌతోంది. ఆమె గృహంలో ప్రవేశించటం ఆలస్యమైతే అతను దీప్తిహీను డయేవాడు. ఆమె రాకతో అతని కనులు భాసించేవి. అతని రూపం తేజస్వంతమయేది.

రోజులు గడుస్తున్నాయి. సుదర్శన సౌందర్యాతిశయంతో పూచిన మందారంలా శోభిస్తోంది.

తన మనోభిప్రాయాన్ని సుదర్శనకు ఎలా తెలియజేయాలన్నది అగ్ని దేవునికి పెద్ద సమస్యగా తయారైంది. ఏ రూపంగా ఆమెను చేరగలను, ఏ విధంగా తన ప్రేమను వెల్లడి చేయగలను - అని పదే పదే ఆలోచించసాగాడు. కాలయాపన అతని మనసు నంగీకరించలేదు. అగ్ని ఒక నిర్ణయాని కొచ్చాడు.

ఆనాడు రోజుకన్నా ముందరే అగ్నిగృహంలో ప్రవేశించింది సుదర్శన. ఎదురుగా ఉన్న వ్యక్తిని చూస్తూ భయభ్రాంతురాలైంది. తత్తరపాటుతో అడుగు వెనక్కి వేయబోయింది.

''నువ్వు రోజూ చూస్తున్న అగ్నిహోత్రుణ్ణి నేనే!"

ఆ యువకుని మాటకు ఉలిక్కిపడింది సుదర్శన. సుదర్శనకు ఏమీ అర్థంకాలేదు. తను రోజూ సేవించే పవిత్రమూర్తి ఇతనా? ఆ యువకునివైపు ఒక్కసారి కళ్ళెత్తి చూసింది.

''నా మనసు నీపైన లగ్నమైంది. నిన్ను త్రికరణశుద్ధిగా ప్రేమిస్తున్నాను. రోజూ నువ్వు నన్ను భక్తితో ఆరాధిస్తుంటే రోజూ నేను నిన్ను ప్రేమతో ఆరాధిస్తున్నాను. నీ అడుగుల సవ్వడి నాకు ప్రణయగీతంలా వినిపిస్తోంది. నీ చల్లని చూపులు నా గుండె లోతుల్లో దాక్కుంటున్నాయి. నీ కోసం మన్మథ బాధావేశుణ్ణయ్యాను. నన్ను వివాహం చేసుకో."

అతని వాక్ప్రవాహంలో కొట్టుకుపోతున్నట్టనిపించింది ఆమెకి. సిగ్గుదొంతరలు కమ్ముకొచ్చాయి. ముఖాన చిరుచెమట పోసింది. బుగ్గలు ఎరుపెక్కాయి.

ఈ పరమ పవిత్రమూర్తి తనకోసం ఇంతగా పరితపిస్తున్నాడా? ఎందరో ఇతని అనుగ్రహానికి పాత్రులు కావాలని ప్రాకులాడుతుంటే, ఇతను తన అనుగ్రహం కోసం తనని ప్రార్థిస్తున్నాడా? ఈ పావకుని ధర్మపత్నిగా దేవతలకు నైవేద్యాలు అర్పించే భాగ్యం తనకు కలిగే సమయం నిజంగా ఆసన్నమైందా? సుదర్శన వంచిన తల ఎత్తి, ఆ యువకుని వంక చూసింది.

''వివాహ విషయంలో స్వతంత్రత నాకు లేదు. నా తండ్రి అంగీకారం తీసుకుంటే...'' సుదర్శన నోటినుంచి మకరందపు తేటలా జాలువారింది ఆ మాట. అగ్నిదేవుని ముఖం ఆనందంతో వెలిగిపోయింది. ఈమె తనని వ్యతిరేకించటం లేదు. ఈమె తండ్రి అంగీకారం తీసుకోమంటోంది. అగ్నిదేవునికి ఆమె మాట గొప్ప తృప్తి నిచ్చింది.

యజ్ఞదీక్షలో ఉన్నాడు దుర్యోధన మహారాజు. భూసురోత్తముల వేద ఘోషతో మారుమోగుతోంది యజ్ఞవాటిక. దుర్యోధనుడు యజ్ఞ నిర్వహణానంతరం భూదేవతలకు పూజలు చేస్తున్నాడు. కానుకలు సమర్పిస్తున్నాడు. దానాలు అందిస్తున్నాడు. దూరంగా అంతా గమనిస్తున్నాడు అగ్ని. బ్రాహ్మణ రూపంలో దుర్యోధనుని సమీపించాడు.

యువకుని సాదరంగా ఆహ్వానించాడు దుర్యోధన ప్రభువు.

''నాకు కన్యాదానం చేయి.''

ఆ యువకుని గొంతు విని విస్తుపోయాడు మహారాజు. ఆ యువకుని పరిశీలనగా చూశాడు. అతని శరీర దారుఢ్యం, రూపరేఖలు, ముఖంలో వర్చస్సు, అతని వాక్చమత్కృతి అన్నీ దుర్యోధనునికి నచ్చాయి. కానీ, తాను క్షత్రియుడు. ఈ వర్ణాంతర వివాహాన్ని ఎలా అంగీకరిస్తాడు? ధర్మ వ్యతికరణం తను చేయలేడు. దుర్యోధనుడు ఎంత ఆలోచించినా అభిప్రాయం మారేటట్లు లేదు.

''అయ్యా, వర్ణాంతర వివాహాన్ని నేను చేయలేను. తమరు అన్యథా తలచవద్దు.''

దుర్యోధనుని మాటలు అశనిపాతాలైనాయి అగ్నికి.

తానుగా వచ్చి కన్య నభ్యర్థిస్తే ఈ రాజు తనని తిరస్కరిస్తున్నాడనే భావం అతని మనసుని గుచ్చుకుంది. సుదర్శనపై తన ప్రేమను కాదనుకోలేడు.

అక్కడి నుంచి కదిలాడు అగ్నిహోత్రుడు. కానీ, యజ్ఞవాటికలో తన కాంతిని ఉపసంహరించాడు. అంతవరకు ప్రజ్వరిల్లుతున్న అగ్ని ఒక్కసారిగా కాంతి విహీనమవటంతో కారణం తెలియని దుర్యోధనుని మనసు ఆవేదన చెందింది. ఋత్విజులంతా ఎక్కడ ఏ పొరపాటు జరిగిందోనని భయపడి పోయారు.

అగ్నిదేవుని తిరిగి ఆవాహనం చేశారు. భక్తిశ్రద్ధలతో స్తుతించారు. ప్రదక్షిణలు చేశారు.

తనను పూజించే భూసురులకు తన బాధ చెప్పుకోవాలనిపించింది అగ్నికి ఆ సమయంలో. తన ప్రేమ పవిత్రమైందని, తను సుదర్శనను కోరి ఇక్కడికి వచ్చానని అక్కడి వారితో మనవి చేసుకున్నాడు అగ్ని మరొక మార్గం లేక.

దుర్యోధన మహారాజు మనసు తేలికపడింది. సాక్షాత్తు అగ్నిదేవుడే తన కుమార్తెను ప్రేమించిన వివాహం చేసుకుంటానని వస్తే, తనకు అంతకుమించిన అదృష్టమేది? తను చేసిన యజ్ఞం ఈ విధంగా ఫలించిందని సంతసించాడు దుర్యోధనుడు.

సుదర్శనాగ్నిహోత్రుల వివాహం వైభవోపేతంగా జరిగింది. *

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్రమహాభారతం : అనుశాసనిక పర్వం : ప్రథమాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక :9-3-1988)

# ఉలూచి

అర్జునుడు తీర్థ యాత్రలకు బయలుదేరాడు. తనతోపాటు వేద వేదాంగ పారంగతులైన శాస్త్ర విదులనూ, కథా కథన దక్షులైన పౌరాణికులను వెంట తీసుకుని ప్రయాణం సాగించాడు.

మార్గాయాసం లేకుండా అందరితోనూ మధ్య మధ్య విశ్రాంతి తీసుకుంటూ, కుతూహలంతో పురాణ కథలు వింటూ, పుణ్యతీర్థ ప్రదేశాలు సేవిస్తూ, ప్రకృతిని తిలకించి పరవశిస్తూ ముందు ముందుకు సాగుతున్నాడు ఉత్సాహంగా అర్జునుడు.

గంగా తీరం చేరిన అర్జునుని మనసు ఆనంద తరంగాల్లో ఊగిసలాడింది. పరమ పావనీ, పాపహారిణీ అయిన ఆ గంగామతల్లి మాహాత్మ్యాన్ని కొనియాడారు. ఈ పుణ్య భాగీరథీ తీరాన కాలం గడుపుతూ, తపోనిష్ఠాపరులైన మహర్షు లెంత ధన్యులో అనిపించింది అతనికి.

ప్రతినిత్యం గంగా స్నానం చేస్తున్నాడు. హోమం కాలుస్తున్నాడు. పితృ దేవతలకి తర్పణాలు వదులుతున్నాడు. ఆ గంగా జలాలను వదిలిపో బుద్ధి పుట్టటం లేదు అర్జునునికి.

అది ప్రభాత సమయం. దిక్కులన్నీ వింతకాంతుల్ని నింపుకుంటు న్నాయి. ఉదయ సూర్య కిరణాలు నదీ జలాలపైన పడటంతో ఆ నదీ జలాలు మిలమిలా మెరుస్తున్నాయి. ఉదయ సంధ్యాకాంతులు తూర్పు దిక్కున ప్రసరి స్తుంటే, నదిపైనుంచి వచ్చే పిల్లగాలులు, అక్కడి వృక్ష సంపద, ఆ వృక్షాలపై నుంచి వినవచ్చే పక్షుల కిలకిలా రావాలు-అన్నీ అర్జునుణ్ణి పరవశింప జేస్తున్నాయి.

రోజులాగా ఆనాడు ప్రభాత సంధ్యలో గంగాస్నాన మాచరించాడు. సూర్యు నారాధించాడు. అగ్ని కార్యం ప్రారంభించదలచాడు. హోమం చేయ సంసిద్ధుడయ్యాడు.

ఆ అగ్ని హోత్రపు వెలుగులో అర్జునుడు భాసిస్తున్నాడు. అతని శరీరపు నిగనిగలు ఆ కాంతితో మరీ ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. స్వర్గాధిపతిని మించిన రాజఠీవి అతని ముఖంలో ద్యోతకమవుతోంది. విశాలమైన వక్షస్థలం,

కొస దేరిన నాసిక, శరీర దారుఢ్యం ఆ గంభీర మూర్తి సౌందర్యానికి మరింత వన్నె చేకూర్చాయి. ఎంద రెందరు మహాత్ములు ఈ నదిలో స్నానమాడలేదూ, ఎందరెందరు మహర్షులు ఈ నదిలో మునక తీయలేదు. కానీ, ఈనాడెందుకో తన మనసు తనకి లొంగటం లేదు. తనతో బాటు అతన్ని తీసికెళ్ళిపోవాలి. ఇక ఒక్క క్షణం తను ఆలస్యం చేయకూడదు, ఈ మన్మథాకారుణ్ణి తన బాహు పంజరంలో బంధించి, తన భవనంలో దాచుకోవాలి. ఇంత కాలంగా అతన్ని ప్రేమిస్తూ, ఈనాడు ఒంటరిగా ఉన్న అతన్ని తన లోకానికి తీసుకెళ్ళటానికి తను వెనుకాడటం తగదు- నాగకన్య తన మనసులో పరి పరి విధాల ఆలోచిస్తూంది. తగిన సమయం కోసం నిరీక్షిస్తోంది.

అర్జునుడు హోమం మొదలు పెట్టాడు. అమాంతంగా అతన్ని అక్కడ నుంచి తనతో పాతాళానికి కొనిపోయింది నాగకన్య. అక్కడే హోమం ఏర్పాటు చేసింది. అగ్ని కార్యం పూర్తి చేసిన అర్జునునికి ఇదో కొత్త అనుభూతి.

తానెక్కడున్నాడు? తను రోజూ దర్శించే పవిత్ర భాగీరథీ తీరమేది? తనతో వచ్చిన వేద పండితులు, పౌరాణికులు ఏరి? ఈ అందమైన భవనంలోకి తాను ఎలా వచ్చాడు? అర్జునునికి ఇది భ్రాంతా, నిజమా తెలియటం లేదు.

ఆరాధనా భావంతో అతని వంక చూస్తున్న స్త్రీమూర్తిని చూసి విస్తుపోయాడు క్షణం.

ఇంతకు ముందే ఇతని గుణగుణాలు, రూప సౌందర్యాలు గీతాలుగా తన వారు పాడగా విందామె. అతన్ని గంగానదిలో స్నానమాడుతున్నపుడు స్వయంగా వీక్షించింది. తన ప్రేమ ఫలించాలని తాను ఎంతగానో కాంక్షించింది. ఇంత కాలానికి ఏ దేవతో తనని కనికరించింది. తన అదృష్టం రూపు దాల్చిందా అన్నట్టు ఇతను తనకు లభించాడు. తన భవనంలో దాచుకుంది. ఇక్కడి నుంచి కదలనీయదిక. తనెంత ధన్యురాలు!

ఆనందంతో తబ్బిబ్బయింది ఆమె.

అతన్ని క్రీగంట చూస్తుంటే, అర్జునుడు మందస్మితుడై "ఎవరు నువ్వు? నన్నిక్కడికి ఎందుకు తెచ్చావు?" అన్నాడు ఆ లోకమంతా పరిశీలనగా చూస్తూ.

"నేను నాగకన్యను. ఉలూచిని. ఇంతకు ముందు నీ కోసం ఎదురుచూసి, నీ గుణగణాలు రాగాలాపన చేశాను. ఇప్పుడు అనురాగంతో నా భవనానికి తెచ్చుకున్నాను." ఉలూచి ప్రేమైక దృష్టులు సారించింది అర్జునునిపైన.

ఆమె నల్లని కేశపాశం నడుముపైన నిగనిగలాడుతూ నాట్యమాడింది. ఆమె కళ్ళు మణి దీపికల్లా మెరుస్తున్నాయి. ఆమె ఎర్రని పెదాలు మధురంగా కదులుతుంటే, చిత్రంగా ఆమెకేసి చూస్తూ చిరునవ్వు నవ్వాడు అర్జునుడు.

ఆమె మనసు అర్థమైంది. తనని ప్రేమించి, వరించమని కోరుతోంది. కానీ, ఇదెలా సాధ్యం? వ్రతదీక్షాపరుడైన, తీర్థయాత్రార్థి అయిన తను ఉలూచి కోరిక తీర్చటం అధర్మం. ఈమె ప్రేమను తను స్వీకరించలేడు. నియమాన్ని ఉల్లంఘించలేడు. అర్జునుని భ్రుకుటి ముడిపడింది.

అక్కడ నిశ్శబ్దం తాండవించింది. ఉలూచి తలెత్తి అతని వంక చూసింది.

అతని నియమ నిష్ఠలు, వ్రతదీక్ష తనకి తెలుసు. కానీ, తన ప్రేమ సఫలం కాకపోతే తాను జీవించలేదు. ప్రాణ త్యాగం తప్పదు. ఎంత కాలంగానో ఎదురుచూస్తున్న ఈ వ్యక్తి, తన మనసులో నిండిపోయిన ఈ వ్యక్తి తనని కాదని వెళ్ళిపోతే? ఉలూచి కళ్ళలో నీళ్ళు నిలిచాయి. ఆమె కళ్ళలో బేలతనం, నిస్సహాయత అర్జునునికి బాధ కలిగించాయి. అతని నియమం అతన్ని వ్రత దీక్షాబద్ధుణ్ణి చేస్తోంది.

ఇటు నియమం, అటు తన పొందుకోరే ప్రేమికురాలు.

"నా నియమం సడలించలేను."

అర్జునుని మాటలు వినగానే నవ్వింది ఉలూచి.

"నీ సర్వతీర్థాగమనం, నీ వ్రత దీక్ష! నీ ధర్మవర్తన మొదలైనవన్నీ ప్రాణ దానంతో సమానం కావుగా?"

ఉలూచి అర్జునునికి చాలా చేరువ కొచ్చింది.

"ప్రాణ దానమా?" అశ్చర్యపోయాడు అర్జునుడు.

"అవును. నువ్వు నన్ను స్వీకరించకపోతే, విఫలప్రేమికురాలిగా జీవించలేను. అసలు మన్మథాగ్నే నా ప్రాణాలు తీస్తోంది. నీ చేత తిరస్కృతమైన ఈ తనువు, మనసు నాకక్కరలేదు. నేను ప్రాణత్యాగం చేయటం తథ్యం."

ఉలూచి గొంతు గాద్గద్యమైంది. ఆమె కన్నీటిబొట్లు అర్జునుని పాదాల పైన పడ్డాయి.

"ఈ ప్రేమార్తను రక్షిస్తే వ్రత భంగం కాదు."

నాగకన్య దీనాలాపం అర్జునుని గుండెలోతుల్ని చేరింది.

అర్జునుడు సానునయంగా ఉలూచి వంక చూశాడు. నాగలోకం మణుల కాంతితో ధగధగ లాడింది. నాగకన్య మనసు ఆనందంతో ఉక్కిరి బిక్కిరైంది. ఆ రాత్రి ఉలూచి అంతఃపురమే అర్జునుని శయనాగారమైంది.

మనోహరుడై, పరాక్రమవంతుడై, మహావీరుడైన అర్జునుని పొందుతో నద్యో గర్భం దాల్చింది ఉలూచి.

నాగలోకాన్ని వదలివెళ్ళిపోతున్న అర్జునుని చూస్తూ, ఒడిలో ఉన్న పసికందు ఇరావంతుణ్ణి గుండెలకు హత్తుకుంది నాగకాంత ఉలూచి. *

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం
ఆదిపర్వం : అష్టమాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 16-3-1988)

# ఋచీకుడు

ప్రాతఃకాలాన నదిలో స్నానమాచరించి వస్తున్న ఋచీకమహర్షి దృష్టి ఎదురుగా ఉన్న చెట్టుపైన కూచున్న పక్షుల జంటపైన పడింది. భగవంతుని సృష్టిలోని సహజ సౌందర్యానికి విస్తుపోతూ, మహర్షి కదలక అక్కడే నిల బడ్డాడు. ముక్కు ముక్కూ రాసుకుంటూ, ముచ్చట్లు చెప్పుకుంటున్న ఆ ప్రేమ జంటని చూస్తూ ప్రకృతి పరవశిస్తోందో, ఆ జంటే ప్రకృతిని చూసి పరవ శిస్తోందో అవగతం కాలేదు మహర్షికి. అలా చూస్తుండగానే రెండూ కలసి రివ్వున ఆకాశంలోకి ఎగిరిపోయాయి.

భృగుమహర్షి కుమారుడు ఋచీకుడు. నిరంతరం శిష్య సాంగత్యంలో, వేదాధ్యయనంతో కాలం గడుపుతున్నాడు.

ఆరోజు స్నానానంతరం ఆశ్రయానికి రాగానే చాలా వెలితిగా అని పించింది ఋచీకుడికి. బ్రహ్మచర్యంతో తపోదీక్షతో బాగానే సాగింది జీవిత మని పించింది ఇంతవరకు. కానీ, జీవితంలో ఏదో లోపించిందని, జీవిత పరిపూర్ణ త్వానికి ఏదో తక్కువైందని ఈనాడనిపించింది. ఋచీకుడు ఆశ్రమమంతా కలియచూశాడు.

ఋషి కన్యలు ఆశ్రమంలో పూల మొక్కలకి నీళ్ళుపోస్తూ కనిపించారు. వాకిట తీర్చిదిద్దిన రంగవల్లులు ఎంతో శోభాయమానంగా కనిపిస్తున్నాయి. ఋచీకుడు తన ఆశ్రమంలోకి అడుగుపెట్టాడు. ఆశ్రమమంతా వెలవెల పోతున్న ట్లనిపించింది ఆనాడెందుకో.

మనిషి జీవితంలో అన్ని దశలూ దాటాలి. అలా దాటుతూనే తామరాకు పైన నీటిబొట్టులా జీవితం గడపాలి. ఇంతవరకూ తను తపోధనుడై ఆశ్రమ జీవితంతో ధన్యత చెందాడు. ఇక గృహస్థాశ్రమ జీవితం ఎందుకు చేపట్టకూడదూ? గృహస్థుడుగా తన జీవితం పండి, సంతానవంతుడై తన వంశాన్ని తరింపజేస్తే? ఋచీకుని శరీరం గగుర్పాటు చెందింది.

ఋచీకుని ఆలోచనలు గృహస్థాశ్రయం వైపు పరుగులు తీయసాగాయి. వయసు మీరిపోకుండా తను వివాహం చేసుకోవాలి. ఇప్పటికే తను ఆలస్యం

చేశాడు అనుకుంటూ ఋచీకుడు తను వివాహమాడటానికి తగిన కన్య ఎవరో అని తలపోయసాగాడు.

ఇంతకుముందు కన్యలనెందరినో తను చూశాడు. అప్పుడెప్పుడూ తనకి వివాహపు ఆలోచన రాలేదు. ఈనాడు తాను వివాహం చేసుకుందామని నిశ్చయించుకుంటే, ఒక్క కన్యకూడా తనకు గోచరించదెందుకో? ఋచీకుడు తలపుల దొందరలోంచి పైకి కనవచ్చింది సత్యవతి!

మహా తపోధన సంపన్నుడై, ఋషీశ్వరుడై, పేరు ప్రఖ్యాతులు గాంచిన గాధి కూతురు సత్యవతి. ఆమె సత్ప్రవర్తన, ఆమె రూప రేఖా విలాసాలు ఋచీకునికి తెలుసు ఇంతకు ముందు. ఆమె తనకి అనుకూలవతి. ఆమెను గురించిన ఆలోచన రావటం, అది అతని మనసుని ఆక్రమించుకోవటం, ఆమె తనకు తగిన భార్య అవే భావం స్థిరపడిపోవటం క్షణాలపైన జరిగిపోయింది. అతని మనసు ఆమెపైన లగ్నమైపోయింది.

ఆమె ఒక ఋషి కుమార్తె. మరో మహర్షి అర్ధాంగి కావటానికి ఎందుకు అంగీకరించదు? తన కోరికని మహర్షి మాత్రం ఎందుకు తిరస్కరిస్తాడు?

సత్యవతే తన అర్ధాంగి కావాలని నిశ్చయించుకున్న ఋచీకుడు ఇక ఆలసించదలచలేదు తన ప్రయత్నానికి.

ఋచీకుడు ఎంతో ఉత్సాహంతో గాధి ఆశ్రమంలో అడుగుపెట్టాడు. జుట్టు అరబెట్టుకుంటూ నీరెండలో కూచున్న సత్యవతి అతని కళ్ళకి వనలక్ష్మిలా కనిపించింది ఆ క్షణం. సత్యవతి ఋచీకుని రాక గమనించి వెంటనే లేచి నిలబడింది. లోపలికి ఆహ్వానించింది. సత్యవతి నల్లని కళ్ళు అతని మనసుని గిలిగింతలు పెట్టాయి. ఆమె అడుగుల సవ్వడి అతనికి మధురంగా తోచింది. బ్రహ్మ ఆమెను తనకోసమే సృష్టించాడని అనుకుంటూ, ముందుకు అడుగు వేయబోతున్న ఋచీకునికి ఎదురొచ్చి సాదరంగా లోనికి తీసికెళ్ళాడు గాధి మహాముని.

అతిథి మర్యాదలు చేసి "తమ రాకతో నా గృహం పావనమైంది" అన్నాడు. ఋచీకుడు తపస్సంపన్నుడని గాధికి తెలుసు.

"నేను కన్యార్థినై వచ్చాను." ఋచీకుడు లోపల గుమ్మంలో నిలుచున్న సత్యవతి వంక చూస్తూ అన్నాడు.

గాధికి ఈ మాటలు అర్థం కాలేదు. ఋచీకుడు బ్రహ్మచర్య దీక్షాపరుడుగా పేరొంది, కన్యార్థిగా తన ఇంటికి రావటమేమిటో తెలియలేదు. సత్య

వతిని ఋచీకునికిచ్చి వివాహం చేయటమా? ఋచీకుని వయసూ, అతని నియమ నిష్ఠలూ తెలిసిన తను యౌవనవతి అయిన తన కుమార్తె నిచ్చి ఎలా వివాహం చేస్తాడూ? గాధి ఋచీకుడికి ఏ సమాధానమూ చెప్పక ఊరుకున్నాడు.

"మీ కుమార్తె సత్యవతి నాకు తగిన భార్యగా నా మనసు చెప్తోంది. గృహస్థాశ్రమంలో అడుగిడదామనే ఆలోచన రాగానే నా మనసు సత్యవతిపైననే లగ్నమైంది."

ఋచీకుని మాటలు భయాన్ని గలిగించాయి గాధికి. ఇతని మనసు బాధ పడకుండా, ఇతను అవమానపడకుండా ఎలా ఈ పరిస్థితినుంచి తప్పించుకోవాలి? అంతేకాదు, తనంతగా తాను కన్యను కోరితే తండ్రిగా తను కాదంటే ఏ ఆపద వాటిల్లుతుందో? ఋచీకుడు ఆగ్రహించి ఈ సత్యవతిని మరెవరూ వివాహమాడ రాదని శాసిస్తే? శపిస్తే? గాధి మనసు పరిపరివిధాల పోయింది. ఏదో ఉపాయంతో ఈ వివాహం తప్పించాలని నిశ్చయించుకున్నాడు గాధి.

"నా చిన్నకోరిక తమరు తీరుస్తే"-గాధి నెమ్మదిగా అన్నాడు.

"ఏ కోరికైనా వెంటనే తీరుస్తాను..." అనాలోచితంగా, సత్యవతిపైన లగ్నమైన మనసు ఉద్రేకపడుతుంటే అనేశాడు ఋచీకుడు.

"అయితే వేయి గుర్రాలు తీసుకువస్తే"-నవ్వుతూ అన్నాడు గాధి.

"ఓ, అదెంతపని?" లేవబోయాడు ఉత్సాహంగా ఋచీకుడు.

"ఆగాగు. ఒక చెవి నలుపు, శరీరమంతా తెల్లని తెలుపు-అలాటివి వెయ్యి గుర్రాలు. నువ్వు నాకు చెల్లించాల్సిన కన్యాశుల్కమది." గాధి ఋచీకుని వంక చూశాడు.

ఋచీకునిలోని ఉత్సాహం ఒక్కసారిగా చల్లబడిపోయింది. వేయి గుర్రాలు తేగలడు కానీ, నల్లని నలుపున్న చెవి, తెల్లని తెలుపున్న శరీరం- అదికూడా ఒకటా, రెండా-వెయ్యి!

ఋచీకుడు నెమ్మదిగా లేచి బయటికి నడిచాడు. తండ్రి కోరిక అర్థంలేని కోరిక. సత్యవతి మనసులో బాధ కలిగింది. అతనిపైన భక్తి గౌరవాలు పెంచుకున్న ఆమె కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

ఋచీకుడు బయటకు నడవగానే గాధి తృప్తిగా నిట్టూర్చాడు. ఆ కన్యాశుల్కం అతడు చెల్లించనూ లేడు, సత్యవతిని ఆ ఋషికిచ్చి తను వివాహమూ చేయక్కర్లేదు. హాయిగా ఊపిరి తీసుకున్నాడు గాధి.

రోజులు గడిచాయి. నిరాశనుంచి తేరుకున్నాడు ఋచీకుడు. సత్యవతిని ఎలాగైనా చేపట్టాలనే పట్టుదల పెరిగింది. మహా తపోబలసంపన్నుడైన తను సత్యవతిని ప్రేమించి విఫలుడవటమా? అసంభవం! తపోశక్తి సంపన్నుడైన తను ఏది సాధించలేడు కనక? ఋచీకునిలో కొత్త ఉత్సాహం ఊపిరి నింపింది.

ఇష్టుడూ, స్నేహితుడూ అయిన సముద్రాధిపతి వరుణుని ప్రార్థించాడు ఋచీకుడు.

"గంగానదికి ఉత్తరాన, కన్యాకుబ్జ సమీప ప్రాంతంలో నీకు అలాటి గుర్రాలు లభిస్తాయి. అందుకే ఆ ప్రాంతాన్ని అశ్వతీర్థ మన్నారు'' అంటూ ఋచీకుని సమయానికి ఆదుకున్నాడు వరుణుడు.

పరమానంద భరితుడై ఆశ్రమంలో అడుగుపెట్టిన ఋచీకుని చూసి విస్తుపోయాడు గాధి. నిజంగానే తను కోరినట్లుగా, నల్లని చెవి, తెల్లని శరీరం వున్న వేయిగుర్రాలు కళ్ళముందు కదులుతుంటే అది కలో, నిజమో అర్థంకాక తికమక పడ్డాడు గాధి.

కానీ, సత్యవతిమీద ప్రేమతో, ఇంత అసాధ్యమైన పనిని శక్తి యుక్తులతో సాధించిన ఋచీకునిపట్ల ఎడతెగని గౌరవం కలిగింది గాధికి. ఆతని తపోబలానికి ఆశ్చర్యపోయాడు.

ఇంతటి మహానుభావుడు తనకు అల్లుడు కావటంకన్న మించిన అదృష్టం వేరొకటి లేదనిపించింది గాధికి. ఇంతటి మహర్షికి భార్య కావటం తన కూతురు భాగ్యమని సంతసించి, సత్యవతీ ఋచీకుల వివాహాన్ని వైభవోపేతంగా జరిపించాడు గాధి.

సత్యవతిని చేపట్టి, విజయగర్వంతో గృహస్థాశ్రమంలోకి అడుగుపెట్టాడు ఋచీకుడు. *

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం :
ఆనుశాసనిక పర్వం : ప్రథమాశ్వాసం)
(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 23-3-1988)

# చిత్రాంగద

మహావీరుడైన అర్జునుడు తీర్థయాత్రలు చేస్తున్నాడు. మణిపుర మహారాజు చిత్రవాహనుడు అర్జునుడు తన పురానికి ఎప్పుడొస్తాడా అని ఎదురుచూస్తున్నాడు.

మహారాజు ఏకైక పుత్రిక చిత్రాంగద అర్జునుని వీరగాథలు విని, అతన్ని చూసే భాగ్యం ఎప్పుడు కలుగుతుందో అనుకుంటూ సమయం కోసం నిరీక్షిస్తోంది.

సకల తీర్థప్రదేశాలు సేవిస్తూ, కావేరీ నదీ ప్రాంతాన హిరణ్యదానాదులు గావించిన అర్జునుడు మిత్ర పౌరాణిక బృందాలతో మణిపురం చేరాడు. ఆ వార్త విన్న చిత్రవాహనునికి ఆనందం పట్టరానిదైంది. ఊరంతా అలంకరింపచేయ ఆజ్ఞాపించాడు.

చిత్రవాహనుని సందర్శించటాని కొచ్చిన అర్జునునికి అతిథి సేవలు చేసి, కుమార్తె అయిన చిత్రాంగదను అతనికి పరిచయం చేశాడు.

చిత్రాంగదను చూడగానే చిత్రమైన అనుభూతి కలిగింది అర్జునునికి. తండ్రి పక్కన నిల్చిన ఆమె ముగ్ధమనోహర రూపం అతని మనసును వశపరచుకుంది. ఆమె సోగకళ్ళు, నల్లని కురులు ఎంత చూసినా తనివితీరనట్లే అనిపించి అర్జునుడు చూపు మరల్చుకోలేకపోయాడు.

ఇన్ని దేశాలు తిరిగాడు తను, ఇంతమంది స్త్రీలను చూశాడు. కానీ ఎక్కడా కనిపించని ఏదో ప్రత్యేకమైన ఆకర్షణ చిత్రాంగదలో కనిపించింది అర్జునునికి. సుకుమారంగా ఉన్న ఆమె ముఖంలో ఏవో వీరత్వపు ఛాయలు గోచరించాయి. ఆమె వాలుచూపుల్లోనే నిశితత్వం నిగూఢంగా ఉందనిపించింది. అపురూప లావణ్యంతో పాటు, అసాధారణమైన ప్రజ్ఞాపాటవాలు ఈమె కున్నాయనిపించింది చూస్తుంటే. ఈమెకు యుద్ధ విద్యలు తెలిసి ఉండవచ్చు. గుర్రపుస్వారీ నేర్చి ఉండవచ్చు. స్త్రీయై కూడా ఈమె పురుష విద్యలు నేర్చిందేమో?

అర్జునుడు మరీ ఆశ్చర్యంగా ఆమె వంక చూస్తుంటే, చిత్రాంగద అక్కడ నుంచి రివ్వున లోపలి కెళ్ళిపోయింది. అర్జునుని పరాక్రమాన్ని గురించి వినటమే కాక, ప్రత్యక్షంగా అతన్ని చూడగలిగినందుకు చిత్రాంగదకి ఎంతో ఆనందం కలిగింది.

అర్జునుడు చిత్రవాహనుని దగ్గర సెలవు తీసుకున్నాడు. కానీ ఆ మణిపురం వదలిపోబుద్ధి కాలేదు అతనికి. తనతో వచ్చిన వారంతా ప్రయాణ సన్నాహంతో ఉంటే, అర్జునుని మనసు చిత్రాంగదపైన లగ్నమై, ప్రయాణానికి విముఖత చూపుతోంది.

తీర్థయాత్రార్థిగా వచ్చిన తను, ఈ మణిపురంలో చిత్రాంగదను ప్రేమిస్తూ ఇక్కడే ఆగిపోవటమా? - అర్జునుడు ఎంత వితర్కించుకున్నా అతని మనసు అడుగు ముందుకు జరగటంలేదు.

ప్రయాణానికి ఆటంక మెస్తోందని గ్రహించిన ఆత్మీయులు, అర్జునుడు మణిపురాన్ని వదలలేకపోటానికి గల కారణాలు ఊహించటం ప్రారంభించారు. ధర్మప్రభువైన చిత్రవాహనుడు తమను సాదరంగా ఆహ్వానించి గౌరవించాడు గదా, చిత్రవాహనుని రాజ్యం సుఖశాంతులతో విలసిల్లుతోంది కదా, మరి ఏ కారణం అర్జునుణ్ణి ఇక్కడ నుంచి కదలనీయటం లేదో అర్థం కాక తికమక పడ్డారు అతనితో వచ్చినవారంతా.

మనసులో ఉన్న విషయం ఎవరికి ఎలా చెప్పాలో తెలియక ఆవేదన చెందాడు అర్జునుడు. అయినా చిత్రాంగద పైన అతని మనసు నిలిచిందని గ్రహించటానికి అతని ముఖ్య స్నేహితులకు ఎక్కువ సమయం పట్టలేదు. వారి మనసులు తేలికపడ్డాయి. వారి కొక ఆలోచన తట్టింది. మహారాజుకి అర్జునుడు చిత్రాంగదను ప్రేమిస్తున్న విషయం తెలియపరచాలి, చిత్రాంగ దార్జునుల వివాహం జరిపించి గానీ ఇక్కడ నుంచి కదలరాదని నిశ్చయించుకున్నారు స్నేహబృందం.

చిత్రవాహనునికి ఈ వార్త అందింది. అర్జునుడు తనకుమార్తెను ప్రేమిస్తున్నాడనే విషయం అతనికి ఆనందాన్నీ గర్వాన్నీ కూడా కలిగించింది. కానీ మరుక్షణంలో అతని మనసులో ఎన్నో సందేహాలు పొడగట్టాయి. తను తన మనసులో మాటను చెప్తే అర్జునుడు అంగీకరిస్తాడో లేదో, ఒకవేళ అంగీకరించక

తనతో యుద్ధం ప్రకటించో, లేకపోతే చిత్రాంగదను రాక్షస వివాహం చేసుకునో తనతో తీసుకువెళ్ళిపోతే తన గతేంకాను? - చిత్రవాహనుణ్ణి ఈ భావం కదిల్చి వేసింది. కానీ తీర్థయాత్రార్థిగా వచ్చిన అర్జునుడు ఇలాటి పనులు చేయడని మన సును సమాధాన పరుచుకున్నాడు.

చిత్రవాహనుని వంశంలో ప్రభాకరుడనే రాజుకు సంతానం కలగలేదు. ఆ రాజు ఘోరతపస్సు చేసి, శివుని అనుగ్రహంవల్ల ఒక కుమారుని కన్నాడు. అంతేకాదు, ఆ వంశంలో అందరికీ ఒక్కొక్క కొడుకే జన్మిస్తాడని శివుగా వర మిచ్చాడు. అప్పటి నుంచీ తరతరాలుగా ఒక్కొక్క కొడుకే కలుగుతూ వచ్చారు. కానీ, ఆ క్రమం చిత్రవాహనుడి దగ్గర కొచ్చేసరికి మారింది. ఎందుకో తెలి యదు కానీ, చిత్రవాహనునికి ఒక్కతే పుత్రిక కలిగింది.

గతాన్ని తల్చుకుంటూ అర్జునునికి ఆ విషయం చెప్పడానికే నిశ్చయించు కున్నాడు చిత్రవాహనుడు.

ఉన్న విషయం చెప్పి, "ఈ పిల్లను పుత్రునిలాగే పెంచాను, రక్షించు కుంటున్నాను" అన్నాడు చిత్రవాహనుడు.

అర్జునుడు మౌనంగా ఉన్నాడు.

"అయ్యా! తమవంటి వీరుడు నాకు అల్లుడు కావటం నా పూర్వజన్మ పుణ్యమే - కానీ, నా వంశానికి ఆధారం చింత్రాంగదకు పుట్టే కుమారుడు! చిత్రాంగదను వివాహమాడి, మీరు ఆమెను మీతో వెంటబెట్టుకుని వెళ్ళిపోతే మీకు జన్మించే కుమారుడు కురువంశ వారసుడైతే, నా రాజ్యానికి వారసు డెవరు? నా వంశానికి ఆధార మెవరు? అదే నా బాధ!" చిత్రవాహనుని గొంతులో గాద్గద్యం వినిపించింది అర్జునునికి.

ద్వారం లోపలి నుంచి తొంగిచూస్తూ, మాటలు వింటున్న చిత్రాంగదను గమనించాడు అర్జునుడు. ఈమెను కుమారునిలాగే పెంచాడు తండ్రి, అందుకే ఆమెలో ఏదో ప్రత్యేకమైన ఆకర్షణ ఉందనిపించింది ఆమెను చూసిన క్షణాన ఆమె ముఖంలో ప్రస్ఫుటంగా వీరత్వం గోచరిస్తుంటే. అర్జునుడు చిత్రవాహనుని కోరిక మన్నించాలని నిశ్చయించుకున్నాడు.

చిత్రాంగదను వివాహమాడటానికీ, వారికి జన్మించే కొడుకు చిత్రవాహ నుని వంశాధారంగా ఇక్కడే పెరగటానికీ అర్జునుడు ఒప్పుకున్నాడు.

చిత్రాంగద, అర్జునుల వివాహ సందర్భంగా మణిపురం చిత్రవిచిత్ర అలంకరణలతో దేదీప్యమానంగా వెలిగిపోయింది. మంగళ తూర్య వాయిద్యాల సందడిలో చిత్రాంగదను చేపట్టాడు అర్జునుడు.

చిత్రాంగద ప్రణయ సామ్రాజ్యాధిపతిగా మణిపురంలో సమస్తభోగాలు అనుభవిస్తూ కాలం గడిపాడు అర్జునుడు.

రోజులు క్షణాల్లా గడిచిపోయాయి.

తీర్థయాత్రార్థిగా వచ్చిన తను మణిపురంలోనే ఆగిపోవటం తగదనిపించింది అర్జునునికి. తనతో వచ్చిన వారు ప్రయాణోన్ముఖులౌతుంటే, మణిపురం వదలక తప్పలేదు అర్జునునికి.

తన గర్భాన అర్జునుని పోలిన మహావీరుడు జన్మిస్తాడనే తృప్తితో, ఆనందంతో, సజలనయనాలతో అర్జునునికి వీడ్కోలు చెప్పింది చిత్రాంగద. *

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం :
ఆదిపర్వం : అష్టమాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 30-3-1988)

# జయద్రథుడు

మహావీరుడైన జయద్రథుడు సాళ్వకన్య స్వయంవరోత్సవానికి వీరోత్సాహంతో ప్రయాణమయ్యాడు. క్షాత్రధర్మమంటే జయద్రథునికి అమితమైన ప్రీతి. ప్రజలను అన్ని విధాలా కాపాడుతూ, రాజధర్మాన్ని సక్రమంగా నిర్వర్తిస్తున్నానని ఎల్లప్పుడూ తృప్తి చెందేవాడు. ధృతరాష్ట్ర మహారాజు తన పుత్రిక దుస్సల నిచ్చి తనకి వివాహం చేయటం కేవలం తన శౌర్యపరాక్రమాలను గుర్తించి, తనతో స్నేహసంబంధాలు పెంచుకుందుకి మాత్రమేనని అనుక్షణం గర్వపడుతూ ఉంటాడు జయద్రథుడు. ఆ వివాహం రాజకీయమైన వివాహంగానే భావించా డతడు.

స్వయంవరంలో కన్యని గెల్చుకుంటే తన క్షాత్రధర్మం, తన వీరత్వం అతిశయిస్తాయనే నమ్మకం బాగా నాటుకుపోయిం దతనికి.

చతురంగ బలాలతో, ఆప్తులైన స్నేహితులతో, సపరివారంగా ప్రయాణం సాగిస్తున్నాడు జయద్రథుడు. స్నేహితుడైన కోటికాస్యుడు అతనితో సరస సంభాషణ చేస్తుంటే, ప్రకృతి శోభను తిలకిస్తున్నాడు. రథం వేగంగా ప్రయాణిస్తుంటే జయద్రథుని మనసు ఆనందంతో పరవశించింది. రథచక్రాల ధ్వని అతనికి మధురంగా వినిపిస్తోంది.

సాళ్వకన్యను గెల్చుకుని మరలి వస్తున్నట్టే ఊహాపథంలో తేలిపోతున్న జయద్రథునికి ఆ అరణ్యప్రాంతంలో ఒక దృశ్యం అడ్డు తగిలింది. రథ వేగాన్ని తగ్గించాడు.

అది ఆశ్రమ ప్రాంతం. ఒక విశాలమైన వృక్షాన్ని అల్లుకుంది అందమైన ఓ పూలతీగ. ఆ పూలతీగపైన చేయాన్ని, ప్రకృతి శోభను తిలకిస్తూ, వయ్యారంగా నిలబడింది ఒక సుందరాంగి.

ఆమె నుంచి చూపు మరల్చుకోలేకపోయాడు జయద్రథుడు. ఆమె చేతివేళ్ళు ఆ తీగపైన నిలిచి, చిగురుటాకుల్లా ఎర్రగా ఉండి, అగ్నిశిఖల్లా భాసించాయి అతని కళ్ళకి. రథాన్ని మరింత నెమ్మదిగా నడిపాడు జయద్రథుడు.

రథం అక్కడి నుంచి ముందుకు కదలలేదు. ఆమెను శ్రద్ధగా పరిశీలిస్తున్నాడతను దూరం నుంచి. ఆమె దేవతామూర్తిలా కనిపించిం దొకసారి. ఆమె వనదేవతలా ఒప్పింది మరొక్కసారి. వన విహారాని కొచ్చిన రతీదేవిలా కనిపించింది ఇంకొకసారి. అతని మనసు మన్మథ వివశమైంది. అతని చూపు ఆమెపైన నిలిచిపోయింది. ఈమె తన హృదయేశ్వరి అయితే, తను ముల్లోకాలు గెలిచినంత తృప్తి చెందుతాడు. జయద్రథుడు ఇక అక్కడ ఆమెను చూస్తూ నిలవలేకపోయాడు.

తనే స్వయంగా వెళ్ళి ఆమెను ప్రేమభిక్ష పెట్టమని అర్థిస్తే? ఆ ఆలోచన వచ్చినంతలోనే తన ఇష్టసఖుడు కోటికాస్యుడు ఎదురుగా కనిపించాడు. జయద్రథునికి కొండంత బలం వచ్చింది.

తన మనోవేదన స్నేహితునికి విన్నవించాడు. ఎలాగైనా ఆమె సాంగత్యం తనకు చేకూర్చమని స్నేహితుణ్ణి కోరాడు. ఆమెతో కలసి ప్రేమ సామ్రాజ్యాన్ని ఏలకపోతే తన జన్మ నిరర్థకమని వాపోయాడు మహారాజు జయద్రథుడు.

కోటికాస్యుడు ఆమె వద్దకు వెళ్ళి. అతి వినయంగా - "తమ రెవరో తెలుసుకోవచ్చా?" అన్నాడు. ఆ గొంతు విని ఉలిక్కిపడి వెనక్కి తిరిగింది ఆమె.

"నేను సురథుడనే రాజపుత్రుణ్ణి. నా పేరు కోటికాస్యుడు. అటు చూడండి. ఆ రాజకుమారులు సేవిస్తూ ఉన్నవాడు, ఆ మహావీర శౌర్య ప్రతాపధనుడు, సింధు సౌవీరనాథుడైన జయద్రథుడు. అతడే సైంధవుడు." కోటికాస్యుడు మాటలు ఆపి ఆమె వంక చూశాడు.

"తమరి గురించి తెలుసుకురమ్మని నన్ను పంపిన అతడు నా ప్రాణ స్నేహితుడు."

ఆమె తత్తరపాటుతో చీరకొంగు సరిచేసుకుంది. "నేను అరణ్యంలో ఒంటరిగా లేను. మహావీరులైన పాండవుల ధర్మపత్నిని నేను. నీవు సురథ పుత్రుడవైన కోటికాస్యుడవని నేను గుర్తించాను. పాండవ కుమారులు వేట కని వెళ్ళినవారు ఇప్పుడే వస్తారు. వారి అతిథి సత్కారాలు స్వీకరించి వెళ్ళండి."

కోటికాస్యునికి ఆమె మాటలకు ఏం చెప్పాలో తోచలేదు. అతివేగంగా స్నేహితుణ్ణి సమీపించాడు. కోటికాస్యుని మాటలు జయద్రథునికి తీరని నిరాశ

కలిగించాయి. మదనావేశపరవశుడైన అతను వేగంగా తానే స్వయంగా బయ ల్దేరి ఆ ప్రాంతానికి వచ్చాడు.

అతన్ని చూడగానే ఆమెకు ఒక విధమైన భయం కలిగింది. అయినా అది మనసులో దాచుకుని- ''వేట కేగిన నా భర్తలు వస్తా రిప్పుడే. నీకు సపర్యలు చేస్తారు" అంది నెమ్మదిగా.

సైంధవుడు చిరునవ్వు నవ్వాడు.

''నీ అతిథి పూజలతో మాకు పనేలేదు. చల్లకొచ్చి ముంత దాచటం నాకు రాదు. నిన్ను చూసిన క్షణమే నా మనసు నీపైన లగ్నమైంది. ఈ మన్మథ బాధ ఇక తాళలేను. పాండవులతో పాటు అరణ్య భూమిలో కష్టాలు పడుతుం డటం నీకు తగదు. సింధుసౌవీరాధినాథుడనైన నేను నిన్ను చేపట్టి, సర్వాలంకార భూషితురాలను చేసి, సమస్త భోగాలలో తులతూగేలా చేస్తాను."

జయద్రథుని మాటలు, చూపులు భయాందోళనలు కలిగించాయి ఆమెకి. ఆమె క్షణం నివ్వెర పోయింది.

"దుస్సల భర్తవైన నువ్వు నాకు సోదరుడివి తెలుసా?"

ఆ మాటలకు సైంధవుడు వికటాట్టహాసం చేశాడు. ''స్త్రీల విషయంలో వావివరుసలు పాటించటం రాజధర్మం కాదు. నీపైన అమితమైన ప్రేమానురాగా లతో ఇలా అభ్యర్థిస్తున్నాను. నా పరాక్రమం నీకు తెలియక ఇలా ఇలా మాట్లాడు తున్నావు." జయద్రథుడు ద్రౌపది వంక కంటిరెప్ప వేయకుండా చూస్తున్నాడు.

ఇక ఒకటే మార్గ మనిపించింది అతనికి. ఆలస్యం తగదు అనుకుంటూ, ఆమెను బలవంతంగా రథం మీద ఎక్కించుకు పోవాలని నిశ్చయించుకున్నాడు.

తనను సమీపిస్తున్న సైంధవుని తోసిపారేసింది ద్రౌపది. కిందపడి లేచి, తీరని అవమానంతో ద్రౌపదిని రథంపైకి ఎక్కించుకుని మహావేగంతో సాగి పోయాడతను.

ద్రౌపది వేసిన కేకలకు ఆ ప్రాంతమంతా దద్దరిల్లింది. పురోహితుడైన ధౌమ్యుడు వేగంగా ఆ ప్రాంతాని కొచ్చాడు.

అంతలో వేట కేగి, మరలి వస్తున్న పాండవులు సంభ్రమాశ్చర్యాలతో, పరిచారికల ద్వారా జరిగిన విషయం విన్నారు.

పాండవు లైదుగురూ జయద్రథ సేనానివహాన్ని తెగటార్చి, అతని రథాన్ని చుట్టుముట్టారు. సైంధవుడు వారికి లొంగిపోవటమే కాక, వారిచేత అవమానితుడైనాడు. భీమార్జునులు శిరోముండనం చేసిన సైంధవుణ్ణి ద్రౌపది ముందర నిలబెట్టారు.

"నేటినుంచి పాండవ దాసుడినని అన్ని సభలలోనూ చెప్పుకోవాలి" అన్నారు భీమార్జునులు.

సైంధవుడు తల వంచాడు. అతని శిరస్సు ఖండించమని చెబుదామనుకున్న ద్రౌపది కళ్ళకు దుస్సల కనిపించింది.

ఆ దుర్మార్గుణ్ణి చంపి, ఇంటి ఆడబిడ్డకు అన్యాయం చేయరాదనే భావంతో సైంధవుణ్ణి క్షమించారంతా.

ద్రౌపది సైంధవుణ్ణి చూసి పకపకా నవ్వింది.

సైంధవుడు తన ప్రేమ ఇలా విఫలమైనందుకూ, తనకు తీరని అవమానం కలిగినందుకూ లోలోన దుఃఖించాడు.

కాని, ద్రౌపదిపైన తనకున్న ప్రేమ భగ్నమైనందుకు, ఆ ప్రేమనే కసిగా మార్చుకొని తలవంచుకుని మరలిపోయాడు ఆ ప్రాంతంనుంచి- సైంధవుడైన జయద్రథుడు. *

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం : అరణ్యపర్వం : షష్ఠాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 6-4-1988)

# గాంధారి

జ్యోతిష్కులు తన జాతక చక్రాన్ని పరిశీలిస్తున్న విషయం పరిచారికల ద్వారా వింది గాంధారి. భవిష్యజ్జీవితం గూర్చి ఏం చెప్తున్నారో వినాలనే కుతూహలం కలిగిందామెకు. ఏ కన్య మాత్రం తన భవిష్యత్తు బంగారు పూలబాట కావాలని కోరుకోదూ? పసితనంనుంచీ తను చాలా అదృష్టవంతురాలని అందరూ అనుకోటం తనకి తెలుసు. అయినా పండితుల నోటివెంట ఆ మాట వినాలి.

గాంధారి వెంటనే బయలుదేరింది. రాజ ప్రసాదంలో పండితులున్న ప్రాంతం చేరింది. చాటుగా నిలబడి వారి మాటలు శ్రద్ధగా ఆలకించసాగింది.

"ఆహా, అపూర్వమైన జాతకం! మహా పతివ్రతలను మించిన పతిభక్తి, ఏ మహారాణి అనుభవించని రాజభోగం, ఏ స్త్రీ మూర్తి ఊహించలేని సంతాన సంపద ఈ జాతకంలో ప్రస్ఫుటంగా కానవస్తున్నాయి."

పండితుల పల్కులు గాంధార రాజైన సుబలునికి ఎంతో ఆనందాన్ని కలిగించాయి.

"అయ్యా, మా కుమార్తెకు వివాహ శుభ గడియలు ఎప్పుడు రానున్నవో తమరు సెలవిస్తే..." సుబలుడు సవినయంగా చేతులు జోడించాడు.

"శుభస్య శీఘ్రం, త్వరలోనే ఈమె మహారాజు భార్య కాబోతుంది. శతాధికమైన సంతానానికి మాతృమూర్తి అవుతుంది."

చాటుగా పండితుల వాక్కు వింటున్న గాంధారి ముఖాన చిరు చెమట అలముకుంది. అడుగుల చప్పుడు తెలియనీయకుండా నెమ్మదిగా అంతఃపురం చేరుకుంది.

జ్యోతిశ్శాస్త్రజ్ఞులు చెప్పిన గాంధారి జాతక విశేషాలు త్వరలోనే అంతటా తెలిసిపోయాయి.

* * *

ధృతరాష్ట్రుడు, పాండురాజు సింహకిశోరాల్లా భీష్ముని అండదండల్లో పెరుగుతున్నారు. అమిత బల పరాక్రమాలు సంతరించుకుని, యౌవన ప్రాంగ

ణంలో అడుగుపెట్టిన వారికి వివాహ యోగ్యమైన వయసు వచ్చిందని తలచాడు భీష్ముడు.

గాంధార రాజకుమార్తె జాతక విశేషాలు భీష్ముని చెవిని చేరాయి. వెతుకుతున్న తీగ కాలికి తగిలినట్టే అనిపించింది. సుబలుని కుమార్తె శతాధిక సంతానవంతురాలవుతుందన్న విషయం భీష్మునికి మరీ నచ్చింది. కురు వంశాభి వృద్ధిని కాంక్షించే తను ఎలాగైనా ఈ సంబంధం ధృతరాష్ట్రునికి ఖాయం చేయాలని నిశ్చయించుకున్నాడు.

భీష్ముని నుంచి వచ్చిన పురోహితులను సాదరంగా ఆహ్వానించాడు సుబ లుడు. ధృతరాష్ట్రుని జాతకచక్రం అందిస్తూ భీష్ముని సందేశాన్ని వివరించారు వారు.

గాంధారరాజు మనసు ఆనంద డోలికల్లో తేలిపోయింది. కురు వంశాధి పతికి తన కుమార్తెనిచ్చి వివాహం చేయటం కన్నా మరొక భాగ్యం ఏమి ఆశి స్తాడు తను?

గాంధార రాజు ధృతరాష్ట్రుని జాతకచక్రం పరిశీలిస్తున్న జ్యోతిష్కుల వైపు, వారి ముఖ కవళికల వైపు చూపు నిలిపాడు.

ఉద్యానవనంలో విహరిస్తున్న గాంధారికి ఈ వార్త అందించింది ఇష్టసఖి. గాంధారి కళ్ళనిండా కొత్త వెలుగు నిండింది.

"వేగంగా వెళ్ళు-విశేషాలన్నీ నాకు వచ్చి చెప్పు." త్వరపెట్టింది గాంధారి స్నేహితురాలిని.

కానీ గాంధారి మనసు అక్కడికి పరుగెత్తింది. తనూ వెళ్ళి రహస్యంగా వినాలనే కోరిక ఎంత వారించాలని ప్రయత్నించినా సాధ్యంకాలేదు గాంధారికి. స్నేహితురాలిని వెనక్కి నెట్టి, గుమ్మం దగ్గర వెనగ్గా నిలబడింది గాంధారి.

పండిత చర్చ జరుగుతోంది. గాంధార రాజు చాలా శ్రద్ధగా అంతా వింటు న్నాడు.

క్షణాలు గడవటం కష్టంగా అనిపిస్తోంది గాంధారికి. ఊపిరి బిగబట్టింది.

"అద్భుతమైన జాతకం. మహాసామ్రాజ్యాధిపతి. గురుభక్తి, బంధుజన ప్రీతి ఈ జాతకుని ప్రథమ గుణాలు. ఈ జాతకుని శరీర దారుఢ్యం అనంత శక్తివంతమైంది. వేయి ఏనుగుల బలాన్ని మించిన బలం ఇతనిది. శతాధిక సంతానం. మహావీరుడు."

గాంధారికి ఆనందం పట్టరానిదైంది. జ్యోతిష్కులు ఆ తర్వాత ఏమేం చెప్తున్నారో అనే ఆలోచన లేకుండా, ఎంతో వేగంగా స్నేహితురాలితో కలసి అంతఃపురానికి దారితీసింది. ఇక వినవలసింది లేదనుకుంది తృప్తిగా.

అంతఃపురంలోనూ స్థిమితంగా కూచోలేని గాంధారి ఉద్యానవనం ప్రవేశించింది. ఆ ఉద్యానవన శోభ వేయిరెట్లు పెరిగినట్లనిపించిం దా క్షణంలో.

అతను మహారాజా, వీరుడా, శూరుడా, రూప సంపన్నుడా, పరాక్రమ శాలా, అమిత పుత్ర సంతానవంతుడా - గాంధారి ధృతరాష్ట్రుని గురించి పండితులు చెప్పిన మాటలు మళ్ళీ మళ్ళీ తలచుకుంటూ పరవశించింది.

"వేయి ఏనుగుల బలంట విన్నావా, ఆ బలవంతుని భార్యగా ఇంత సుకుమారివి నువ్వు!" చెలికత్తెలు కిలకిల నవ్వుతుంటే గాంధారి చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి.

"జ్ఞాన చక్షువు వుందట ఆ మహారాజుకి తెలుసా నీకు. నీ మనసు ఎప్పుడూ ఆయన ముందు దాచుకోకు." నవ్వుతున్నారు చెలికత్తెలు.

గాంధారికి ధృతరాష్ట్ర మహారాజు చిత్రపటాన్ని మరొక్కసారి చూడగలిగితే బాగుండు ననిపించింది. తండ్రి సమీపాన ఉన్న చిత్రపటాన్ని లీలగా చూసిందంతే-నల్లని మీసాలు, విశాలమైన ఛాతీ, కండలు తిరిగిన శరీరం- అలా, అలా, కొంత వరకు దూరంగా చూడగలిగింది. కానీ, గాంధారి మనసుకి నవ మన్మథుడిలా తోస్తున్నాడు ధృతరాష్ట్రుడు. ఆతని ఆకారం ఆమె మనసులో ముద్ర వేసుకుంది. ధృతరాష్ట్ర మహారాజు రాణిగా ఊహాలోకంలో తేలిపోయింది గాంధారి. ఆ ఊహల్లో ఉన్న గాంధారి శిరసున గాలికి వచ్చిన పారిజాతాలు పడ్డాయి. 'తథాస్తు దేవతల దీవన లివే' అనుకొంటూ, సిగ్గుమొగ్గలు తొడుగుతుంటే, ఈ ధృతరాష్ట్రుడే తన భర్త కావాలని మనసులో మరొక్కసారి ఇష్ట దేవతల్ని తల్చుకొని, గబగబా అంతఃపురం ప్రవేశించింది గాంధారి.

గాంధారి అంతఃపురం ప్రవేశించిన కొద్ది నిముషాలకే చెలికత్తె, ఇష్ట సఖి వేగంగా లోపల కొచ్చింది. గాంధారి సోదరుడు శకుని రాకను తెలియపరుస్తూ ఆమె నిష్క్రమించింది.

ధృతరాష్ట్ర మహారాజుతో గాంధారి వివాహం జరిపించటానికి పెద్దలు నిశ్చయించారని పలికి సోదరి గాంధారిని అభినందించాడు శకుని. వివాహం హస్తినాపురంలో చేయాలనే పెద్దల తలంపు కూడా గాంధారికి తెలియపరిచి మరలిపోయాడు శకుని.

సన్నిహితురాలైన చెలికత్తె గాంధారి దగ్గరకు వచ్చి నిల్చుంది. ఏదో అసంతృప్తి, ఆవేదన ఆమె ముఖంలో స్పష్టంగా కనిపించాయి గాంధారికి. ఇంత ఆనంద సమయంలో ఆమె ముఖాన వ్యాకులత దేనికో?

"అమ్మా! ఒక విషయం నీకు మనవి చేయాలి నా మనసులో దాచుకుని బాధ పడలేను... కానీ, నీ మనసు బాధపడినా చెప్పక తప్పదు."

చెలికత్తె మాటలు అర్థం కావడం లేదు గాంధారికి.

"ఆ మహారాజుకి అన్ని ఉత్తమ లక్షణాలుండి ఒక్క లోపం ఉందమ్మా!" -చెలికత్తె తలవంచుకొనే ఉంది.

గాంధారి నివ్వెరపోయింది.

"అమ్మా! అతను జాత్యంధుడు."

గాంధారి అప్రయత్నంగా కళ్ళు మూసుకుంది.

ధృతరాష్ట్రుని పైన ఏ క్షణాన తన మనసు లగ్నమైందో, ఆ క్షణాన్నే తను అతనికి అంకితమై పోయింది. అతని పట్టమహిషిగా ఊహలు అల్లుకుంది. అతను వేయి ఏనుగుల బలం గల వీరుడంటే గర్వపడింది. అతను కౌరవ రాజ్యాధిపతి అంటే ఆనందపడింది. తను శతాధిక సంతానవతి అవుతుందంటే మురిసిపోయింది - కానీ, అతను జాత్యంధుడని తెలియగానే తన మనసు వెనక్కి పోతుందా?

తన ప్రేమకున్న శక్తి ఎంతటిదో తెలియదా తనకి? గాంధారి మూసిన కళ్ళు తెరిచే ప్రయత్నం చేయలేదు ఆ మహాత్మునికి చూపులేకపోతే తన కెందుకు?

గాంధారి చీర కొంగు టక్కున చించింది. వెంటనే కళ్ళకు కట్టేసుకుంది

ప్రయాణ సన్నద్ధుడై వచ్చిన శకుని తన సోదరి గాంధారిని చూసి నిశ్చేష్టుడయ్యాడు. ధృతరాష్ట్రునిపైన గాంధారికున్న నిశ్చలమైన ప్రేమకు విస్తుపోతూ, హస్తినాపురం వైపుగా ప్రయాణం సాగించాడు గాంధారితో కలసి. *

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం :
ఆదిపర్వం : పంచమాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక : 13-4-1988)

# వ్యుషితాశ్వుడు

జీవితంలో సాధించదలచినవన్నీ యౌవనంలోనే సాధించాడు పౌరవంశజుడు వ్యుషితాశ్వుడు.

వ్యుషితాశ్వుని కీర్తి ప్రతిష్ఠలు అన్నిదేశాలు వ్యాపించాయి. తన రాజ్యానికి నలుదిక్కుల నున్న మహారాజులందరినీ ఓడించి వారిని అదుపులో పెట్టాడు. అంతేకాక, ధర్మపథానికి అవసరమైనవని పెద్దలు నిర్ణయించిన యజ్ఞయాగాదులు అతినిష్ఠతో నిర్వహించాడు.

వ్యుషితాశ్వుని ప్రజలకు శాంతి భద్రత లున్నాయి. శత్రుభయం లేదు. దేశం సస్యశ్యామలంగా ఉంది.

వ్యుషితాశ్వునికి ఇహపరసంబంధమైన బాధ్యతలన్నీ సక్రమంగా నిర్వర్తించిన తర్వాత ఇక తను చేయవలసిందేమిటో తెలియలేదు.

విశ్రాంతి ఎక్కువైంది. యౌవనవంతుడైన రాజుకు ఆ అతి విశ్రాంతి చిరాకు కలిగించింది. అతనికి శౌర్యప్రతాపాలు ప్రదర్శింపవలసిన అవసరం కలగటంలేదు.

వ్యుషితాశ్వుడు ఉద్యానవన విహారానికి బయలుదేరాడు. అక్కడి వాతావరణం అతి ప్రశాంతంగా ఉంది. ఎడతెగకుండా రాజ్యపాలనలో నిమగ్నుడైన అతని మనసుకి ప్రకృతిని తిలకించే తీరిక లేకపోయింది ఇంతకాలం.

ఆ ఉద్యాన వనంలో ప్రవేశించిన అతని చెవులకి పక్షుల కిలకిలారావాలు స్వాగతవచనాల్లా వినిపించాయి. పక్షుల ప్రణయ సంభాషణలు వినాలనే కుతూహలంతో వాటిదిక్కే చూస్తూ అక్కడే నిలబడ్డాడు.

వాటి భాష తనకీ వస్తే? మహారాజుకి నవ్వొచ్చింది. ప్రకృతి సహజమైన శృంగారం సృష్టికి ఎంత అందాన్ని చేకూరుస్తుందో అనుకున్నాడు. ఆ జంటల క్రీడా విశేషాలను తిలకిస్తూ తన్మయత్వంతో.

ఆ వనంలో అడుగడుగు వేస్తుంటే అతని మనసు ఉద్రేక పూరితమైంది. సృష్టి రహస్యం మధురాతిమధురమైందని అతని మనసుకి మరొక్కసారి స్ఫురించింది

వ్యుషితాశ్వుడు నలుదిక్కుల రాజుల్ని గెలిచినపుడు, ఆ రాజులు కన్యలనెందరినో బహూకరించారు అతనికి. నిత్యం యుద్ధాల్లోమునిగిన అతను ఆ కన్యలపై దృష్టి కేంద్రీకరించలేకపోయాడు. మనసు పెంచుకోలేకపోయాడు.

అతని ఆలోచనలు అంతఃపురంవైపు మరలటంతో, ఉద్యానవనం నుంచి తిన్నగా అటు నడకసాగించాడు. అంతఃపుర కన్యలు ఎదురొచ్చి మహారాజుకు మర్యాదలు చేస్తుంటే వారందరినీ శ్రద్ధగా పరిశీలించిన అతను ఎలాంటి అనుభూతినీ పొందలేకపోయాడు. ఏ ఒక్క స్త్రీ కూడా అతని మనసుని దోచుకోలేకపోయింది. నిరాశతో వెనుదిరిగిన వ్యుషితాశ్వుడు తిరిగి మనశ్శాంతికోసం ఉద్యానవనం చేరాడు.

సంధ్యాకాంతుల్లో అక్కడి వృక్ష సంపదంతా పచ్చని, ఎర్రని కాంతులతో మిలమిలా మెరిసిపోతోంది.

పట్టపురాణి భద్రాదేవి చెలికత్తెలతో అచట విహరిస్తూ వ్యుషితాశ్వుని చూసింది. మహారాజును గమనించిన చెలికత్తెలు నిష్క్రమించారు.

అమిత సౌందర్యరాశి అయిన భద్రాదేవిపైన అయన చూపులు నిలిచాయి. సాయంసంధ్యాకాంతులు ఆమె సౌందర్యాన్ని మరింత ప్రస్ఫుటం చేశాయి. ఇంత వరకు రాజ్యపాలనే జీవితమనుకుని ఆమెని నిర్లక్ష్యం చేసినందుకు బాధపడ్డాడు ఆ క్షణంలో వ్యుషితాశ్వుడు.

ఆమెను సమీపించి కుశల ప్రశ్నలు వేస్తుంటే, అతని దృష్టి చెట్లపైనున్న పక్షుల జంటలపై బడింది. అప్రయత్నంగా భద్రాదేవి భుజంపైన చేయివేశాడు.

ఆమె చిరునవ్వుతో ఆయన ముఖం చూసింది. పక్షుల కిలకిలా రావాలు వింటూ, తన్మయత చెందుతున్న అతన్ని చూస్తుంటే భద్రాదేవికి నవ్వు ఆగలేదు. ఆమె కిలకిలలు ఆ ఉద్యానవనపక్షుల కిలకిలారావాలతో మేళవిస్తుంటే, వ్యుషితాశ్వుడు ఉద్రేకపరవశుడై ఆమెను కౌగిలిలోకి తీసుకున్నాడు. భద్రాదేవి అతని కౌగిలి నుంచి తప్పించుకుని, అంతఃపురానికి దారితీస్తుంటే ఆమెను అనుసరించాడు వ్యుషితాశ్వుడు.

భద్రాదేవి శరీర సౌందర్యం అతనికి విభ్రాంతిని కల్గించింది. ఆమె మాటలు, చేష్టలు, ఆమె ఆతనిపట్ల చూపిస్తున్న అవ్యాజానురాగం అతన్ని బద్ధుణ్ణి చేస్తున్నాయి. ఆమె సాంగత్యంలో తన్నుతాను మరిచిపోయాడు. ఆమె ప్రేమ అతన్ని ఉన్మత్తుణ్ణి చేస్తోంది. ఆమె ప్రేమతప్ప మరొక ప్రపంచం లేదనుకుంటూ అంతఃపురంలోనే అతను కాలం గడిపేస్తున్నాడు.

కాలాన్ని మరిచిపోయి ఏ కార్యక్రమంలో వుంటే, దాంట్లోనే నిమగ్నమై పోవటం అతని స్వభావం. రాజ్యకార్యభారాలు సక్రమంగా నిర్వర్తించిన అతని మనసు శృంగార సామ్రాజ్యాధిపత్యాన్ని అభిలషించటం ప్రారంభించింది. ఆ సామ్రాజ్యం అనంతమైందనిపించింది అతనికి.

దేశానికి ఎల్ల లుంటాయి. రాజ్యానికి పరిమితులుంటాయి. కానీ శృంగార సామ్రాజ్యానికి అవేవీ లేవని తలచిన వృషితాశ్వుడు ఆ శృంగార రసాస్వాదనా లోలుడై, రాత్రింబవళ్ళు భేదం గుర్తించే స్థితి దాటిపోయాడు. భద్రాదేవి అతని శృంగార దేవత అయిపోయింది. ఆ దేవతారాధనమే అతని జీవిత ధ్యేయమై పోయింది.

కానీ ప్రకృతి మితిమీరిన విషయలోలతను సహించలేదు. అతని శరీరం పరాజయం పొందింది. అతని రుగ్మతని క్షయగా గుర్తించారు వైద్యులు. ఎంతటి ఘనవైద్యునికైనా మహారాజుని ఆరోగ్యవంతుణ్ణి చేయటం సాధ్యంకాలేదు.

పరలోక గతుడు కానున్న వృషితాశ్వునిచూస్తే, జీవితమంతా శూన్యంగా బతకటం తనకు సాధ్యం కాదనిపించింది భద్రాదేవికి. ఇంతకాలం ఆ మహారాజు ప్రేమలో ఓలలాడిన తను ఇక ఒంటరిగా జీవించలేదనే భావం ఆమెని కంపింప చేసింది. జీవచ్ఛవంలా బతకటంకన్నా తనూ అతనితోబాటు మరణించాలని నిశ్చయించుకుంది.

కఠోరదీక్షాబద్ధురాలై దర్భశయనం ఏర్పాటు చేసుకుని, మృతుడైన వృషితాశ్వుని కౌగిలించుకుంది.

కానీ, యజ్ఞయాగాదులతో, నియమనిష్ఠలతో సద్గతికి సోపానం ఏర్పరచుకొన్న వృషితాశ్వుడు, భార్య కఠోరనియతిని ప్రదర్శిస్తుంటే ఆమెనుంచీ ప్రేమ బంధాలు తెంచుకు పరలోక యాత్ర సాగించటానికి మనసు రాలేదు.

వ్యుషితాశ్వుని శరీరం నుంచి దివ్యవాణి భద్రాదేవిని అనునయిస్తూ పలికింది:

"మరణం భౌతికం, నీపట్ల నా ప్రేమ నిత్యమైనది. నువ్వు అకాలమరణం కోరుకోవటం అధర్మం."

"నాథా, మీవల్ల నాకు పుత్రసంతానమైనా కల్గితే, వారిలో నీ ప్రతిరూపాన్ని చూసుకుంటూ జీవించగలను. లేకపోతే నాకు అకాలమరణమే శరణ్యం."

అనంతమైన పుణ్యసంపదలు, దైవబలం పొందిన వ్యుషితాశ్వుని మనసు కరిగింది.

భద్రాదేవి శృంగార రసాధినాథుడనై, సంతాన వాంఛను అలక్ష్యం చేశానని అతను పరితపించాడు.

"నా జీవితమంతా నీ ప్రేమతో బతికిన నేను, నీ కోరిక తీర్చటం ధర్మమే. నిన్ను మాతృమూర్తిని చేస్తాను."

భద్రాదేవి కన్నీళ్ళలో వెలుగురేఖ మెరిసింది.

"ఋతుమతివైన ఎనిమిదవనాడు వచ్చి నీ అభీష్టం తీరుస్తాను. ఆ తర్వాతే ఈ లోకాన్ని శాశ్వతంగా వీడి పరలోకం చేరతాను. నీ కఠోర దీక్ష విరమించు."

దైవబలసంపన్నుడైన వ్యుషితాశ్వుని ఆత్మ ఆమెయందే నిలిచింది.

అతను వాగ్దానం నిలబెట్టుకున్నాడు.

అతని ప్రేమ ఫలితంగా అతని ప్రతిబింబాల్లాటి కుమారులను కన్నది భద్రాదేవి.

వ్యుషితాశ్వునితో గడిపిన ప్రేమమయ జీవితాన్ని తల్చుకుంటూ, కుమారుల్లో అతని రూపంచూస్తూ, తన సమయ మాసన్నమయేవరకు కాలం గడిపింది *

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం:
ఆదిపర్వం : పంచమాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవార పత్రిక : 20-4-1988)

# హిడింబ

లాక్షా గృహ ప్రమాదం నుంచి తప్పించుకుని బయటపడ్డారు పాండవులు.

ఈ నిర్జనారణ్యంలో విశ్రమించే స్థలం కోసం, తాగే నీటి కోసం వెతుక్కుంటూ ఒక పెద్ద మర్రిచెట్టు నీడకు చేరారంతా. ఆకలిదప్పులు బాధిస్తుంటే, ఇక ముందడుగు వేయలేక ఆ చెట్టు నీడను ఆశ్రయించారు, ఒక్క భీమసేనుడు తప్ప.

ఘోరారణ్యంలో అందరిని ఆదుకోదగిన మహావీరుడు భీమసేనుడు. అక్కడి పరిస్థితిని పర్యాలోకిస్తున్నాడు. తల్లిని, సోదరుల్ని విశ్రమింపమని చెప్పి, వారి దప్పిక తీర్చటానికి నీళ్ళ కోసం బయలుదేరాడు.

అలా వెళ్ళగా వెళ్ళగా, తామర పుష్పాలతో కలకలలాడుతూ, సుగంధాలు వ్యాపింపజేస్తూ, శీతల వారిపూరమైన సరోవరం కనిపించింది భీమసేనునికి. తాను తృప్తిగా నీరు తాగి సేదతీర్చుకుని, తన వారికని పత్రపుటాల్లో నీరు నింపి తెచ్చాడు.

అప్పటికే చీకటి పడుతోంది. తల్లి, సోదరులు అలసి సొమ్మసిల్లి నిద్రిస్తున్నారు. వారికి నిద్రాభంగం కలిగించటం ఇష్టం లేక, వారి రక్షణ నిమిత్తమై అక్కడే నిలిచాడు. రాజప్రసాదాల్లో హంసతూలికా తల్పాలపైన నిద్రించవలసిన వీరంతా ఈ కటిక నేలపై, అరణ్య మధ్యంలో తమను తాము మరిచి నిద్రించటం భీమసేనునికి ఎంతో బాధనీ, ఆశ్చర్యాన్నీ కలిగించింది.

ప్రకృతి సౌందర్యాన్ని వీక్షిస్తూ, భవిష్యత్తు గురించి ఆలోచనలు చేస్తున్న భీమసేను దృష్టి తననే తదేకంగా చూస్తూ చెట్టు చాటున దాగివున్న స్త్రీమూర్తి పైన నిలిచింది.

అది భ్రమా, నిజమా-వృక్షం వెనక దాగి ఉండబట్టి ఆమె శరీరం పూర్తిగా కనబడటం లేదు. ఆమె ముఖం ముందుకు పెట్టి నిలకడగా చూస్తోంది. విశాలమైన నేత్రాలు, నల్లని పొడవైన కేశపాశం, ఆమె ధరించిన మణిమయ

హారాలు, ఆమె ముంజేతి రత్నకంకణాలు, ఆమె దేహం నుంచి వెలువడుతున్న వింతకాంతి—భీమసేనునికి ఆశ్చర్యం కలిగిస్తున్నాయి.

తన వారిని రక్షించాలని మెలకువగా ఉన్న తను స్వప్నం కంటున్నాడా అనే అనుమానం వచ్చింది వాయునందనునికి. ఆ సౌందర్యరాశి నెమ్మదిగా కదులుతూన్నట్టనిపించింది.

చెట్టు చాటు నుంచి కదిలి మందగమనంతో తనని సమీపిస్తుంటే భీమసేనునికి ఏమీ అర్థం కావటం లేదు.

సామాన్య స్త్రీల కంటే భిన్నంగా, విలక్షణంగా ఆ అవయవాల సొంపు, ఆ నడకలో వయ్యారం, భీమసేనుని వైపు ఆమె ప్రసరించే చూపులు అతనికి విచిత్రంగానే కనిపిస్తున్నాయి.

భీమసేనుని విశాల వక్షస్థలం పైన, అతని దీర్ఘబాహువులపైన, అతని బిగువైన కంఠం పైన, విశాలమైన ఫాలభాగం పైన ఆమె దృష్టి సారించి, విలాసంగా అతని పక్కన నిలవగానే అతనికి చిరాకు కలిగింది.

కార్యదీక్షతో కీకారణ్య మధ్యంలో ఉన్న భీమసేనుణ్ణి ఆ సౌందర్యరాశి ఏ విధంగానూ చలింపచేయలేకపోయింది.

"ఎవరు నువ్వు? స్త్రీలు ఒంటరిగా తిరిగే సమయమా ఇది? ఈ కీకారణ్యంలో కెందుకొచ్చావ్? త్వరగా కదులు."

భీమసేనుడు ఆమెను కసురుతుంటే, ఆమె ఏ పాటి నిరుత్సాహపడలేదు. అవమానపడలేదు.

భీమసేనుని శరీర సౌందర్యం నేత్రానందం కల్గిస్తోందామెకు. ఆమెలో మదన పరవశత్వం క్షణక్షణం పెరుగుతోంది. అతని విశాల వక్షస్థలం వైపు చూస్తూ "ఈ వనాధిపతి హిడింబాసురుడు నా అన్న. నరమాంస మపేక్షించి మిమ్మల్నందరిని తీసుకురమ్మని నన్ను పంపాడు. కానీ, నిన్ను చూసిన క్షణమే నా మనసు నీతో నిండిపోయింది. నన్ను నీవు చేపడితే, నేను మా అన్న నుండి కాపాడుతా." క్రీగంట చూస్తోంది హిడింబ.

ఆ మాటలకు నిశ్చేష్టుడయ్యాడు భీమసేనుడు. కానీ వెంటనే క్రోధావేశం అతన్ని ఊపేసింది. ఒక స్త్రీ తన అన్న పేరు చెప్పి తనని బెదిరించటమా? తనను కాపాడుతా ననటమా? భీమసేను డది సహించలేకపోయాడు.

"నా అన్నని గెలవ గలిగిన వాడెవడూ లేడు. ఇంద్రాదులైనా నా అన్న పేరు చెప్తే బెదిరిపోవాల్సిందే. నీ మీద ప్రేమ కొద్దీ నా అన్నకి వ్యతిరేకంగా నీకు సహాయం చేస్తానన్నాను. వీరంతా సొంత ఇంట్లో నిద్రించినట్లు నిద్రిస్తు న్నారే- మా అన్న తల్చుకుంటే అంతా శాశ్వత నిద్రపోవచ్చు. కానీ నీ మీద ప్రేమతో వారిని నా అన్న కప్పగించి, నిన్ను రక్షించుకుంటా."

హిడింబ మాటలు భీమసేనుని రౌద్రాకారుణ్ణి చేశాయి.

"ఆ నిద్రిస్తున్న వారు నా తల్లీ, సోదరులు."

"అయ్యో, అయితే వారందరినీ ఈ అరణ్యం నుంచి దాటించి రక్షిస్తా." హిడింబి చిరునవ్వు నవ్వింది.

"నా ప్రేమను కాదనకు." బతిమాలుతోంది.

"స్త్రీ వ్యామోహంలో పడి కర్తవ్యాన్ని విస్మరించే మూర్ఖుణ్ణి కాను, నా వారిని నేను రక్షించుకోగలను, తక్షణం ఇక్కడ నుంచి కదులు. నీ అన్న నన్ను ఏమీ చేయలేడు, పో!"

భీమసేనుని అరుణారుణ నేత్రాలను చూసి భయపడింది హిడింబ.

తన చెల్లెలు ఇంత ఆలసించటాన్ని సహించలేక సింహగర్జన చేస్తూ నల్లని పెద్ద మేఘంలా ముందుకు తోసుకొచ్చాడు హిడింబుడు.

బహుసుందరమైన స్త్రీ రూపం దాల్చి, ఒక నరునితో ముచ్చటిస్తూ, అతని చెంత నిల్చిన హిడింబను చూడగానే హిడింబుని ఆగ్రహం కట్టలు తెంచు కుంది. తనకు కీడు తలపెట్టిన ఆమెను అంతం చేయాలనే ఆవేశంతో ఆమె పైకి ఉరికాడు. భయంతో గజగజలాడుతూ భీమసేనుని వెనక దాగింది హిడింబ.

తన వారికి నిద్రాభంగ మౌతుందని, హిడింబుని దూరంగా లాక్కు పోయాడు భీమసేనుడు.

యుద్ధం జరుగుతోంది. హిడింబుడు పెట్టిన పెద్ద కేకలకి నిద్ర భంగమై లేచిన కుంతీదేవి, దగ్గరున్న విలాసవతిని చూసింది భయంతో, ఆశ్చర్యంతో.

"ఎవరు నువ్వు?" అంది అనుమానంగా ఆమెను చూస్తూ.

"ఆ మహావీరునితో మల్లయుద్ధం చేస్తున్న హిడింబాసురుని చెల్లెల్ని" అంటూ సవినయంగా విషయమంతా చెప్పి, "ఆ మహావీరుని సౌందర్యానికి,

పరాక్రమానికి నా మనసు పరవశిస్తోంది. అతన్ని చూసిన మరుక్షణమే నా మనసు అతనికి అంకితం చేశాను. ఆ మహావీరుణ్ణి ప్రేమిస్తున్నాను." ఈ మాట అంటూ హిడింబ సిగ్గుతో తలవంచింది.

కుంతీదేవికి ఆమె మాటలు చిత్రంగా వినిపిస్తున్నాయి. తన కుమారుని పరాక్రమానికి మనసిచ్చి వచ్చిన ఆమెను చూస్తుంటే అప్రయత్నంగా కుంతికి ఆనందం కలిగింది. హిడింబ మనసువిప్పి మాట్లాడుతుంటే ఎంతో ముచ్చటేసింది.

"నాకు కామ విద్యలొచ్చు. మీ ఎవరికీ ఏ ఆపదా రాకుండా నేను కాపాడ గలను. నన్ను విశ్వసించండి. నీ కుమారుడిపై ప్రేమతో నా అన్న ఆజ్ఞని నెర వేర్చలేకపోయాను. నీ కుమారుడి మీది ప్రేమతో మిమ్మల్నందర్నీ కాపాడుతాను.'

హిడింబ మాటలు కుంతి మనసుని చలింపజేస్తున్నాయి.

"నన్ను భార్యగా స్వీకరించమని నీ కుమారుడికి చెప్పు." కుంతి పాదా లకు మొక్కింది హిడింబ.

యుద్ధం ఘోరంగా సాగుతోంది. రాక్షస మాయలు, యుద్ధ విద్యలు తెలి సిన అర్జునుడు భీమసేనుణ్ణి సమీపించాడు. సంధ్యాసమయంలో రాక్షసుల బలం అనంతంగా విజృంభిస్తుంది. ప్రాతస్సంధ్యాకాంతులు రాక ముందే హిడింబుని హతమార్చమని తొందరచేశాడు భీమసేనుణ్ణి అర్జునుడు.

అర్జునుని మాటలు పాటించి, మహోగ్రరూపంతో వీరావేశంతో హిడింబా సురుణ్ణి సంహరించాడు భీమసేనుడు.

భీమసేనుని విజయాన్ని తల్లి, సోదరులు అభినందిస్తుంటే, మందగమ నంతో వారిని అనుసరించింది హిడింబ.

ఆమె తనను మనసారా కోరుకుంటున్నదని అర్థమైంది భీమసేనునికి. కానీ, రాక్షసుల పగలు తరతరాలు వెంటాడుతాయి. రాక్షసమాయలు నమ్మరానివి.

వెంటనే హిడింబను తన వారితో రావద్దని వారించాడు. హిడింబ బేల చూపులతో కుంతివైపు చూసింది.

"నీ కుమారుడు నన్ను స్వీకరించకపోతే, ఇక్కడే ఈ అరణ్యంలో ప్రాణత్యాగం చేస్తాను." నెమ్మదిగా, గాద్గదికంగా అంది హిడింబ కుంతితో.

'నిజంగానే నా కుమారుణ్ణి ప్రేమిస్తోంది. ఆ ప్రేమ సఫలం కాకపోతే ప్రాణత్యాగం చేస్తుంది' అనుకుంటూ కుంతి సాదరంగా ఆమెను చూసింది.

కుంతి మనసు కరిగింది. హిడింబ చేయి పట్టుకుని భీమసేనుడి దగ్గరకొచ్చింది. అప్పటికే ధర్మరాజుకు హిడింబపైన సదభిప్రాయం కలిగింది. అందరికీ ఆమెపైన జాలి కలిగింది. భీమసేనుని కోసం తన సోదరుని పోగొట్టుకుని తమతో వచ్చిన హిడింబకు అన్యాయం జరగరాదని అందరికీ అనిపించింది.

తల్లి, సోదరుల మనోభావం గ్రహించాడు భీముడు. సర్వమూ త్యాగం చేసి తన ప్రేమకని ఎదురొస్తున్న హిడింబపై భీమసేనునికి ఆదరం కలిగింది. ఆ నిర్మలమైన ప్రేమ అతని మనసుని తాకింది. కానీ, రాజకీయ పరిస్థితులు, తన కుటుంబ పరిస్థితులు అతని మనసు నుండి తొలగిపోవటం లేదు దీర్ఘంగా ఆలోచించాడు భీమసేనుడు.

"సంతానం కలిగేవరకే ఈమెతో నా సాంగత్యం" అంటూ భీమసేనుడు ముందుకు నడిచి, హిడింబను సమీపించి, ఆమె పాణిగ్రహణం చేశాడు.

ఆ కరస్పర్శకి పులకితురాలై, ఆ మహావీరుని వల్ల జన్మించే పుత్రుణ్ణి ఊహించుకుంటూ మురిసిపోయింది హిడింబ.

కుంతీదేవి వారిని చూస్తూ మహదానందం చెందింది. హిడింబ వైపు తిరిగి అనునయంతో, "మీరు ఈ అరణ్య భూముల్లో, కొండ కోనల్లో, ఇసుక తిన్నెల మీద, సరోవర తీరాల్లో యథేచ్ఛగా విహరించండి పగలంతా - కానీ రాత్రి నువ్వు మాకు రక్షణగా మా దగ్గరే ఉండాలి" అంది.

కుంతీదేవి మాటలు తనకు అంగీకారమే అన్నట్టుగా తల ఊపి, పాదాభివందనం చేసింది హిడింబ. *

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం : ఆదిపర్వం : షష్ఠాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 27-4-1938)

# ఊర్వశి

పరమేశ్వరుడు భక్తుల కోర్కెలు సులభంగా తీరుస్తాడని ముల్లోక వాసులకూ తెలిసిందే. ముక్కంటి బోళాశంకరు డనే ప్రతీతి. అయినా ఏ భక్తుడికీ పాశుపతాస్త్రాన్ని ప్రసాదించలేదు. ఆ అస్త్రాన్ని తల్చుకుంటేనే, ఆ అస్త్రం శక్తి యుక్తుల్ని భావిస్తేనే భయాందోళనలు కలుగుతాయి అందరికీ. ఇంద్ర, వరుణ, కుబేరాది దేవతలే ఆ అస్త్రాన్ని సంపాదించలేకపోయారు.

అర్జునుడు పాశుపతాస్త్రాన్ని సంపాదించాడని విన్న దేవలోక వాసులకు ఆశ్చర్యం, భయం కలిగాయి. ఆ భయంతో పాటు అర్జునుని పట్ల అమితమైన భక్తి గౌరవాలు పెరిగిపోయాయి. ఈశ్వర సాక్షాత్కారం పొంది, అపూర్వమైన పాశుపతాస్త్రాన్ని సంపాదించిన మహావీరుణ్ణి దర్శించాలనీ, స్నేహ సంబంధాలు పెంచుకోవాలనీ దేవలోక వాసు లెంతో తహతహలాడిపోయారు.

దేవేంద్రుడు వరుణ, కుబేర, యమధర్మరాజాదులతోనూ, ఇతర దేవతా గణాలతోనూ కలసి అర్జునుణ్ణి చూడటానికి భూలోకాని కేతెంచాడు. తన అంశతో జన్మించి, మహావీరుడై, శౌర్యధనుడైన అర్జునుని చూస్తుంటే స్వర్గాధిపతి మనసు ఆనందవీచికలో తేలిపోయింది.

అర్జునుడు ఇంద్రాది దేవతలను సాదరంగా ఆహ్వానించి, ఇంద్రునకు పాదాభివందనం చేశాడు.

"పృథాకుమారా! ఈశ్వర కటాక్షంతో పాశుపతం సంపాదించిన నిన్ను అభినందించటానికే స్వర్గం నుంచి దిగి ఇక్కడ కొచ్చాను. దేవలోక వాసులందరూ నిన్ను చూడాలనే కుతూహలంతో ఉన్నారు. నిన్ను అమరావతికి ఆహ్వానిస్తున్నాను. నా దివ్యరథాన్ని పంపుతాను."

ఇంద్రుని మాటలను అర్జునుడు వినమ్రుడై ఆలకించాడు. ఆ శుభసమయంలో వరుణాది దేవతలంతా అక్షయకీర్తి సాధనాలైన పెక్కు అస్త్రాలు బహూకరించారు.

దివ్య పురుషత్వం సాధించిన అర్జునుడు గంగానదీ స్నానం చేసి, నిత్యానుష్ఠానం పూర్తి చేసుకుని, దేవేంద్రుడు పంపిన దివ్యరథారూఢుడై అమరావతికి ప్రయాణం సాగించాడు.

స్వర్గాధిపతి ఇంద్రుడు మహావీరుడైన అర్జునుని ఆహ్వానించాడన్న వార్త అమరావతీ వాసులకి మహోల్లాసాన్ని చేకూర్చింది. అందరి నోటి వెంట అర్జున పాశుపతాస్త్ర సాధన విశేషాలే! ఎవరి నోట విన్నా అర్జునుని రూపసౌందర్య వర్ణనలే! శౌర్యప్రతాప కీర్తనలే!

అప్సరోభామినుల ఆనందానికి అవధులు లేవు. అందరికీ అర్జునుడంటే గౌరవాభిమానాలు పెరిగిపోయాయి.

అర్జునుని గురించి చెప్పుకునే ప్రతి మాటని అమృతబిందువుల్లా ఆస్వాదిస్తోంది అప్సరో శిరోమణి ఊర్వశి. ఇంద్రలోకంలో ఎందరో మహర్షులను, రాజర్షులను, యజ్ఞయాగాది కర్మలు నిర్వర్తించి అపార తపోధనులైన మహనీయులను ఎందరెందరినో చూసింది. వారి గురించి ఎంతగానో వింది. కానీ, ప్రతిభా విశేషాలు, సౌందర్య విలాసాలు, దైవబలం, ఈశ్వర కటాక్షం మొదలైనవన్నీ ఉన్న అర్జునుడు మర్త్యలోకవాసి కావటం ఊర్వశికి కొత్త ఊహల్ని కొత్త భావాల్ని మనసులో కలిగించింది. అర్జునుని ఊహాచిత్రం ఆమె మనసులో ముద్ర పడింది. అమరావతీ వాసు లందరికన్నా ఎక్కువగా అర్జునుని రాకకోసం ఎదురుచూస్తున్నది అసమాన సౌందర్యరాశి ఊర్వశి.

అర్జునుడు అమరావతిలో అడుగు పెట్టగానే, కనీ వినీ ఎరుగని స్వాగతోత్సవాలతో ఎదురొచ్చి ఆహ్వానించాడు స్వర్గాధిపతి ఇంద్రుడు. గాఢాలింగనం చేసుకున్నాడు. తన ఆసనంపైన అర్జునుణ్ణి కూచోపెట్టుకున్నాడు. ఇంద్ర సింహాసనాన్ని అలంకరించిన అర్జునుణ్ణి చూస్తుంటే దేవతాగణాలకే ఆశ్చర్యం కలిగింది. అర్జునుడు మరో ఇంద్రునిలా భాసిస్తుంటే అప్సరోభామినులంతా ఆనందంతో పరవశించారు.

సభాకార్యక్రమమయిన తరువాత, తనకని ఏర్పాటుచేసిన మణిమందిరమైన విశ్రాంతి భవనం చేరాడు అర్జునుడు. అప్సరోగణం, యక్ష కిన్నర గంధర్వులు అమర సంగీత వాద్య, నృత్య విశేషాలతో అర్జునుని అలరించారు. సంధ్యాసమయమవుతుంటే ఎక్కడి వారక్కడ నిష్క్రమించారు.

చంద్రోదయమయింది. ప్రశాంత వాతావరణం అర్జునుని మనసుకి ఆహ్లాదజనకంగా ఉంది. అమరావతికి రాగలిగిన తన పుణ్య విశేషాన్ని తల్చుకుని, పాశుపతాస్త్ర సంపాదన భాగ్యాన్ని తల్చుకుని పరవశిస్తున్నాడు మహా వీరుడు అర్జునుడు.

అర్జునుని వీరగాథలు, రూపరేఖలు నారదుని నోట విన్న ఊర్వశి ఏనాటి నుంచో అతన్ని ఊహించుకుంటూనే ఉంది. కానీ ఈనాడు ఇంద్రసభలో మరో ఇంద్రునిలా కనిపించిన అర్జునుని రూపం తన ఊహకు కొన్నివేల రెట్లు మిన్నగా ఉంది. ఊర్వశి మనసు చలించింది. ఇంద్రుని పక్కనున్న అర్జునుని పైన నిల్పిన ఆమె చూపులు ఇప్పటికీ వెనక్కి మరలటం లేదు. అతని పొందు కోసం తహతహలాడుతున్న ఊర్వశి ఏకాంతంగా అతన్ని సమీపించటానికి సమయంకోసం ఎదురుచూస్తోంది.

ఎటుచూసినా వెన్నెలే. మన్మథ పరవశురాలైన ఊర్వశి అర్జునుని సాంగత్యం కోరి వేగంగా మణిమందిరం చేరాలని తలచింది.

చంద్రుని వెన్నెల వస్త్రాన్ని ధరించింది. కస్తూరిని శరీరానికి పూసుకొంది. నల్లని కేశపాశంలో సుగంధ కుసుమాలు అలంకరించుకుంది. మణిమయ భూషణాలు సవరించుకుంది. కాలి గజ్జెల రవళులు, చేతి కంకణాల గలగలలూ కలిసి మధురంగా వినిపిస్తుంటే, మెరుపుతీగలా ప్రకాశిస్తూ, అర్జునుని మందిరంలో అడుగు పెట్టింది అప్సరోభామిని ఊర్వశి.

వెంటనే ఆమెను గుర్తించాడు అర్జునుడు, ఆ అసమాన సౌందర్య మూర్తిని ఊర్వశిని.

"జననీ, పుత్రవాత్సల్యంతో నన్ను చూడటానికి వచ్చినందుకు ధన్యవాడాలు!" అర్జునుడు ఊర్వశి పాదాలకు అభివాదనం చేశాడు.

ఊర్వశి నివ్వెరపోయింది. ఆ మాటలు ఆమెకు బాణాల్లా తగిలాయి. అర్జునుని సంబోధన ఆమె చెవుల్లో మారుమోగింది. కానీ, అర్జునుడు తన మనసు తెలుసుకోలేక అలా అని ఉంటాడని సమాధానపర్చుకుంది.

"అర్జునా, నీ కీర్తి ప్రఖ్యాతులు ఏనాడో విన్నాను. నీ రూపరేఖా సౌందర్యాలూ విన్నాను. నేడు ప్రత్యక్షంగా కన్నాను. నా మనసు నీమీద లగ్నమయింది. నా వలపు దాచుకోలేను. అనుక్షణం నీ పొందుకోరుతున్న నా అభి

లాష తీర్చు. నా భావోద్రేకం నన్ను ఒంటరిగా నిలవనీయక నీ చెంత చేర్చింది. ఇప్పటికి నా మనసు తెలిసిందిగా?"

ఊర్వశి క్రీగంట చూస్తోంది. అర్జునుని సౌందర్యాన్ని నేత్రాంతో ఆస్వాదిస్తోంది.

అతని ముఖంలో ప్రసన్నత మాయమైంది. చూపుల్లో నిశితత్వం చోటు చేసుకుంది.

"జననీ అని సంభోధించటం నీకు తగదు." ఊర్వశి గొంతు అర్జునుని కలవరపరిచింది.

"నేను ధర్మమే పల్కాను. మావంశకర్తయైన పురూరవునకు భార్యగా వ్యవహరించావు నీవు. నా తండ్రియైన దేవేంద్రునికి పరిచర్యలుచేస్తూ, ప్రియురాలిగా ఉన్నావు. అందుచేత నువ్వు నాకు మాతృస్థానీయురాలివే అందుకే మరి 'జననీ' అన్నాను."

అర్జునుని వాక్కులు గంభీరంగా వినిపిస్తూంటే ఊర్వశి చమత్కారంగా నవ్వింది.

"నీకు తల్లి నెట్లా అయ్యాను? మీ మర్త్యలోకపు పోకడలు మరిచిపో. మర్త్యలోకపు వావివరుసలు మాకు లేవు. మేము నిత్యయౌవనులం. ఇక్కడ ఇతర సంబంధాలు లేవు. మర్త్యలోకపు ధర్మాలు ఇక్కడ చెల్లవు... నువ్వు దివ్యపురుషత్వం పొంది, స్వర్గాని కొచ్చాక మా ధర్మాలే పాటించాలి. తెలుసా? ఇది తప్పు కాదు, పాపం కాదు. ఇది దేవలోకం, ఇది స్వర్గం."

ఊర్వశి చూపులు అర్జునుని ముఖంపైన నిల్చాయి. త్రిలోకాలలో తన పొందు కోరని పురుషుడే లేడనే గర్వం ఉన్న ఊర్వశి కళ్ళలో, ఉన్నట్టుండి అగ్నిజ్వాలలు లేచాయి. నిర్వికారంగా ఉన్న అర్జునుని చూస్తుంటే ఊర్వశి ఆవేశం కట్టలు తెంచుకుంటూంది. అప్సరసల సౌందర్యాన్నంతా మించి ఉండాలని తనని ప్రత్యేకంగా సౌందర్యరాశిలా సృష్టించాడు నారాయణ మహర్షి ఆనాడు. ఈనాడు ఈ నరుడు తన సౌందర్యాన్ని, తన కోరికని తిరస్కరించటమా?

ఊర్వశి సొగసు కాని, ప్రలోభపరిచే అవయవ విన్యాసం కాని, శరీర ఛ్ఛాయ కానీ, ఆమె దివ్యాంబరాభరణాలు కానీ, ఏవీ అర్జునునికి వికారం కలిగించడంలేదు.

ప్రశాంతచిత్తుడై, నిర్మల మనస్కుడై అచంచల భక్తి గౌరవాలతో ఊర్వశిని చూస్తూ, "కర్మభూమిని జన్మించి, కర్మబద్ధుడనైన నాకు ఇచ్చటి ఆచారాలతో పనిలేదు ... నన్ను క్షమించు తల్లీ!" అని ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

ఊర్వశి నిరాశ, అవమానం, కోపం ఆవేశాలతో ఊగిపోతూ, ఉగ్ర రూపం దాల్చింది.

"నాకు నిరాశ కల్గించటమేకాక, తల్లీ అని నన్ను సంబోధించి అవమాన పర్చావు, నా మనసుని బాధించావు. నీ మర్త్యలోకంలో స్త్రీ జనాలమధ్య అవమానితుడవై, నపుంసకుడవై జీవించు!"

ఊర్వశి మధురాతి మధురమైన సుస్వరం ఆ క్షణాన అశనిపాతమైంది అర్జునునికి.

ప్రభాతమైంది. ఊర్వశి శాపం ఇంద్రునికి తెలిసిన క్షణం నిశ్చేష్టు డయ్యాడు. అర్జునుని సచ్ఛీలతకి, నిగ్రహానికి దేవేంద్రుడు చాలా ఆనందించాడు. తాత్కాలిక ఆవేశంతో శపించినా ఊర్వశి పశ్చాత్తప్తురాలు కాదా? - ఇంద్రుడు వెంటనే అర్జునుని మందిరానికొచ్చాడు.

"నీమీది ప్రేమ విఫలమైందనే కోపంతో ఊర్వశి ఇచ్చిన ఈ శాపం నీకు వరమే అవుతుంది."

అర్జునుని కళ్ళలో చిన్న మెరుపు నిలిచింది.

"నిజమే! అజ్ఞాతవాస సమయంలో నిన్ను ఈ శాపమే కాపాడుతుంది. ఆ ఒక్క సంవత్సరమే ఈ శాపప్రభావం." కుమారుని గాఢంగా కౌగలించు కున్నాడు ఇంద్రుడు.

అర్జునుని మనసు తేలికపడింది. ప్రేమతో ఇచ్చే శాపం కొన్ని సందర్భాలలో వరమవుతుంది కాబోలు!

మహావీరుడు అర్జునుడు దేవేంద్రుని పాదాలు ఆనంద బాష్పాలతో అభిషేకించాడు. *

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం: అరణ్య పర్వం : తృతీయాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 4-5-1988)

# పరీక్షిత్తు

అయోధ్యను పాలించే సూర్యవంశపు రాజు పరీక్షిత్తు పరిపాలనాదక్షుడు, ప్రజారంజకుడు.

సమీపారణ్యాలలో మృగయావినోదుడై సంచరించటం అతనికి అలవాటు.

ఒకసారి తను స్వారీ చేయనున్న గుర్రాన్ని చూశాడు పరీక్షిత్తు. బాగా బలిసి, నిగ నిగలాడుతోంది. దుర్గమారణ్యాలలో ఎంత వేగంగా అది పరుగెత్త గలదో-అతనికి అనుభవంలో ఉన్న విషయమే.

ఆ అరణ్య ప్రాంతమంతా వేగంగా దూకుతూ గుర్రం పరుగెడుతుంటే, అతని మనసు అంతకన్నా వేగంగా ముందుకు పరుగులు తీసింది. అమితోత్సాహంతో తన విజయానికి ఎదురు లేనట్లుగా, ఎన్నో క్రూర మృగాల్ని వేటాడి, వేటాడి సాంద్రారణ్య మధ్యంలో వృక్షచ్ఛాయన విశ్రాంతి తీసుకుంటున్నాడు పరీక్షిన్మహారాజు.

గుర్రాన్ని చెట్టుకు కట్టి ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తున్న మహారాజు తన కళ్ళను తాను నమ్మలేకపోయాడు. సమీపంలో ఉన్న పొదరింటి వైపు నుంచి చూపు మరల్చుకోలేకపోయాడు.

అపురూప లావణ్యవతి సుగంధాలు వెదజల్లే పూలను ఏరి ఏరి కోస్తోంది. పొదరింటి నుంచి తుమ్మెదల ఝంకారం మధురంగా వినిపిస్తోంది. ఆమె ఒక్కొ అడుగు ఎంతో వయ్యారంగా ముందుకు వేస్తోంది.

ఆ ప్రాంతంలో పూల మధ్య పూలలో పూవై, తీగల్లో తీగై కలిసిపోయిం దా లావణ్యవతి.

పరీక్షిత్తు ఆమెను ఆ పాదమస్తకం పరిశీలిస్తున్నాడు. ఈ కీకారణ్యంలో ఒంటరిగా ఈ స్త్రీ ఎందుకు సంచరిస్తోందో అర్థం కాలేదు. ఆమె సౌందర్యం అతన్ని అనిమిషుణ్ణి చేస్తోంది. మన్మథ ప్రేరణతో మహారాజు ఆమెవైపు అడుగులు వేశాడు.

ఆమె ఆ మహారాజు రూపానికి విస్తుపోతోంది. అతని ముఖంలో రాజఠీవి, నడకలో హుందాతనం, చూపుల్లో వాడితనం ఆమెను అక్కడినుండి కదలనీయ కుండా బంధించాయి.

ఆమె అతన్ని క్రీగంట చూస్తోంది. మరు నిముషంలో అతని చూపుల్లో చూపులు నిలిపింది. ఆమె చూపే చొరవకి, ఆమెలోని ఆకర్షణకి అర్థం తెలుసు కోలేకపోతున్నాడు పరీక్షిత్తు. స్త్రీ సహజంగా కనబరిచే సిగ్గు కనపర్చకపోగా, కళ్ళతో మహారాజును కవ్విస్తుంటే, చిత్రమైన అనుభూతి కలిగింది అతనికి.

''ఎవరిదానవు? ఈ అరణ్యంలో ఒంటరిగా సంచరిస్తున్నా వెందుకు?''-పరీక్షిత్తు ఆమెను సమీపించి ప్రశ్నించాడు.

ఆమె కిల కిలా నవ్వింది. ఆ నవ్వుకి అతని హృదయవీణ తంత్రులు మీటినట్లే అనిపించింది. అలా నవ్వుతూంటే ఆమె చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి. ఆమె ఎర్రని పెదవులు మరీ మనోహరంగా కనిపించాయి. ఆమె నుదుట పడు తున్న ముంగురులు సరిచేసుకుంటూ మహారాజు వంక చూసింది.

''నా తండ్రి అనుమతిపై నేను వరాన్వేషణ కోసం తిరుగుతున్నాను.'' ఆమె అతని వంక రెప్ప వాల్చకుండా చూస్తోంది.

ఈ మాట పరీక్షిత్తుకు మరీ ఆశ్చరాన్ని కలిగించింది.

''వరాన్వేషణమా?''

''అవును-వరాన్వేషణమే. నేను ఎవరిదాన నవుతానో, ఏమో మరి!'' ఆమె కవ్వింపు మాటలు, చేష్టలు మహారాజుకి మతి పోగొడుతున్నాయి. ప్రగల్భ వచనాలు పలుకుతూ ఆమె నల్లని వాల్జడను ముందుకు వేసుకుంది. గుండ్రటి కళ్ళు తిప్పుతూ ''నేను ఎవరిదాన నవుతానో?'' అంది రెట్టిస్తూ పరీక్షిత్తును చూస్తూ.

ఆమె చూపుల్లో కొంటెతనముంది. ముగ్ధమనోహరత్వముంది. ఆ చూపుల్లో ప్రేమ సంకేత ముంది. అనిర్వచనీయమైన ఆరాధన ఉంది. పరీక్షిత్తు ఆమె వలపు వలలో చిక్కుకుపోయాడు. ఈమె తన హృదయేశ్వరి అయితే ఎంత భాగ్యం తనకి లభించినట్లో అని ఊహించుకుంటూ-

''నీవు చేస్తున్న వరాన్వేషణకి ఇక ముగింపు పాడచ్చుగా?'' అన్నాడు.

ఆ మాటకి తల వంచి చిరునవ్వు నవ్వింది.

పరీక్షిత్తు తన ప్రేమను దాచుకోలేక చెప్పేశాడు.

ఆమె అతని వంక తిరిగి "నిన్ను వరిస్తాను...కానీ-"

"కానీ? చెప్పు"-పరీక్షిత్తు తొందర చేశాడు.

"నన్ను ఎప్పుడూ నీతో జలక్రీడ లాడమని కోరకూడదు."

"ఓ ఇంతేనా? నీకు ఇష్టం లేని పని ఏదీ నీచేత చేయించను."

సుశోభన ప్రేమానురాగాలతో తన జీవితం తరిస్తుందని ఆనందపరవశు డవుతూ, ఆమెను తోడ్కొని పురానికి చేరాడు పరీక్షిత్తు

ఆ పురవాసులంతా సుశోభనా పరీక్షిత్తుల వివాహ వేడుకలు వైభవో పేతంగా జరుపుకున్నారు.

కాలం గడుస్తోంది. అన్యోన్యానురాగంతో రాజదంపతుల వైవాహిక జీవితం మధురాతి మధురంగా గడిచిపోతోంది.

తటాక తీరంలో, ఉద్యానవన ప్రాంతాన రాజప్రసాదం నిర్మించుకున్నాడు పరీక్షిత్తు. తన భార్య శోభనతో ఆ ఉద్యాన విహారం చేస్తూ, లౌకిక తాపత్రయాలను విస్మరించాడు.

ఆనాడు కొలనులో దిగిన మహారాజు ఎంతోసేపు ఆ నీటిలో మునిగి శరీరానికి పట్టిన స్వేద బాధను తొలగించుకున్నాడు. తనతోబాటు తన భార్యా ఈ కొలనులో దిగి స్నానం చేస్తే ఆమె శరీరానికి విశ్రాంతి కలుతుందని క్షణం క్షణం అతని కనిపించింది.

ఆ కొలనులో నీరు అతి చల్లగా ఉంది. అతనికి మహానందాన్ని కలిగించింది. కొలను గట్టున నిలబడి భర్తను చూస్తోంది సుశోభన. కొలనులో దిగి జలక్రీడ లాడమని ఆమెని కోరాడు ఉత్సాహంగా.

మందస్మితం ఆమె పెదాలపై నిల్చింది. ఒక్క క్షణం అలా నిల్చుని, వెంటనే కొలనులో దిగింది సుశోభన.

కొలనులో దిగిన మరు నిముషంలోనే ఆమె అదృశ్యమైంది. పరీక్షిత్తు ఆమె కోసం ఎంతో వెతికాడు. కానీ ఆమె జాడలేదు.

ఈ విపత్సంఘటనతో భార్యావియోగాన్ని భరించలేక కృశించి పోయాడు పరీక్షిత్తు.

కొలనంతా గాలింపించాడు సుశోభన జాడలేదు. కొలనులోని నీరంతా తోడించాడు. ఆ కొలను నుంచి కప్పలు బయటపడ్డాయి. ఈ కప్పలు భార్యని తినేసి ఉంటాయనే భావంతో, పరీక్షిత్తు మనసు దుఃఖపడింది.

తన ప్రేయసిని మింగిన కప్పలను, ఎక్కడెక్కడున్నా వెతికి చంపండని ఆజ్ఞాపించాడు పరీక్షిత్తు. రాజాజ్ఞను శిరసావహించారు రాజ సేవకులు.

రోజులు గడుస్తున్నాయి.

విచారగ్రస్తుడైన పరీక్షిత్తు ఎదుట మహాతపస్వి నిలిచాడు ఒకనాడు.

"కప్పలపై ఎందుకు కోపం?" గంభీరంగా వినిపించింది ఆ తాపసి గొంతు పరీక్షిత్తుకు.

"అవును-కోపమే. నా భార్యను మింగిన కప్పలు ఎక్కడున్నా చావవలసిందే!" పరీక్షిత్తు గొంతులో గాద్గద్యం నిండింది.

తాపసి మనసు కరిగింది.

"ప్రభూ, సుశోభన తండ్రిని నేను. మండూక రాజును-" పరీక్షిత్తు ఒక్కసారి ఆనందోత్సాహాలతో ఉక్కిరి బిక్కిరయ్యాడు.

"అయ్యా, నా సుశోభనను నా కిప్పించండి!" వేడుకొన్నాడు పరీక్షిత్తు.

తాపసి తలుచుకోగానే సుశోభన ప్రత్యక్షమయింది.

సుశోభనను తీక్ష్ణంగా తండ్రి చూస్తుంటే ఆమె తల వంచుకుంది.

జల ప్రవేశంతోనే తనకు మండూక రూపం కలుగుతుందని, నూతన జన్మ కలుగుతుందని, మహారాజుకి వివరంగా ముందే చెప్పకపోవడం తన కూతురు చేసిన దోషంగా తలచి, తండ్రి ఆయువు చాలా బాధ పొందాడు. ఆమె తప్పిదాన్ని మన్నించమని మహారాజుని వేడుకున్నాడు.

మహారాజుకు తన కుమార్తె మీదున్న అపారమైన అనురాగానికి సంతసిస్తూ, సుశోభనను పరీక్షిత్తుకు తిరిగి అప్పగించాడు ఆయువు.

మందస్మితురాలైన సుశోభనను చూస్తుంటే, పరీక్షిత్తు మహారాజు ముఖంలో తిరిగి ఆనంద రేఖలు వెల్లివిరిశాయి.

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం : అరణ్యపర్వం : చతుర్థాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 11-5-1988)

# సుజాత

సుజాత తండ్రి ఉద్దాలక మహర్షి చెంతకు వచ్చి పళ్ళు, గోక్షీరపాత్ర దగ్గర ఉంచింది. ప్రేమతో ఆమె శిరసు నిమిరి, పక్కన కూర్చోబెట్టుకున్నాడు మహర్షి.

సుజాత రాక వేదాధ్యయనానికి కొంత అంతరాయం కల్గించింది. అధ్యయనం చేస్తున్న శిష్యుల చూపులు గురుగుగారి వైపు, ఆయన గారాలపట్టి సుజాత వైపు మళ్ళాయి. అయితే గురువుగారి వైపు చూసే చూపులు భక్తి గౌరవాలతో నిండి ఉన్నాయి. సుజాత వైపు ప్రదర్శించే చూపులు భయం భయంగా, చూసీ చూడనట్లుగా, దొంగ చూపుల్లా ఉన్నాయి. అక్కడున్న శిష్యులందరిలో ఏకపాదుని చూపుల్లో ఒక ప్రత్యేకత ఉంది. గురువుగారి పట్ల భక్తితత్పరత, సుజాత ఎడల నిర్లిప్తత, నిర్వికారత కనిపిస్తున్నాయి.

ఉద్దాలక మహర్షికి తెలుసు. సుజాతకి తన శిష్యులు వేదాధ్యయనం చేస్తున్నపుడు చెంత ఉండటం ఇష్టమని. అందుకే గోక్షీరం తెచ్చిన సుజాతను అక్కడే కూర్చోబెట్టుకున్నాడు.

శిష్యులు అధ్యయనం తిరిగి ప్రారంభించారు. గురువుగారి నోటి వెంట వచ్చే ప్రతి స్వరాన్నీ, శబ్దాన్నీ వెంటనే మననం చేసుకుంటూ, ఏ పొరపాటూ రాకుండా చెప్పగలవాడు అందరిలో ఒక్క ఏకపాదుడే. గురువు ముఖతః వచ్చిన ఏ స్వరమైనా మరుక్షణంలో అతని స్వంతమయ్యేది. ఈ బాలుడు ఏకసంథాగ్రాహి అనే భావం ఎన్నోసార్లు ఉద్దాలకునికి కలిగేది.

మహర్షి స్వభావం సరళమైంది. మనసు సున్నితమైంది. ఏ రకమైన జీవహింసనూ సహించలేని సాత్త్వికుడు. ఈ జగత్తులో సర్వ ప్రాణులకు సుఖంగా జీవించే అవకాశ ముండాలని విశ్వసించే విశాల హృదయుడు. ఆయన తన శిష్యులకు ఏ నిర్బంధాలూ విధించేవాడు కాడు. అవసరమైన నియమాలు సూచన ప్రాయంగా తెల్పేవాడు.

ఏకపాదుడు స్వయంగా నియమనిష్ఠ లేర్పరుచుకొని, బహు శ్రద్ధగా అధ్యయనం చేయటం ఉద్దాలక మహర్షి గమనించాడు. ఏకపాదుని గుణగణాలు, శీల సంపద అతన్ని గురువుకి సన్నిహితుణ్ణి చేశాయి.

పది సంవత్సరాలు నిండక మునుపు నించే తండ్రి దగ్గర కూచుని, ఆయనకు సేవలు చేస్తూ, వేదాధ్యయనాన్ని చాలా శ్రద్ధగా వినటం అలవాటు చేసుకుంది సుజాత. తండ్రి దగ్గర కూర్చున్నాక ఆమె దృష్టి అంతా ఏకపాదునిపై ఉండేది. అతడు శబ్దాలు ఉచ్చరిస్తుంటే అతని పెదాలవంక చూస్తుండేది. అతని నిత్యకృత్యాన్ని క్షణ క్షణం గమనించటం ఆమె దినచర్యలో భాగమయింది.

ఋతువులు మారుతున్నాయి. సంవత్సరాలు గడుస్తున్నాయి. సుజాత పెరుగుతోంది. ఏకపాదుడు యువకు డవుతున్నాడు. ఏకపాదుని చూడటం కోసమే అన్ని పనులూ త్వరగా పూర్తి చేసుకుని తండ్రి దగ్గరకు చేరేది. సుజాత రాక ఆలస్యమైతే అతని చూపులు ఆమె కోసం వెతికేవి.

కాని ఏకపాదుడు బ్రహ్మచర్య దీక్షాపరుడై, వేదాధ్యయనం ధ్యేయంగా పెట్టుకుని, మనసుని లొంగదీసుకుని, అధ్యయనంపైనే దృష్టి నిల్పాలని శత విధాల ప్రయత్నం చేసేవాడు.

ఆనాడు తండ్రి చెంగట కూచున్న సుజాత పైన నుంచి అతని చూపు ఎంత ప్రయత్నించినా మరల లేదు. ఆమెను ఆపాదమస్తకం పరిశీలనగా చూశాడు. నిన్నటి వరకు బాలికగా ఉన్న ఆమె అంతలోనే నూత్న యౌవనంలో అడుగు పెట్టినట్టనిపించింది ఏకపాదునికి. ఆమె శరీరం బంగారంలా మెరిసిపోతోంది అమాయకంగా ఉండే ఆమె నయనాలు కొత్త సోయగాలు నింపుతున్నాయి. ఆమె శరీరంలోని వంపులు వింత ఆకర్షణ కలిగిస్తుంటే, ఏకపాదుడు చాలా కష్టంపైన చూపులు గురువుగారి పైన ప్రసరించాడు.

విరామానంతరం, ఏకపాదుడు తన చిత్తాన్ని అధ్యయనం మీదికి కేంద్రీకరించటం ఉద్దాలకుడు గమనిస్తూనే ఉన్నాడు. అతని ఏకాగ్రతకి మహర్షి ఎంతో ఆనందపడ్డాడు.

ఏదో పని కల్పించుకుని తండ్రి దగ్గరికి రాకపోకలు సాగించే సుజాత, ఏకపాదుని వైపు చూడకుండా ఉండలేకపోయింది. అతనిలో కొత్తగా ప్రవేశిస్తున్న యౌవనపు ఆకర్షణకి ఆమె తట్టుకోలేకపోతోంది. అతని శరీరంలో

ప్రవేశించిన దారుఢ్యం, ముఖంలో కనిపిస్తున్న వర్చస్సు, గొంతులోని గంభీరత, అతని కొనదేలిన నాసిక, అతని ఆత్మ విశ్వాసం - ఇలాంటి వెన్నెన్నో సుజాత ఏకపాదునిలో గమనిస్తూనే ఉంది దినదినం. అతని చూపులు అయస్కాంతాల్లా ఆమెను పట్టి బంధిస్తుంటే, సిగ్గుతో తల వంచుకుని, నేల చూపులు చూస్తూ, అక్కడే నిలబడిపోయింది సుజాత. ఏనాడైనా అధ్యయన దీక్షలో ఉండి ఏకపాదుడు ఆమెను గమనించకపోతే సుజాతకి కోపం వచ్చేది. అప్పుడు అలాగే నిలబడేది. కాని, మరుక్షణంలో కోపాన్ని మరచిపోయి, అతని క్రమశిక్షణని మెచ్చుకొనేది మనసులో. అతని నూనూగు మీసాలనీ, నిండైన కంఠాన్ని, విశాలమైన వక్షస్థలాన్ని, తీక్షణమైన అతని నేత్రాలను, వేదోచ్చారణ సమయాన కదిలే అతని పెదవులను చూస్తూ పరవశించేది సుజాత.

సుజాత, ఏకపాదుల మనోభిప్రాయాలని చాలా తేలికగా అవలోకించగల్గిన ఉద్దాలక మహర్షి నెరిసిన గడ్డాన్ని సవరించుకుంటూ చిరునవ్వు నవ్వుకున్నాడు. అమాయకమైన, పవిత్రమైన వారి ప్రేమ, అన్యోన్యాకర్షణ మహర్షికి మహదానందాన్ని కల్గించింది.

అందరికంటె మిన్నగా ముందుగా అధ్యయనం పూర్తి చేసిన ఏకపాదుడు బ్రహ్మచర్యం కొనసాగించవలసిన అవసరం ఇక లేదని మహర్షి నిర్ణయించాడు.

ఓ శుభోదయాన ప్రాతఃసంధ్యా కార్యక్రమాలు పూర్తి అయిన తర్వాత ఏకపాదుని పిలిచాడు మహర్షి. "నాయనా, నీ అధ్యయన కార్యక్రమం పూర్తి అయింది. గురుకులం విడిచి, స్వతంత్రంగా నీవే గురుత్వం వహించే అర్హత సంపాదించుకున్నావు. నీవు కోరుకున్నప్పుడు బ్రహ్మచర్యం వదలి, గృహస్థాశ్రమం స్వీకరించు.''

ఏకపాదుడు భక్తితో, వినయంతో గురువుకు పాదాభివందనం చేశాడు.

అదే సమయంలో తన మనసులోనిమాట చెప్పాలని నిశ్చయించాడు మహర్షి.

"నీకు సమ్మతమయితే, మా సుజాతకి తగిన వరుడవు నీవేనని నా నమ్మకం.''

గురువుగారి మాటలకు ఏకపాదుడు మహదానందపడ్డాడు. అంతేకాదు, తన మనసు గురువు గ్రహించేసినందుకు, అతనికి ఎంతో ఆనందమేకాక, ఆశ్చర్యం కూడా కల్గింది. తండ్రీ ఏకపాదుల సంభాషణ గుమ్మం వెనక ఉండి వింటున్న సుజాత రివ్వున లేచి పరిగెత్తి నుదుటి చెమట తుడుచుకుంది.

గురువుగారి మాటకు సమాధాన మీయకుండా, నేల చూపులు చూస్తున్నాడు ఏకపాదుడు. ఇప్పటివరకూ కట్టుదిట్టాలతో బంధించిన మనసు స్వతంత్రమై, సుజాత వైపు పరుగులు తీసింది. ఆమెను స్పృశించాలని, ఆమె కురులు సరిచేయాలనీ, ఆమెను తన కౌగిలిలో బంధించాలని అతని మనసు ఆవేశపడుతుంటే గురువుగారికి వెంటనే తన అభిప్రాయం చెప్పాలని తల ఎత్తేడు ఏకపాదుడు.

"ఏకపాదా, నీ అభిప్రాయం—'' చిరునవ్వు నవ్వాడు మహర్షి.

"తమరిమాట నాకు శిరోధార్యమే"—ఏకపాదుడు గురువు పాదాలకు నమస్కరిస్తూ అన్నాడు.

తన మనసు గ్రహించిన తండ్రిని చూస్తుంటే, సుజాత ఆనందం పట్టలేక, పరుగెత్తి వచ్చి అతని పాదాలపైన వ్రాలింది.

సుజాత సౌందర్యాన్ని నఖశిఖ పర్యంతం పరికిస్తూన్న ఏకపాదుని వంక క్రీగంట చూస్తూ, అతని ధర్మపత్నిగా ఊహలు అల్లుకుంటూ, సిగ్గుతో తల వంచింది సుజాత.

*

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం ;
అరణ్యపర్వం : తృతీయాశ్వాసం.)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 18-5-1988)

# సుభద్ర

దక్షిణ దేశ తీర్థయాత్రలు పూర్తి చేసుకుని, పశ్చిమతీరంలో పుణ్యక్షేత్ర మయిన ప్రభాస తీర్థాన్ని చేరాడు అర్జునుడు. దగ్గరలో ఉన్న ద్వారకవైపు అతని మనసు మరలింది. ద్వారక పేరు తలచుకోగానే నారాయణ రూపుడైన శ్రీకృష్ణుడు తను పూర్వజన్మలోని నవనారాయణాంశ గుర్తొచ్చాయి, ఊహల్లో తేలిపోతున్న అర్జునునికి సుభద్ర రూపం స్ఫురించింది.

తీర్థయాత్రా సమయంలో మహావీరుడైన యాదవుడు గదుడు సుభద్ర సౌందర్యాన్ని వర్ణించాడు, ముల్లోకాల్లోనూ అలాటి అపురూప సౌందర్యరాశి లేదని గదుడు చేసిన వర్ణన ఉప్పెనలా తోసుకువచ్చి అర్జునుని మనసును కదిపింది. ఆమెను చూడాలనే కుతూహలం ఎక్కువైంది.

దేవతా స్త్రీలను, నాగకాంతలను, భూలోకసుందరీమణులను చూసిన అర్జునునికి, అందర్నీ మించిన సౌందర్యరాశి అయిన సుభద్రను చూసేభాగ్యం ఎన్నటికి కలుగుతుందోనని మనసు ఆరాటపడటం మొదలుపెట్టింది.

ద్వారకాపురి సమీపాన ఉన్న ప్రభాస తీర్థం చేరుకున్నాక, అర్జునుని మేధస్సులో మెరుపు మెరిసినట్లు ఒక ఆలోచన కలిగింది. తను ప్రచ్ఛన్నవేషం వేయక తప్పదు. యాదవ ప్రముఖులకు యతీశ్వరులంటే భక్తి గౌరవాలున్నా యని అతనికి తెలుసు.

నిష్ఠతో నారాయణ ధ్యానం చేశాడు అర్జునుడు. ఆ ధ్యాన విశేషమన్నట్టుగా, అర్జునుని రాక విని, అర్జున దర్శనార్థం వచ్చాడు కృష్ణుడు. తీర్థయాత్రా విశేషాలు వింటూ అర్జునుని వద్ద ఎంతసేపో గడిపాడు కృష్ణుడు. అప్రయత్నంగా సుభద్ర ప్రస్తావన తెచ్చి, అరమోడ్పు కన్నులతో పారవశ్యంలో మునిగిపోయిన అర్జునుని చిరునవ్వుతో గమనించాడు కృష్ణుడు. ద్వారకా నగరం వచ్చేయమని, యతికి తగిన వసతి ఏర్పాటు చేస్తానని సాదరంగా ఆహ్వానించాడు అర్జునుని కృష్ణుడు.

ద్వారకాపుర వాసులకి అత్యంత ప్రీతిపాత్రమైంది రైవతక పర్వతం. అక్కడి రమణీయ మందిరంలో విడిది ఏర్పాటయింది అర్జునునికి. అక్కడి మనోహరమైన ప్రదేశాల్ని దర్శిస్తూ, ఉద్యానవనాలు చూస్తూ కృష్ణునితో కలసి విహరించాడు అర్జునుడు.

ఆనాడు రైవతక పూజా మహోత్సవం జరుగుతోంది. భక్తి శ్రద్ధలతో పూజలు సలిపే జనసమూహాన్ని తిలకిస్తున్నాడు అర్జునుడు.

చెలికత్తెలతో వచ్చి పూజా మహోత్సవంలో పాల్గొన్న ఒక యువతి అర్జునుని కళ్ళముందు విద్యుల్లతలా మెరిసింది. సుభద్రాసుందరి మహావీరుడైన అర్జునుడే తనకు భర్త కావాలని మనసులో అనుకుంటూ, భగవంతుని ధ్యానిస్తోంది. ఆమె కదలుతుంటే ఆమె కాలి మంజీరాల సవ్వడులు, కంకణాల గలగలలు అర్జునుని మనసులో మధురంగా ధ్వనించాయి.

గదుడు చేసిన వర్ణన అక్షరాలా నిజమనిపించింది అర్జునునికి. అతని చూపులు ఆమె వెళ్ళిన దిక్కే నిలిచిపోయాయి. ప్రథమ వీక్షణంలోనే తనను ఇంతగా ఆకట్టుకున్న ఆమెను తను చేపట్టితీరాలి త్వరలో అనుకున్నాడు. కానీ తన కోరిక అంత త్వరలో నెరవేరటం ఎలా సాధ్యం?

ద్వారకాపురిలోని తనకున్న ఒకే ఒక స్నేహితుడు కృష్ణుడు. దుర్యోధన స్నేహితులైన బలరామాదులు తన కోర్కెని తిరస్కరిస్తారు.

అప్పటికే యతీశ్వరునిపై భక్తి భావాలు ద్వారకా నగరవాసులకు పెరిగిపోయాయి. యతీశ్వరుని పరిచర్యాభాగ్యం సుభద్రకి శుభప్రదమని బలరామాదులను ఒప్పించాడు కృష్ణుడు. సుభద్ర యతీశ్వరునికి సేవలు చేయుటానికి అంగీకరించారంతా సంతోషంగా.

యతికి సేవలు చేస్తున్న సుభద్ర మనసును అర్జునునిపైనే ప్రసరిస్తోంది. ఈమె సాంగత్యం ఎప్పటికి తనకు లభిస్తుందోనని యతి వేషధారైన అర్జునుని మనసు ఆవేదన చెందుతోంది.

మహావీరుడైన అర్జునుడు విశాల వక్షస్థలుడని, పద్మదళాయత నేత్రుడని, నీలమేఘ శ్యాములుడని, ఎన్నెన్నో విశేషాలు స్నేహితురాండ్రు వర్ణించి చెప్పగా వింది. ఆ రూపమే యతీంద్రునిలో భాసిస్తుంటే ఇతడే అతడా అనే సంశయం కలిగిం దొకసారి. మనిషిని పోలిన మనుషు లుండవచ్చునేమో!

సుభద్ర అర్జునుని వంక రెప్పపాటు లేకుండా చూస్తోంది. ఆనందోత్సాహాలు ముఖంలో పెల్లుబుకుతుంటే-

"ఆర్యా, ఇన్ని తీర్థప్రదేశాలు దర్శించిన మీరు, అమరావతికి సమానమైన ఇంద్రప్రస్థపురం దర్శించారా ఎప్పుడైనా? మహావీరుడైన అర్జునుడు తీర్థయాత్రార్థియై బయలుదేరాడని విన్నాను. అతను తిరిగి క్షేమంగా ఇంద్రప్రస్థం చేరాడా?..." సుభద్ర ప్రశ్న పరంపరలకి అన్నిటికీ ఒకే సమాధానంలా చిరునవ్వు నవ్వాడు అర్జునుడు. అప్పటివరకు ప్రసన్నంగా ఉన్న అర్జునుడు, సుభద్ర మాటలు విని ఉద్రేకపూరితు డయ్యాడు. ఇక ప్రచ్ఛన్న వేషం అనవసరమని తలచాడు. సుభద్ర పాణిగ్రహణం చేస్తూ, "నేను అర్జునుణ్ణి. నీ దర్శనం కోసం, నీ సాన్నిహిత్యం కోసం వేసిందే ఈ వేషం."

ఆ మాటలకి సుభద్ర ఆశ్చర్యంతో, ఆనందంతో ఉక్కిరిబిక్కిరయిపోయింది. వెంటనే సిగ్గుతో తల వంచుకుంది. క్రీగంట అతని మనోహరాకారాన్ని దర్శిస్తోంది.

"నీకోసమే ద్వారకాపురికి వచ్చాను... మనిద్దరి కలయికకి ఈ ఏర్పాటు చేసింది నీ అన్నగారు కృష్ణుడే!"

సుభద్ర ముసి ముసిగా నవ్వుకుంది.

అంతలోనే ఆమె మనసు చింతాక్రాంతమైంది. దుర్యోధనాదులతో స్నేహమున్న బలరాముడు, తను అర్జునుణ్ణి వివాహం చేసుకుందుకు అంగీకరించడు. తను అర్జునుని తప్ప వేరొకరిని వివాహమాడదు- ఈ సమస్య ఎలా తేలుతుందో, తన కోరిక ఎలా నెరవేరుతుందో అనుకుంటూ చెక్కిట చేయి చేర్చి దీర్ఘమైన ఆలోచనలో పడిపోయిన సుభద్ర వంక చిరునవ్వుతో చూశాడు అర్జునుడు.

"గాంధర్వం, రాక్షసం క్షత్రియులకు ఉత్తమమైన వివాహాలు -" ఆ మాటకి సుభద్ర తనువెల్లా పులకించింది. అరుణమైన ఆమె అధరాలు అరుణారుణా లయినాయి. చిరుచెమటలు ముఖాన అలుముకున్నాయి.

"నా అన్న కృష్ణునికి తెలియపర్చటం మన విధ్యుక్త ధర్మం కదా!" సుభద్ర కళ్ళు దించుకునే అంది. మరుక్షణంలో అతివేగంగా అంతఃపురం చేరింది.

సుభద్రార్జునుల అన్యోన్యానురాగాన్ని గమనిస్తున్నాడు కృష్ణుడు. మహావీరుడైన అర్జునుడు సుభద్రకు భర్తకాబోతున్న విషయం సత్యారుక్మిణులకు, దేవకీవసుదేవులకు మాత్రం తెలిపి, మరెవరికీ తెలియనీయకుండా రహస్యంగా దాచాడు.

సముద్ర మధ్యంలో ఉన్న ద్వీపం వద్దగల పశుపతి ఆలయంలో ఉత్సవాలు ఏర్పాటు చేశాడు కృష్ణుడు. బలరామాది యాదవులంతా భక్తి తత్పరతతో ఆ ఉత్సవంలో పాల్గొన్నారు. అంతా మధుపాన మత్తులై ఉత్సవ ఉత్సాహంలో మునిగిపోయారు.

అదే సమయంలో ద్వారకాపురంలో సుభద్రార్జునుల వివాహ మహోత్సవం తలపెట్టాడు కృష్ణుడు. సంకల్పమాత్రం చేతనే ఇంద్రాది దేవతలు, నారదాది మహర్షులు వివాహానికి విచ్చేసి, వధూవరుల నాశీర్వదించారు.

విజయుడు విజయోత్సాహంతో సుభద్ర సహితుడై ఊరు వదలి ప్రయాణిస్తుంటే, ద్వారకాపుర రక్షకులు, యాదవ వీరులు క్రోధారుణ నేత్రాలతో యుద్ధ సన్నద్ధులై విజృంభించారు అర్జునుని పైకి.

కానీ అందరి ప్రయత్నం విఫలమైంది. మహావీరుడైన అర్జునుడు సుభద్ర వధూమణితో కలిసి ఇంద్రప్రస్థంలో అడుగు పెట్టాడు. •

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం : ఆదిపర్వం : అష్టమాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్ర ప్రభ సచిత్ర వార పత్రిక : 25.5.1988)

# ఏకపాదుడు

ఏకపాదుడు గృహస్థాశ్రమంలో అడుగు పెట్టాడు. ఉద్దాలక మహర్షి కుమార్తె సుజాత అతని ఇల్లాలై, అతని సర్వస్వం అయింది. ధర్మానుబద్ధంగా అనుసరించవలసిన నిత్యానుష్ఠాన సమయంలో తప్ప, తక్కిన కాలమంతా సుజాత సాన్నిధ్యంలోనే అతని కాలం గడుస్తోంది. సంవత్సరాల నుంచీ క్రమశిక్షణలో పెరిగిన అతని శరీరమూ, మనసూ కూడా ఎంతో స్వతంత్ర మయ్యాయనే భావం అనుక్షణం అతనికి కలుగుతోంది.

సుజాత దిన దినం కొత్తగా కనిపిస్తోంది అతని కళ్ళకు. ఆమె ఎర్రని అధరాలు అతను చుంబించిన కొద్దీ అరుణారుణా లవుతున్నాయి. ఆమె నల్లని కురులు నడుముపై అటు ఇటు కదలాడుతుంటే ఎంతో చిత్రంగా చూసేవాడు ఏకపాదుడు. ఆమె పాదాల మంజీరాల ధ్వనులు ఆతనికి మధురంగా వినిపిస్తుంటే, ఆమె వెంట వెంట తిరుగుతూ, తనను తాను మరిచిపోయేవాడు ఏకపాదుడు. ఆమె పచ్చని చెక్కిళ్ళు నిగ నిగ లాడుతుంటే తన ప్రతిబింబం కనిపిస్తుందేమో నన్నట్లు ఆ చెక్కిళ్ళపై నుంచి చూపు తప్పించుకోలేకపోయాడు.

అనుక్షణమూ ఆమె సాన్నిధ్యంలోనే ఉండాలనే కోరిక ఏకపాదునిలో ఎక్కువ కాజొచ్చింది. తను ఆరాధించే ప్రేమైకమూర్తి తన సాంగత్యాన్ని ఇంతగా అభిలషించడం సుజాతకు ఎంతో తృప్తిని, ఆనందాన్ని చేకూర్చింది.

కాలం గడుస్తోంది. ఏకపాదుని పాండిత్య వైభవం, వేదాధ్యయన దీక్ష ప్రఖ్యాత మవటంతో, అతని శిష్యుల సంఖ్య పెరిగింది. శిష్యుల అధ్యయన విషయంలో ఎక్కువ కట్టుదిట్టమైన పద్ధతులలో విశ్వాసమున్నవాడు ఏకపాదుడు. శిష్యుల అధ్యయన బాధ్యత తనే వహించి, విద్యాబోధ ధర్మకార్యంగా భావించేవాడు.

గురుత్వం లభించటంతో ఏకపాదుని నిత్య విధులు రెండయినాయి. అధ్యాపకత్వం, సుజాత ఆరాధన. సుజాత బాధ్యతలూ పెరిగాయి. ఏకపాదుని ప్రియురాలిగా, ఇల్లాలిగా ఆమె నిర్వహించవలసిన విధులు పెరిగాయి.

యౌవనోద్రేకానికి కట్టలు వేసి, తను మాతృమూర్తి కావాలనే కోరిక ఆమెకు గాఢంగా కలిగింది.

ఆనాడు ఏకపాదుడు అనధ్యయనం ప్రకటించాడు. వాతావరణం ప్రశాంతంగా ఉంది. సుజాత ఏకపాదుని వద్ద కూర్చుంది. చల్లగా గాలి శరీరానికి హాయి నిస్తోంది. ఏకపాదుని ముఖంలోకి చూస్తూ, మాతృత్వపు వాంఛ గురించి నెమ్మదిగా ప్రస్తావించింది.

ఏకపాదుడు మాట్లాడలేదు. అతని ముఖంలో ప్రశాంతత మాయమయింది. ఆనంద రేఖలు భగ్నమయ్యాయి.

"సుజాతా, సద్గతుల కోసం సంతానం అవసరమే. కానీ మన కిప్పుడే ఎందుకు తొందర? ఆ బరువు బాధ్యతలు నేను సహించలేను ఇప్పుడు. ఇప్పుడు నా లోకమంతా నిండింది నువ్వే - నువ్వే నా సర్వస్వం. అన్నిటి కన్నా, నీ ప్రేమను నేను ఎవరితోనూ పంచుకోలేను. సంతానం కలిగాక నానుండి నువ్వు కొంతయినా దూరం కాక తప్పదు. నే నది భరించలేను సుజాతా!''

ఏకపాదుని మాటల్లోని బరువు తిన్నగా సుజాత గుండెల్ని గుచ్చుకుంది. ఆ మాటలకు ఆశ్చర్యం కలిగినా, తన ప్రేమను సంపూర్ణంగా పొందాలనే తన భర్త అభిలాషకు ఆమె మనసు ఆనందంతో, తృప్తితో నిండిపోయింది.

ఋతువులు, సంవత్సరాలు గడుస్తున్నాయి. ఏకపాదుడు, సుజాతల అన్యోన్యానురాగం దినదిన ప్రవర్ధమానమవుతోంది. సుజాతలోని సంతానవాంఛ వీడటం లేదని గ్రహించిన ఏకపాదుడు, ఆమె కోరిక ధర్మబద్ధమేనని అనుకోటం మొదలుపెట్టాడు కొన్నిసార్లు.

సుజాత గర్భవతి అయింది. ఏకపాదుని ప్రేమానురాగాలు అనుక్షణం అనుభవిస్తూంది సుజాత. గర్భస్థ శిశువు సుజాత తన కందించే ప్రేమకు అడ్డమని అప్పుడప్పుడు అనిపించేది ఏకపాదునికి.

ఏకపాదుడు శిష్యులచేత అధ్యయనం చేయిస్తుంటే అతని చెంతనే కూర్చునేది సుజాత. సుజాత ప్రసవిస్తే ఆమె ప్రేమ తన పసివాడిపై మరల్చి, తనని దూరం చేస్తుందా అనే భావం రోజురోజుకీ ఏకపాదునిలో పెరుగుతోంది. గర్భస్థ శిశువుపై ఎలాటి మమకారం పెంచుకోలేకపోయాడు ఏకపాదుడు.

కొన్నిసార్లు కోపోద్రిక్తుడైన ఏకపాదుడు, తన కోపాన్ని శిష్యులపై మళ్ళించేవాడు. శిష్యులపై విధించే నియమాలు ఎక్కువయ్యాయి. శిక్షణ ఎక్కువైంది. అహోరాత్రులు నిద్రాహారాలు లేక వేదపఠనంలో మునిగిపోయేలా చేశాడు శిష్యుల్ని. వారి శక్తి సామర్థ్యాలు అతను పట్టించుకోవటం లేదు. నిద్రాహారాలు లేక వారు కృశిస్తున్నారు. శరీరంలో బలంలేక వారు బడలిక చెందుతున్నారు. ఇవన్నీ గమనించిన సుజాత విద్యార్థులకు అంత కఠిన నియమాలు వద్దని, వారు నిద్రాహారాలులేక కష్టపడుతున్నారని, వేదాధ్యయనకాలం తగ్గించమని చెప్దామనుకుంది భర్తతో. కానీ ఆమెకు ధైర్యం చాలలేదు.

సుజాత గర్భస్థ శిశువు మాతామహుడైన ఉద్దాలక మహర్షి పాండిత్యాన్ని, తండ్రి ఏకపాదుని క్రమశిక్షణ, నియమనిష్ఠలను మాతృగర్భంలో ఉండే ఒంటపట్టించుకున్నాడు.

తన తండ్రి శిష్యులకు అతి కఠినమైన తీరులో వేదాధ్యయనం చేయించటం, నిద్రాహారాలు లేక మందబుద్ధులై ఆ శిష్యులు అపస్వరాలు ఉచ్చరించటం గమనించాడు. అతను అది భరించలేక, ఒకనాడు తండ్రితో సూచనప్రాయంగా అన్నాడు.

సుజాతపై తన ప్రేమకు అడ్డం తగులుతున్న గర్భస్థ శిశువుపై ముందే కోపమున్న ఏకపాదునికి, ఆ శిశువు తన అధ్యయన విధానాన్ని అధిక్షేపించటం అగ్నిపై ఆజ్యం జల్లినట్లయింది. ఏకపాదుని కోపోద్రిక్తత కట్టలు తెంచుకుంది. వేదాధ్యయనానికి వక్రభాష్యం చేస్తున్నాడనే భావం అతన్ని కదిలించివేసింది. "అధ్యయనానికి వక్రంగా భాష్యం చెప్తున్నావు కనక, నీవు వంకరలు తిరిగిన శరీరంతో జన్మించు" అన్నాడు వెంటనే.

సుజాత అవాక్కయిపోయింది. గజగజ లాడిపోయింది. తన భర్తమాట ఊరికేపోదు. భయంతో భర్తవంక చూసింది. ఆ చూపుల్లో తన ఎడగల ప్రేమ ఉప్పొంగి పొరలినట్లనిపించింది ఏకపాదునికి.

ఏకపాదుడు పునరాలోచన చేశాడు.

"సుజాతా! తొందరపడ్డాను. నీమీద ఎడతెగని ప్రేమ, ప్రస్తుతం సంతానంపై నాకున్న విముఖత ఈ కోపాన్ని ప్రేరేపించాయి. కానీ, భయపడకు. నీ గర్భస్థ శిశువు శరీర వక్రత అతని కీర్తి ప్రతిష్ఠలకు, తేజస్సుకు, అతని

పాండిత్యానికి, అతని శీల సంపదకూ ఏ విధంగానూ అడ్డంరాదు. అతను గొప్ప కీర్తి ప్రఖ్యాతులు సంపాదించుకుంటాడు. నా మాట నమ్ము." ఏకపాదుడు ఆమె చెక్కిళ్ళు చుంబించాడు. ఆమె అధరాలు స్పందిస్తుంటే, సున్నితంగా గుండెలకి హత్తుకున్నాడు.

సుజాతకి కొంత తృప్తి కలిగింది, తన గర్భస్థ శిశువు భవిష్యత్తు ఆశాజనకంగా కన్పించటం వల్ల.

"సుజాతా, నా తొందరకు నేనే చింతిస్తున్నాను. నీ గర్భస్థ శిశువు ఆశ్రమ విద్యావిధానాన్నే మార్చివేయగల మహనీయుడవుతాడు. బృహస్పతికి మించిన బుద్ధితో, సరస్వతిని వశం చేసుకోగల విద్వాంసుడవుతాడు." సుజాత శిరసు నిమిరాడు ఏకపాదుడు.

సుజాతకు భర్త మాటలు అమృతపు జల్లుల్లా హాయిగొల్పాయి. గర్భస్థ శిశువుపై అతని అనురాగం పెంచుకుంటున్నందుకు, తనపై అమితమైన ప్రేమ నింపుకున్నందుకు సుజాత ఆనందంతో పరవశించింది.

ఆనంద బాష్పాలు ఆమె కళ్ళలో నిండుతుంటే ఏకపాదుని వక్షస్థలంపై వాలిపోయింది సుజాత. ✱

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం:
అరణ్యపర్వం : తృతీయాశ్వాసం)
(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 1-6-1988)

# సుకన్య

సుకన్యకు భర్తను చూసినప్పుడల్లా ఆశ్చర్యం కలుగుతూనే ఉంది. ఆ ఆశ్చర్యంతోపాటు భర్తపైన ప్రేమ, భక్తికూడా పెరుగుతూనే ఉన్నాయి. నిరంతర తపోదీక్షతో ఆయన శరీరం క్రుశిస్తోంది. కాని, అతీతమైన తేజస్సు ఆయనను అంటిపెట్టుకుంటూనే ఉంది.

ధ్యానమగ్నుడైన చ్యవన మహర్షి వంక కంటి రెప్పపాటు లేకుండా చూస్తోంది సుకన్య. ఆమెకు తన బాల్యం ఒక్కసారి కళ్ళకు కట్టినట్లైంది.

ఆనాడు స్నేహితురాళ్ళతో వనవిహారానికి బయలుదేరింది సుకన్య. అక్కడ వాల్మీకంలో కనిపించినమెరుపులు ఆమెకి ఆశ్చర్యాన్ని కలిగించాయి. అవి ఎక్కడనుంచి వస్తున్నాయో తెలుసుకోవాలని, అవి మిణుగురులేమో అని ఆ పుట్ట తవ్వించింది. ఆ నిముషమే పుట్టలో ఉన్న తపోధనుడైన చ్యవనమహర్షి ఆగ్రహానికి గురి అయింది. బాల్యంలో అజ్ఞానంతో చేసిన అపచారం వల్ల ఏ ప్రమాదం సంభవిస్తుందోనని భయపడిన తండ్రి, చ్యవన మహర్షి కిచ్చి తన వివాహం జరిపించాడు. అయితే రాజకుమార్తె అయిన తను మహర్షి భార్య అయినందుకు ఏనాడూ చింతించలేదు సుకన్య తేజోరాశి అయిన భర్తవంకే చూస్తోంది.

తృప్తిగా, ఆనందంగా సుకన్య జీవితం గడిచిపోతున్నా అంతరంగంలో ఒక చిన్న కోరిక కదలాడుతుండేది అపుడపుడు. ఈ మహర్షికి తేజస్సుకు తోడు యౌవనం కూడా ఉన్నట్లయితే మరింత ఆనందమయ మయ్యేది తన జీవితం. యౌవనుడైన తన భర్తతో, తన జీవితం ఎంత మధురాతి మధురంగా ఉంటుందో ఊహించుకుంటూంటే ఆమె శరీరం పులకాంకితమైంది.

వసంతం ఆ ప్రాంత మంతా నిండి ప్రకృతి శోభను మరింత పెంచింది. ఆశ్రమ సమీపంలో ఉన్న కొలనుకి స్నానార్థమై బయలుదేరింది సుకన్య.

శీతలోదకాలు, వికసించిన పద్మాలు ఆమె కెంతో ఆనందాన్ని కలిగించాయి. చ్యవన మహర్షిని రూప యౌవనుణ్ణిగా ఊహించుకుంటూ, జలక్రీడలలో మునిగి తేలుతూ తన్మయత్వం చెందింది సుకన్య.

అంతలో ఆకాశ మార్గాన ఇరువురు యౌవనులు తననే గమనించటం చూసి, ఊహాలోకంలోంచి బయటపడి తత్తరపాటు చెందింది.

ఆమె సౌందర్యానికి విస్తుపోతున్నారు వారిరువురు. ఏ దేవతా స్త్రీ లోనూ కానరాని రూప సౌందర్య లావణ్యాలు ఆమెలో చూస్తున్న వారి మనసులు వశం తప్పుతున్నాయి.

గగనమార్గం నుంచి దిగి, ఆమెను సమీపించారిద్దరూ. "మేము అశ్వి దేవతలం. ఈ నిర్జనారణ్యంలో ఒంటరిగా ఎందుకున్నావు? నీ వివరాలు చెప్పు."

వారి మాటల్లో కుతూహలం తరుముకొస్తుంటే సుకన్య సిగ్గుతో తల వంచింది.

"శర్యాతి మహారాజు కుమార్తెను, తపోధనుడైన చ్యవన మహర్షి భార్యను'' అంది తలవంచి.

"నీ లాంటి అపురూప సౌందర్య రాశి ఆ వృద్ధునికి భార్యగా ఉండటమా? యౌవనవంతు డొకణ్ణి వివాహం చేసుకుని, నీ యౌవనం సార్థకం చేసుకో."

వారామెను ఆపాద మస్తకం చూస్తూ మాట్లాడుతుంటే, ఆ మాటలు శూల్లాల్లా ఆమె మనసుని గాయపరిచాయి.

తన స్వభావ సౌశీల్యాలు తెలియక వారట్లా మాట్లాడుతున్నారని, తనని వారు అపార్థం చేసుకున్న విషయం వారికి తెలియపరచాలని నిశ్చయించుకుంది సుకన్య.

"నేను చ్యవన మహర్షి ధర్మపత్నినని చెప్పాను. ఆయన ఎడ ఉన్న అవ్యాజానురాగం మీ లాటి వారికి అర్థం కాదు." సుకన్య ముఖంలో గంభీరత ఆవరించింది. ఆమె కళ్ళలో ఎరుపు నిండింది. ఆమె చూపులు నిశితమయ్యాయి.

"అయ్యా, నా భర్త చ్యవన మహర్షి అసమాన తేజోరాశి. అగ్ని దేవుణ్ణి శాసించిన భృగు మహర్షి పుత్రు డాయన. తల్లి గర్భం నుంచి వెలువడుతూనే పులోముడనే రాక్షసుణ్ణి దహించి వేసిన కోటి సూర్య ప్రభా భాసితుడు దైవ బల సంపన్నుడయిన చ్యవన మహర్షి భార్యగా నా జన్మ సార్థకమైంది. మీరు మాటలు చాలించి మరలిపొండి."

అశ్వి దేవతలకి భయమేసింది సుకన్య రూపాన్ని చూస్తుంటే. మహర్షి ఎడల సుకన్యకు గల ప్రేమను, మహర్షి శక్తియుక్తుల్ని పరీక్షించాలనే కోరిక వెంటనే కలిగింది.

"నీ మాటలు మాకు అర్థమయ్యాయి. కానీ అవి నిజమే నని నమ్మటానికి మే మొక మార్గం సూచిస్తున్నాము - శ్రద్ధగా విను. నీకూ, మహర్షికీ అంగీకార మైతేనే ఆ మాటలు చెప్తాము."

అశ్వి దేవతలు ఆమె వంకే చూస్తున్నారు. ఏమి చెప్తారో అని సుకన్య వారి వంకే చూస్తూ, తన అంగీకారం తెలిపింది.

"మేము అమర వైద్యులం. జరాభారాన్ని పోగొట్టే వైద్య రహస్యాలు మా వద్ద ఉన్నాయి. నీకు అంగీకారమైతే మహర్షి మాతోపాటు కొలనులో స్నానం చెయ్యాలి. ఆయనకి మాకున్న యౌవనం, సౌందర్య రూపం సిద్ధించేలా చేస్తాము. ఏక రూపులమైన మాలో నువ్వు నీ భర్తని వరించగలగాలి.''

అశ్వి దేవతలు సుకన్య సౌందర్యాన్ని ఆరాధిస్తూ ఆమె వైపు చూస్తు నిలిపారు. వారి మాట భర్తకు తెలియజేయటానికి ఎంతో ఉత్సాహం కనపరచింది సుకన్య.

చ్యవన మహర్షిని యౌవన రూపునిగా తలచుకుంటూ, భర్తను సమీపించింది సుకన్య.

సుకన్య మాటలు విన్న చ్యవన మహర్షి చిరునవ్వు నవ్వాడు. ఆమెతో బయలుదేరాడు. అశ్వి దేవతలు పెట్టిన నియమం తన భర్త అంగీకరించడం ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని కలిగించింది సుకన్యకి. దివ్యజ్ఞాని, తపోధనుడు అయిన మహర్షి అంగీకారం తెలిపితే, ఏ సందేహాలకు అవకాశం లేదని, ధైర్యం నింపుకుని భర్తని అనుసరించింది సుకన్య.

తమకూ, మహర్షికీ రూపంలో అభేదం ఉండేటట్లుగా దృఢ చిత్తంతో. ఎంతో శ్రద్ధ వహించారు అశ్విదేవతలు. కొలనులో ముగ్గురూ ఒకేసారి దిగారు. అశ్వి దేవతలు తమ వైద్య విద్యను ప్రయోగించారు.

ముగ్గురూ ఒకే రూపంతో కొలను వెడలి వస్తుంటే, సుకన్య వారిని చూస్తూ తన కళ్ళను తను నమ్మలేకపోయింది.

ముగ్గురూ అశ్వి దేవతలే, ముగ్గురిలోనూ విజయగర్వం తొణికిసలాడు తోంది. ముగ్గురూ యౌవనవంతులే. ముగ్గురూ సౌందర్య రూపులే. ముగ్గురూ ఏకాకృతులే.

తన భర్తను సుకన్య పోల్చుకోలేదనే భావం పూర్తిగా అశ్వి దేవతల మనసులో నాటుకుంది.

సుకన్య ప్రశాంత చిత్తురాలై ముగ్గురినీ పరిశీలనగా చూస్తోంది. ఏకాకృతు లైన ఆ ముగ్గురినీ చూస్తూ, తన ప్రేమానురాగాలు ఎటు దారి తీస్తాయో అనుకుంటూ, ముందు ముందుకి అడుగు వేస్తోంది సుకన్య.

మరొక్కసారి పరీక్షగా ముగ్గుర్నీ చూసింది సుకన్య. అశ్వి దేవతలు తమకు, మహర్షికీ రూపంలో, యౌవనంలో తేడా లేకుండా చేయగలిగినా, మహర్షికి జన్మతః సిద్ధించి, అంతర్లీనంగా ఉన్న తేజస్సును ఆయన నుంచి వేరు చేయలేక పోయింది.

ఆమెలోని అనిర్వచనీయమైన అనుభూతి ఆ తేజస్సు వైపు ఆకర్షితమవు తోంది. అప్రయత్నంగా ఆమె పాదాలు ఆ తేజోమూర్తి వైపు నడిచాయి.

అశ్వి దేవతలు ఆశ్చర్యంనుంచి తేరుకోలేకపోయారు.

సుకన్యా చ్యవన మహర్షుల అన్యోన్యానురాగం అశ్వి దేవతలని ఆనంద పరవశుల్ని చేసింది. అంతవరకు అమర వైద్యులమని అతిశయం చూపినవారు, తలలు వంచి సవినయంగా మహర్షి దంపతులకు పాదాభివందనం చేశారు.

తనకి యౌవన రూపం కలిగించి, మహోపకారం చేసిన అశ్వి దేవతలకు ప్రత్యుపకారం చేయదలచాడు మహర్షి. యజ్ఞంలో సోమరస భాగం వారికి సిద్ధించేటట్లు చేస్తానని మాట ఇచ్చాడు వారికి. మహర్షి కలిగించిన ప్రత్యేక గౌరవానికి సంతసిస్తూ, గగన మార్గాన తరలిపోయారు అశ్వి దేవతలు.

నవయౌవనుడైన భర్త చ్యవనుని పరిష్వంగంలో పరవశించింది సుకన్య.

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం:
అరణ్య పర్వం : తృతీయాశ్వాసం)
(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 8-6-1988)

# సుప్రభ

రూపానికే కాక, పాండిత్యానికీ, శీల సంపదకు, నియమ నిష్ఠలకూ విలువ నిచ్చే మహనీయులు ఈ లోకంలో లేకపోలేదు. అలాంటి మహనీయుల్లో ఒకడు వదాన్య మహర్షి.

అష్టావక్రుని కీర్తి ప్రఖ్యాతులు వదాన్య మహర్షి చెవిని సోకాయి. పన్నెండేళ్ళు నిండక మునుపే వేదవేదాంగ పారంగతుడయ్యాడు ఆ బాలుడు. పండిత సభల్లోకి అతనిని ఎవరైనా రానియ్యక అడ్డగిస్తే అలాటి వారిని చూసి ఒ చిరు నవ్వు నవ్వేవాడు. అంతేకాదు... జ్ఞానవృద్ధుడే వృద్ధుడు అంటూ తోసుకుని పండిత సభల్లోకెళ్ళి విజయగర్వంతో బయటకొచ్చేవాడు.

ఆ విజయ పరంపరలు విన్న వదాన్యుడు అష్టావక్రుని గూర్చి శిష్యులకు అనుక్షణం చెప్తూండేవాడు. ఆ మాటలు వదాన్యుని కుమార్తె సుప్రభ శ్రద్ధగా ఆలకించేది. పాండిత్యమంటే ఎనలేని గౌరవమున్న తండ్రి అష్టావక్రుని పాండితీ వైభవాన్ని మెచ్చుకుంటుంటే - అతని పట్ల అభిమానం, భక్తి, గౌరవం పెరిగాయి సుప్రభకి. అతన్ని చూడాలని, అతను తన తండ్రితో సంభాషిస్తుంటే వినాలని మనసులో ఎన్నోసార్లు అనుకునేది.

అష్టావక్రుడు బ్రహ్మచర్య దీక్ష చాలించి, గృహస్థాశ్రమపు ఆలోచనలు రాగానే, తనకు తగిన కన్య ఎవరా అని ఊహించసాగాడు. పాండిత్యమంటే భక్తి గౌరవాలున్న స్త్రీ తనకు భార్యగా ఉండేందుకు తగినదని మనసు కనిపించింది.

తపోధనుడైన వదాన్య మహర్షి, అతని కుమార్తె గురించి ఇంతకుముందు విన్నాడు. యుక్త వయస్కురాలైన సుప్రభ అతని కళ్ళముందు నిల్చింది. మిలమిలలాడే కళ్ళతో, నల్లని కేశపాశంతో, నిండైన శరీర సౌందర్యంతో అతని మనోఫలకంపైన కదలాడింది సుప్రభ.

వదాన్య మహర్షి కుమార్తె సుప్రభకి, వేదాధ్యయనమన్నా, పాండిత్యమన్నా గౌరవం ఉంటుందని అతనికి తోచింది. సుప్రభ తన అర్ధాంగి అయితే తన గృహస్థ జీవితం సాఫల్య మవుతుందని తలంచాడు అష్టావక్రుడు.

ప్రభాత సంధ్యా కాంతులు నదీసైకతాల మీద మెరుస్తున్నాయి. నిత్యానుష్ఠానం పూర్తి చేసుకున్న అష్టావక్రుడు వదాన్యుని ఆశ్రమం వైపు నడక సాగించాడు.

ఆశ్రమం సమీపిస్తున్న కొద్దీ అతని మనసు పరిపరి విధాల పోయింది. తన పాండిత్యాన్ని ఇష్టపడొచ్చు కానీ తనను భర్తగా ఇష్టపడుతుందో లేదో సుప్రభ? వదాన్యుడు తనను వేద విదునిగా సన్మానించవచ్చు. కానీ తన కోరిక తిరస్కరిస్తే?-అష్టావక్రుని అడుగు ముందుకు పడలేదు. అలాగే నిలబడ్డ అతన్ని ఎవరో వెన్ను తట్టినట్లయింది. ఏనాడూ, ఎక్కడా ఓటమి ఎరుగని తను, ఈనా డెందుకు ఇలా బెంపుతున్నాడు? తన నియమ నిష్ఠలు, తన శీల సంపద, తన పాండిత్యమే తనని ఇప్పుడూ గెలిపిస్తాయని అనుకుంటూ అష్టావక్రుడు చర చరా, గబగబా నడిచి వదాన్యుని ఆశ్రమం చేరాడు.

అష్టావక్రుడు తన ఆశ్రమానికి రావడమే భాగ్యంగా భావించాడు వదాన్యుడు. అతనికి అతిథి మర్యాదలు చేస్తుంటే తండ్రి వెనుక నిలిచి శ్రద్ధగా గమనిస్తున్న సుప్రభ క్షణమాగి వెంటనే లోపలికి వెళ్ళిపోయింది.

తన మనసులో మాట అష్టావక్రుడు చెప్పగానే ఆశ్చర్యపోయాడు వదాన్యుడు అతను గ్రహస్థాశ్రమం స్వీకరించడానికి తన కుమార్తెను వివాహ మాడడమా? మెరుపు తీగెలా సుప్రభ అతని కళ్ళముందు నిలుస్తోంది.

అష్టావక్రుడి విజయ పరంపరలు ఒక్కసారి వదాన్యుని మనసులో మెదిలాయి. మహర్షి పెదాలపైన చిన్న నవ్వు నిలిచింది. అష్టావక్రుని పరీక్షించాలనే కోరిక కలిగింది వెంటనే.

"నా కుమార్తె నిచ్చి వివాహం చేస్తాను... కానీ"-

అష్టావక్రుడు మహర్షి ముఖంలోకి చూశాడు.

"నువ్వు వివాహానికి ముందు ఉత్తర దిశను చూసి రావాలి!" వదాన్యుడు నెరిసిన గడ్డం సరిచేసుకున్నాడు.

"తమరే పని చెప్పినా చేస్తాను. కానీ ఆ దిక్కుకి ఎలా వెళ్ళాలి? వెళ్ళి ఏం చేయాలి?"

సుప్రభ తండ్రి వంక చూస్తోంది. వదాన్యుడు చిరునవ్వు నవ్వాడు... అష్టావక్రుని వంక చూస్తూ-

"అలకా పట్టణం మీదుగా వెళ్ళు. అక్కడి నుంచి హిమవత్పర్వత శిఖరం చేరు. అక్కడ పార్వతి తపస్సు చేసిన ప్రాంతంలో ఉన్న అరణ్యం-"

"అరణ్యమా?" అష్టావక్రునికి ఏమీ బోధపడడం లేదు.

"అక్కడ మణి మందిరంలో ఒక ప్రౌఢ వయస్కురాలుంటుంది. ఆమెను చూసిరా."

తలవంచి ఆలోచనా నిమగ్నుడైన అష్టావక్రుడు, కొద్ది సేపట్లోనే ఉత్సాహం నింపుకుని, బయలుదేరాడు అక్కడినుంచి.

మణిమందిరం చేరిన అష్టావక్రునికి ఎదురొచ్చారు కొందరు స్త్రీలు. అతన్ని అంతఃపురంలోకి తీసుకువెళ్ళి వెనుదిరిగారు. ప్రౌఢ స్త్రీ అతన్ని ఆహ్వానించి పుష్పాలతో పూజించింది. ఆమె చూపులు, చేష్టలు అష్టావక్రునికి చాలా వింత గొల్పాయి.

చీకటులు ముసురుతున్నాయి. అలసిపోయిన అష్టావక్రుడు తన శయ్యపైన నిద్ర కుపక్రమించాడు. అంతలోనే కంకణాల గలగలలు, మంజీరాల ఝుమ ఝుమలు అతని చెవిని సోకాయి. ఒక దివ్య పరిమళం శయనాగారమంతా నిండింది. అతను విస్తుపోయి చూస్తుండగానే ఆ ప్రౌఢ అతని శయ్యపై చేరి గాఢాలింగనం చేసింది అతన్ని.

కలో నిజమో తెలియడం లేదు. ఆమె కౌగిలిని విడిపించుకుని లేచాడు అష్టావక్రుడు.

ఆమె అతన్ని పోనీయడం లేదు. ఆమె అధరాలు స్పందిస్తున్నాయి. వక్షోజాలు ఎగసిపడుతున్నాయి. ఆమె అతన్ని తిరిగి కౌగిలిలో బంధించింది.

అష్టావక్రుని సంయమనం రవ్వంత సడలడంలేదు. ఆమెను తోసేశాడు.

"నా అంతట నేను కోరి వస్తే నీకింత తిరస్కారమా? నా ఈ సంపదను, నన్ను నువ్వే స్వీకరించు. దివ్యభోగా లనుభవించు.'' ఆమె అతన్ని రకరకాల ప్రలోభపెట్టాలని చూసింది,

అతని మనసు నిండా సుప్రభ రూపమే కదలాడుతోంది. ఈమెను వదిలించుకుని, వేగంగా వదాన్యుని ఆశ్రమం చేరాలనే తొందర ఎక్కువైంది.

"నన్ను వెళ్ళనీ...నువ్వు ధర్మమార్గం ఎంచుకో. నేను సుప్రభను వివాహమాడి, పవిత్రమైన గృహస్థాశ్రమంలో అడుగు పెట్టాలనుకుంటున్నాను... పక్కకు తొలగు - వెళ్ళనీ నన్ను..." అష్టావక్రుడు ఆమెను తోసి ముందుకు అడుగువేశాడు.

అతని మాటలకు ఆమె చలించలేదు.

వయ్యారాలు ఒలకపోస్తూ ఎదురుగా నిలిచింది. సౌందర్యం రాసిపోసినట్లుగా ఉంది. రతీదేవి మరు రూపంలా ఉంది.

అయినా విముఖుడై ముందుకు నడుస్తున్నాడు అష్టావక్రుడు. అతని వంక చూస్తూ కిలకిలా నవ్వింది ఆమె.

ఒక్క నిముషం ఆమె వంక చూశాడు అష్టావక్రుడు. "మహాత్మా వదాన్య మహర్షి చెప్పిన ఉత్తర దిశను నేనే! నువ్వు కోరిన సుప్రభ నిన్ను తప్పక వరిస్తుంది...వేగంగా వెళ్ళు." పక్కకు తప్పుకుని దారి చూపించిందామె; మహా సంయమీశ్వరుడయిన అతనికి నమస్కరిస్తూ.

* * *

దూరంగా వస్తున్న అష్టావక్రుని ఆశ్రమం వాకిట నిలిచిన సుప్రభ శ్రద్ధగా చూస్తోంది. అతను దగ్గరవుతున్నకొద్దీ మరీ పరిశీలనగా చూస్తోంది.

ఆశ్రమంలో అడుగు పెడుతున్న అష్టావక్రుడు వేదమూర్తిలా, విజ్ఞాన ఖనిలా, సహస్ర సూర్య ప్రభారాశిలా ఆమె కళ్ళకు కనిపించాడు.

అతడు తన భర్త- సుప్రభ కళ్ళలో ఆనంద రేఖలు తాండవించాయి.

పాదాభివందనం చేస్తున్న అష్టావక్రుని లేవనెత్తి శిరసు నిమిరాడు వదాన్య మహర్షి.

సుప్రభా, అష్టావక్రుల వివాహ వేడుకలు ఆశ్రమవాసులంతా ఆనందోత్సాహాలతో జరుపుకున్నారు.

*

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం:
అనుశాసనిక పర్వం : ద్వితీయాశ్వాసం)
(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 15-6-1988)

# ప్రభావతి

భరద్వాజ మహర్షి ఆశ్రమం ఎప్పుడూ వేదఘోషతో విలసిల్లుతూ ఉంటుంది. ఆశ్రమవాసులు ఎప్పుడూ దైవ సంబంధమైన కార్యక్రమాలలో నిమగ్నులై ఉంటారు. భరద్వాజ మహర్షి నిత్యానుష్ఠానం మాత్రమే కాక, లోక కళ్యాణార్థం యజ్ఞయాగాదులూ నిర్వర్తిస్తుండేవాడు.

భరద్వాజ మహర్షి కుమార్తె ప్రభావతి, తండ్రి జరిపే కార్యక్రమాలు ఎంతో శ్రద్ధతో తిలకించేది. అనేక క్రతువులలో దేవేంద్రుని ఆవాహనం చేయటం ఆమెకు ఎంతో ఆసక్తికరంగా ఉండేది. దేవేంద్రుని బలపరాక్రమాల గురించి, దేవేంద్ర వైభవం గురించి, స్వర్గలోకపు సౌందర్యం గురించి అందరూ చెప్పుకుంటుంటే చాలా ఉత్సాహంగా వినేది ప్రభావతి. స్వర్గాధిపత్య విశేషాలు వింటుంటే ఆశ్చర్యంతో ఆమె శరీరం గగుర్పాటు చెందేది.

ఇంద్రుడు దుష్టశక్తుల నణిచివేస్తూ, లోకశ్రేయస్సును వేయికళ్ళతో కాపాడుకొస్తున్నాడని విన్న ప్రభావతి మనసు ఆనందడోలికల్లో తేలిపోయేది. అలాటి దేవేంద్రునికి అన్ని దైవ కార్యాలలోను ప్రముఖమైన స్థానం ఉండటం సహజమేనని ఆమె తృప్తిగా అనుకొంది.

దేవేంద్రుని గురించిన ఆలోచనలు ఆమె మనసును చుట్టుముడుతుంటే ఆయనపట్ల భక్తి గౌరవాలు పెరిగాయి ప్రభావతికి. అనుక్షణం ఇంద్రుని స్మరించటం ఆమెకు అలవాటై పోయింది.

వసంతం వచ్చి వెళ్ళింది. నూత్నయౌవనం నింపుకున్న ప్రభావతి సహజ సౌందర్యం మరింత అతిశయించింది. అందరి చూపులు ఆమెపైనే నిలుస్తున్నాయి. ఆమెకు వివాహ యోగ్యమైన వయసు వచ్చిందని ఆశ్రమ స్త్రీలు భరద్వాజునికి తెలియపరిచారు.

వివాహ ప్రయత్నాలకి సమయ మాసన్నమైందని గుర్తించిన భరద్వాజ మహర్షి, ప్రభావతి మనోభిప్రాయం తెలుసుకోవటం ధర్మమని తలంచాడు.

ఆనాడు అగ్నికార్యం నిర్వర్తించి, బయట నిలిచాడు భరద్వాజుడు. పొన్నచెట్టుకింద నిలబడి, వినీలాకాశాన్ని చూస్తున్న ప్రభావతి కనిపించిం దాయన కళ్ళకి. అదే శుభసమయమనిపించి, కుమార్తెను దగ్గరకు పిలిచాడు.

"నీ వయోధర్మాన్ననుసరించి నీకు వివాహం జరిపించాల్సిన బాధ్యత నాపై ఉంది. ఎందరో మునికుమారులు వివిధ క్రతువుల్లో పాల్గొనేటందుకు నా దగ్గరకు రావటం నీవూ చూస్తున్నావు. వారిలో ఎందరో నిన్ను చేపట్టడానికి ఇష్టపడవచ్చు, కానీ నీ మనోభిప్రాయం తెల్సుకుని..." భరద్వాజుడు కుమార్తె వంక చూశాడు.

ప్రభావతికి ముఖం వివర్ణమవటం మహర్షికి ఆశ్చర్యాన్ని కలిగించింది వివాహమంటే ఆమెకు విముఖతా, లేక ఆమె మనసులో మరో భావ ముందా అని వితర్కించుకుంటూ-"అమ్మా, నీకు ఇప్పుడే వివాహం చేసుకోవాలని ఇష్టం లేదా?" లాలనగా అన్నాడు భరద్వాజుడు.

నీళ్ళు నిండిన ప్రభావతి కళ్ళను గమనిస్తూనే ఉన్నాడు. వివాహంపట్ల విముఖత లేదన్నట్లు తల అడ్డంగా తిప్పింది ప్రభావతి. మహర్షి మనసు తేలిక పడింది. ఆమె మనసులో భావం మాత్రం గ్రహించలేకపోయాడు.

నీళ్ళు నిండిన కళ్ళు ఎత్తి తండ్రి వంక చూసింది ప్రభావతి. తండ్రితో అసత్యం చెప్పలేదు. అనితర సాధ్యమైన వెన్నో సాధ్యం చేయగల మహర్షి తన తండ్రి. తన మనోభీష్టం తెలియపరిస్తే అది నెరవేర్చే శక్తి తన తండ్రికి ఉందని ఆమెకు తెలుసు.

"బాల్యం నుంచీ నా మనసు పరమపూజ్యుడు, స్వర్గాధిపతి అయిన దేవేంద్రునిపైనే లగ్నమయింది తండ్రీ! ఆయనను ఆరాధించటమే నా ధ్యేయం. దేవేంద్రునిపైన తప్ప మరొకరిపైన నా మనసు పోదు. నే నెవ్వరినీ వివాహ మాడలేను. నన్ను మన్నించండి."

కుమార్తె మాటలు విని సర్వజ్ఞానియైన భరద్వాజమహర్షి నివ్వెరపోయాడు. ప్రభావతి గుణగణాలు, ఏకాగ్రత, నిర్మలమైన మనసు మహర్షికి తెలియనివి కావు. కానీ, తన కుమార్తె తన ధ్యేయాన్ని సాధించగలదా? భరద్వాజుని మనసు చింతాక్రాంతమైంది.

"అమ్మా! ముల్లోకవాసులూ దేవేంద్రుని కరుణా కటాక్ష వీక్షణాలకోసం జీవితమంతా ఎదురు చూస్తుంటారు. మేమంతా నిరంతరం నిర్వహించే ఈ యజ్ఞ యాగాదులన్నీ స్వర్గాధిపతి ప్రసాదం కోసమేగా? అటువంటి దేవేంద్రుణ్ణి నువ్వు భర్తగా కోరుకుంటున్నావు. నీ కోరిక అసాధ్యమైందని నా మనసు కలవరపాటు చెందుతోంది తల్లీ!''

భరద్వాజుడు మాట ఆపి కుమార్తెవంక చూశాడు. ఆమె ముఖంలో ఎలాంటి చలనమూ కానరాలేదు మహర్షికి. ఆమె తన పట్టుదలని వీడదని అయనకి అర్థమైంది.

ప్రభావతి ఏకాగ్రతతో, నిశ్చలంగా తన ధ్యేయాన్ని నెరవేర్చుకోగల ఆత్మ విశ్వాసంతో తండ్రి వంక చూసింది.

మహర్షిలో వాత్సల్యం పెల్లుబికింది. కుమార్తె శిరసునిమిరి "విజయోస్తు!" అన్నాడు.

తండ్రి ఆశీర్వచన బలం తనకుందనే గొప్ప తృప్తితో ప్రభావతి కళ్ళు మెరిసాయి. ఎట్లాగైనా ఇంద్రుని వరించాలనే గొప్ప సంకల్పంతో, కఠోర తపో దీక్షకు ఉద్యుక్తురాలయింది ప్రభావతి.

నిరంతర తపోదీక్షలో ఉన్న ప్రభావతికి రోజులు తెలియడంలేదు. ఋతువులు కదిలిపోతున్నాయి. ఏకాగ్రత సడలటంలేదు.

ప్రభావతి తపోదీక్ష ఇంద్రుని దృష్టి నాకర్షించింది. భరద్వాజ మహర్షి కుమార్తె తనను భర్తగా కోరటం దేవేంద్రుని మనసును రంజింపచేసింది. ఆమెను దర్శించాలని అతని మనసు ఉవ్విళ్ళూరింది. అంతలోనే ఆమె ప్రేమను పరీక్షించాలనే కోరిక కలిగింది.

వశిష్ఠ మహర్షి వేషంలో ప్రభావతి తపోవాటికను ప్రవేశించాడు దేవేంద్రుడు.

లోకపూజితుడైన వశిష్ఠ మహర్షికి అర్ఘ్యపాద్యాదు లర్పించింది. వశిష్ఠుడు ప్రభావతిని నఖశిఖపర్యంతరమూ పరిశీలిస్తుంటే, అతని మనోభావం అంతు పట్టలేదు ప్రభావతికి.

తను ఏదైనా పొరబాటుచేసిందేమో అర్ఘ్యపాద్యాదులు అర్పించే సమయంలో అని వితర్కించుకుంటూ, తల వంచి నుంచుంది.

"నీ పాణిగ్రహణం అభిలషించి నేను..." వశిష్ఠ మహర్షి తర్వాతి మాటలు ఆమెకు వినిపించలేదు.

ఆ మాట ఆమెకు పిడుగుపాటులా తోచింది. భయంతో ఆమె శరీరం గజగజ వణికింది. గొంతు గాద్గదికమైంది. ఈ కోరిక తీర్చకపోతే మహర్షి తనను శపిస్తాదేమో? కాళ్ళకింద నేల కదిలిపోతున్నట్లయింది. ఎలాగో మనసుకి ధైర్యం చెప్పుకుంది. గొంతు సవరించుకుంది. కన్నీళ్ళు బయటపడకుండా గొంతులో దిగమింగుకుంది.

"నేను దేవేంద్రుని త్రికరణశుద్ధిగా కోరి తపస్సు చేస్తున్నాను. నా పాణిగ్రహణం జరిగితే స్వర్గాధిపతితోనే జరగాలి. తమరు అదితప్ప, మరేది కోరినా నేను శిరసావహిస్తాను." చేతులు జోడించింది ప్రభావతి.

వశిష్ఠుడు వెంటనే ఉత్తరీయంలోంచి బదరీఫలాలు తీశాడు. "సరే, నిన్నేమీ కోరనులే, ఈ రేగుపండ్లు ఉడికించి ఇయ్యి, చాలు."

ప్రభావతి మనసు తేలికపడింది. రేగుపండ్లు ఎంతలోకి ఉడుకుతాయి?

కట్టెలు భగభగ మండుతున్నాయి. రేగుపండ్లు ఉడకటంలేదు. మరిన్ని కట్టెలు చేర్చి మంట ఎగదోసింది. భగభగ మండుతున్నాయి. రేగుపండ్లు ఉడకడంలేదు.

కట్టెలు మండుతూనే ఉన్నాయి. అన్ని కట్టెలూ అయిపోతున్నాయి. రేగుపండ్లు మాత్రం ఉడకటం లేదు.

కట్టెలైపోయాయి.

ప్రభావతి ముఖాన పట్టిన స్వేదం తుడుచుకుంది. ఇక పక్వం కాకపోతే, అపక్వదోషం కలుగుతుంది.

వశిష్ఠుడు ఆమెనే శ్రద్ధగా చూస్తున్నాడు.

మంట పూర్తిగా చల్లారబోతోంది. కట్టెలకోసం ఆమె వెడితే, మంట పూర్తిగా చల్లారిపోతే? మంట ఆరకూడదు. ప్రభావతి అన్ని దిక్కులూ చూసింది. ఎక్కడా కట్టెల్లేవు.

మహర్షికి మాట ఇచ్చింది. రేగుపళ్ళు ఉడికించి ఇస్తానని. ఏం చెయ్యాలి?

ప్రభావతి తన వంక తాను చూసుకుంది... తపోదీక్షతో పాలిపోయిన చెక్కిళ్ళు, క్రుశించిన శరీరం. అప్రయత్నంగా ఆమె చూపులు కాళ్ళపైన నిల్చాయి. ఈ కాళ్ళే కట్టెలైతే, ఈ బదరీఫలాలు పక్వమవుతాయేమో!

దేవేంద్రుని స్మరించింది. తన కాళ్ళు కట్టెలుగా మంటలో పెట్టటానికి నిశ్చయించుకుంది ప్రభావతి.

ప్రభావతి ఏకాగ్రత, సచ్ఛీలత దేవేంద్రుని విస్మయపరుస్తుంటే; నిజ రూపంతో ఆమె ముందు నిల్చాడు. "ప్రభావతీ! నాకోసం నువ్వు చేస్తున్న ఈ కఠోరతపస్సు ఇక చాలించు. ప్రేమ పరీక్షించడానికే ఈ వశిష్ఠుని రూపం. నీకు కొంత ఆవేదనను కూడా కలిగించాను."

కళ్ళనూ, చెవులనూ నమ్మలేకపోయింది ప్రభావతి. తన ధ్యేయం నెరవేరటమే కాక, తన ఎడల సద్భావం వ్యక్తం చేసిన దేవేంద్రుని దర్శించిన ప్రభావతి కళ్ళలో కాంతిరేఖలు భాసించాయి.

దేవేంద్రునితో స్వర్గానికి బయలుదేరిన కుమార్తె ప్రభావతిని చూస్తున్న మహర్షి భరద్వాజుని కళ్ళలో ఆనందబాష్పాలు నిల్చాయి.

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం:
శల్యపర్వం : ద్వితీయాశ్వాసం)

(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 22-6-1988)

# దమయంతి

దమయంతి సుగుణాలరాశి. అపురూప సౌందర్యవతి. కీర్తి ప్రతిష్ఠలతో విదర్భ దేశాన్నేలుతున్న భీముని కుమార్తె. శుభ లక్షణాలన్నీ ఆమెలోనే చోటు చేసుకుని మిగతా రాజ కన్యలందరి కన్నా మిన్నగా ఉండటంతో, అందరి నోటా దమయంతీ రూప వర్ణనమే వినవచ్చేది. ఆమెను వివాహ మాడాలని కాంక్షించని రాజకుమారుడు లేడంటే అతిశయోక్తి కాదు.

ఎందరో రాజకుమారులు దమయంతిని వివాహ మాడాలనే కోరికను విదర్భ రాజుకు తెలియపరచినా, దమయంతి ఏలాంటి ఉత్సాహమూ కనబరచ లేదు. దానికి కారణం అప్పటికే ఆమె మనసులో నిషధ రాజయిన నలునిపైన అభిమానం ఏర్పడటమే.

నలుడు మహా పరాక్రమవంతుడుగా, ప్రజా రంజకుడుగా, నవ మన్మథా కారుడుగా పేరు పొందాడు. ఆ నోట ఆ నోట నలుని రూప గుణ కీర్తన దమయంతి చెవిని సోకింది. నలమహారాజును చూడకపోయినా, అతనిపైన అప్రయత్నంగా దమయంతి అనురాగం అంకురించింది.

యౌవనవంతుడైన ఆ నిషధ రాజును వరించడానికి ఎందరో రాజకన్యలు సిద్ధంగా ఉన్నా దమయంతీ రూప, సౌందర్యాలు విన్న నలుని మనసులో ఆమె రూపమే నిలిచిపోయింది. దమయంతి ఊహాచిత్రం నలుని మనసులో స్థిరపడి పోవడంతో, అతను మరే రాచకన్య గురించీ ఆలోచించలేకపోయాడు.

దమయంతి రూపవైభవాన్ని తలపోస్తూ నల మహారాజు ఆనాడు ఉద్యాన వన విహారం చేస్తున్నాడు. ఆకాశంలో వరుసలు తీరి విహరిస్తున్న తెల్లని రాజ హంసలు అతనికి ఎంతో ముచ్చట గొల్పాయి. నల మహారాజు వాటిని తిలకిస్తుం డగానే అవి ఉద్యానవనంలో నేలపైన వాలాయి. వాటి తెల్లని, సున్నితమైన రెక్కల్ని స్పృశించాలని, వాటిని ఒడిలోకి తీసుకోవాలని కోరిక కలిగిన నిషధ రాజు వాటిని నెమ్మదిగా సమీపిస్తుంటే అన్నీ దూదిపింజల్లా ఆకాశంలోకి ఎగిరి పోయాయి.

ఒక్కటి మాత్రం సహజమైన వయ్యారపు నడకల సొగసుతో ముందుకు అడుగులు వేస్తుంటే, వేగంగా నలుడు దాన్ని చేజిక్కించుకున్నాడు.

దమయంతి హంసయాన అయి ఉంటుందని భావిస్తూ ఆ రాజహంసని ఒడిలోకి తీసుకుని, గుండెలకి హత్తుకున్నాడు నల మహారాజు.

ఆ స్వేచ్ఛా విహంగం, గగనవీధికి ఎగిసిపోవాలనే తొందరతో, రాజు తనని బంధించాడనే భయంతో, బెదురుతూ ఆయన వంక చూసింది. ఆ దివ్య హంసకి నల మహారాజు గురించి తెలుసు. అతనికి ప్రీతికరమైన దేదయినా చేసి, ఎగిరిపోవాలని అనుకుంది.

''మహారాజా, విదర్భ రాజకుమార్తె దమయంతిపై నీ మనసు లగ్నమయిందని నాకు తెలుసు. ఆ దమయంతి ఎట్లా ఉంటుందో నాకు తెలుసు. ఆమె చిత్రాన్ని గీసి నీకు చూపిస్తా. నన్ను దయదలచి విడిచిపెడితే ఆమె దగ్గరికిపోయి నీ మనోభావం ఆమెకు తెలియజేస్తా'' అంది.

మనుష్య భాషలో హంస మాటలు మధురంగా వినిపిస్తుంటే, ఆ హంసను వరప్రసాదినిగా భావిస్తుండగానే, దమయంతి రూపం చిత్రించింది ఆ రాజహంస. నల మహారాజు తన్మయత్వం నుంచీ, విస్మయం నుంచీ తేరుకునే లోపలే ''నా రెండో వాగ్దానం నిలబెట్టుకుంటా'' నని నలుని ఒడిలోనుంచి రివ్వున ఎగిరి పోయింది రాజహంస.

విదర్భ రాజకుమార్తె ఉద్యానవనంలో దిగింది రాజహంస. ప్రపంచాన్నే మరిచిపోయి స్వేచ్ఛగా తిరుగుతున్నట్లున్న హంసని దమయంతి, చెలికత్తెలు చూశారు. పట్టుకోబోయారు. ఎవరి చేతికీ చిక్కక, అటు ఇటు తిరిగి దమయంతి చేతికి పట్టుబడింది ఆ రాజహంస.

ఎక్కువ శ్రమ లేకుండా లొంగిపోయిన రాజహంసని విజయగర్వంతో వొడిలోకి తీసుకుని ముద్దు చేసింది దమయంతి.

నెమ్మదిగా దమయంతి చెవులకి వినపడేలా మరీ దగ్గరగా చేరి, ''నువ్వు నల మహారాజుని ప్రేమిస్తున్నావు కదూ?'' అంది.

దమయంతి ఆనందాశ్చర్యాలతో ఉక్కిరి బిక్కిరై సిగ్గుతో తల వంచింది.

నల మహారాజు అందాన్ని వర్ణించి చెప్తుంటే, దమయంతి పరవశిస్తోంది. ఆమె మనసు కనిపెట్టిన రాజహంస నలుని చిత్రపటాన్ని గీస్తుంటే, ఆశ్చర్యంతో ఆప్యాయంగా ఆ హంసని గుండెలకి హత్తుకుంది దమయంతి.

''నల మహారాజుకి నీ విషయం విన్నవించనా?'' అంది గోముగా.

దమయంతికి ఒక్కసారి ముఖాన స్వేద బిందువులు నిండాయి. శరీరం గగుర్పాటు చెందింది. ఏదో భయం ఆవరించింది. ఆ మహారాజు తనను గూర్చి ఏమనుకుంటాడో, అతని మనసు ఏ రాచకన్య పైన నిలిచిందో, తన తండ్రి అంగీకరిస్తాడో లేదో- దమయంతి ముఖంలో భయాందోళనలు గమనించింది హంస.

''నేను నల మహారాజు దగ్గర నుంచే వస్తున్నా, ఆ మహారాజు నీపైన మరులుగొని విరహతప్తుడవుతున్నాడు. నీ మనసు ఆయనపైనే ఉందని తెలుస్తే నేను వెళ్ళి ఆ మాట చెప్తాను.''

దమయంతికి రాజహంస మాటలు మధురంగా వినిపిస్తున్నాయి. దాని మెత్తని రెక్కల్ని మృదువుగా తాకుతూ, దాని కళ్ళలోకి చూస్తూ, చిరునవ్వు నవ్వింది.

''నీ కోసం నలుణ్ణి, నలుని కోసం నిన్ను పుట్టించాడు బ్రహ్మ. నాకు తెలుసు.'' రాజహంస దమయంతి ఒళ్ళో ఒదిగిపోతూ అంది. ''నీకు అంగీకారమేనా?'' అంది రెట్టిస్తూ.

వాచ్యంగా తన అంగీకారం చెప్పడానికి సిగ్గు అడ్డుపడుతుంటే, ముసి ముసిగా నవ్వుకుంటూ తల ఊపింది దమయంతి.

దమయంతి చెక్కిళ్ళను తన రెక్కలతో ఒక్కసారి నిమిరి, రివ్వున ఎగిరిపోయింది రాజహంస.

నల దమయంతు లిద్దరూ ఒకరిపై నొకరు అనురాగం పెంచుకుంటూ, మన్మథ తాపానికి లోనౌతూ, సందర్శన భాగ్యం కోసం ఎదురుచూస్తూ, ఉద్యాన వన విహారం చేస్తూ కాలం గడుపుతున్నారు.

రాజహంస వచ్చి వెళ్ళినప్పటి నుంచి దమయంతిలో కలిగిన మార్పును గమనిస్తూనే ఉన్నారు చెలికత్తెలు. విదర్భ రాజుకు దమయంతి విరహ వేదనను

తెలిపారు. నిషధ రాజ్యమంటే సదభిప్రాయ మున్న భీముడు, అతన్ని ఎట్లా రప్పించి దమయంతితో వివాహం జరిపించాలా అని ఆలోచించాడు. వంశాచారం ప్రకారం స్వయంవరం ప్రకటించాల్సిందే.

దమయంతీ విరహతప్తుడైన నల మహారాజుకు స్వయంవర ప్రకటన పన్నీటి జల్లు అయింది.

త్రిలోక సౌందర్య రాశి అయిన దమయంతిని గురించీ, ఆమె స్వయం వరం ప్రకటన గురించీ నారదుని ద్వారా విన్నారు ఇంద్ర దేవతలు. ఆ స్వయంవరం తిలకించాలనే ఉత్సాహంతో బయలుదేరినవారు, మార్గ మధ్యంలో మరో మన్మథునిలా ఉన్న నిషధ నలుని చూశారు.

నలదమయంతుల ప్రేమానురాగాలు వారికి తెలిశాక చిత్రమైన కోరిక కలిగింది వారికి. వారి ప్రేమని పరీక్షించాలనే భావం ఆ నిమిషంలోనే దేవతలకి తోచింది.

ఐతే, దివ్య హంస చెప్పిన మాటలు నల మహారాజు చెవిలో మారుమోగు తున్నాయి. తన ప్రేమ పవిత్రమైనదైతే ఆ ప్రేమకి ఓటమి ఉండదని నలునికి తెలుసు.

స్వయంవర మంటపం సభాసదులతో కిటకిట లాడుతోంది. ఇంద్ర, వరుణ, అగ్ని, యములు స్వయంవర మంటపంలో ఆసీనులయ్యారు.

దమయంతి పూలహారంతో మంటపంలోకి అడుగుపెట్టింది. ఆమె కళ్ళ ముందు ఐదుగురు నల మహారాజులు కనిపిస్తున్నారు. కానీ నిషధ రాజయిన నలమహారాజును గుర్తించేదెలా? క్షణంలో దమయంతి ముఖంలో భయాందోళ నలు మాయమయ్యాయి. దివ్యహంస మాటలు ఆమె చెవుల్లో మారుమోగుతున్నాయి.

నిశ్చలమైన సంకల్పానికి, పవిత్రమైన ప్రేమకి దైవం తోడ్పడుతుంది కదా! దేవతల అనుగ్రహాన్ని కోరుకుంటూ అడుగు అడుగు ముందు కేసింది దమయంతి.

దేవతల నేలని ఆనని పాదాలు, అనిమిషత్వం వారిని నలమహారాజునుంచి వేరు చేస్తుంటే, దమయంతి మనసు ఆనందపరవశమైంది తన ప్రేమ మూర్తి నల మహారాజు మెడలో పుష్పమాలను అలంకరించి, క్రీగంట అతన్ని చూస్తూ నిలబడింది దమయంతి.

ప్రసన్నవదనాలతో మందహాసం చేస్తూ నలదమయంతుల్ని ఆశీర్వదించారు ఇంద్రాది దేవతలు.

మంగళ తూర్యనాదాలమధ్య నల దమయంతుల స్వయంవర వేడుకలు తిలకించా రక్కడి వారంతా. *

(ఆధారం : కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం :
అరణ్య పర్వం : ద్వితీయాశ్వాసం)
(ప్రచురణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 29-6-1988)

# ఉత్తర

సుధేష్ణాదేవి శిరోజాలంకరణ చేస్తోంది సైరంధ్రి. కేశపాశంపైన పరిమళాలు వెదజల్లే పూలు రకరకాలుగా అమరుస్తూ, ఎన్నెన్నో ముచ్చట్లు చెప్పటం సైరంధ్రికి అలవాటై పోయింది. అంతఃపుర ప్రపంచం తప్ప మరోటి తెలియని సుధేష్ణాదేవి సైరంధ్రి తను విన్నవి, చూసినవి ఎన్నెన్నో విశేషాలు చెప్తుంటే కుతూహలంతో వింటోంది.

పాండవుల పరాక్రమాన్ని, ఇంద్రప్రస్థపుర వైభవాన్ని ఇతరులు చెప్పగా తను విన్నానని ఏదో సందర్భంగా రోజూ చెప్తూనే ఉంటుంది సైరంధ్రి. సుదేష్ణాదేవికి విసుగు కలగకుండా ఎప్పటికప్పుడు కొత్తగా ఉండేట్టుగా మాట్లాడటంలో సైరంధ్రి నేర్పరి.

ఆ రోజు సుభద్రార్జునుల కుమారుడు అభిమన్యుణ్ణి గురించి మాట్లాడుతోంది సైరంధ్రి. సుధేష్ణ చెవులప్పగించి వింటోంది. అక్కడికి రాకుమారి ఉత్తర వచ్చి ఎంతో సేపయింది. ఆ విషయమే గమనించలే దిద్దరూ.

అభిమన్యుని విలువిద్యా కౌశలం, ధైర్యసాహసాలు వర్ణించి, అతను అందంలో జయంతుణ్ణి, పరాక్రమంలో అర్జునుణ్ణి మించినవాడని తన కెవరో చెప్పగా విన్నానంది సైరంధ్రి. ఇంతకు ముందు పాండవుల గురించి చెప్పగా చాలాసార్లు వింది ఉత్తర. కానీ ఈనాడు రెట్టించిన ఆనందంతో, ఉత్సాహంతో తనను తాను మరిచిపోయి అభిమన్యకుమారుని పరాక్రమాతిశయాల గురించి, రూపాతిశయాన్ని గురించి చెప్తుంటే వింటున్న ఉత్తరకి చాలా ఆశ్చర్యమేసింది. అభిమన్య రూపవర్ణన ఉత్తర మనసులో నిలిచిపోయింది. అ అభిమన్య కుమారుని తన కళ్ళెదుట చూస్తున్న అనుభూతి కలిగింది ఉత్తరకు. ఏ భాగ్యవతి అతన్ని ప్రేమించి, అతన్ని చేపడుతుందో అనుకుంటూ అభిమన్యకుమారుని తలపుల్లో మునిగిపోయింది ఉత్తర.

నర్తనశాలలో నాట్యాచార్యుల వారు వేంచేశారని చెలికత్తె చెప్పగా, ఊహాలోకం నుంచి బయటపడి వేగంగా నర్తనశాల చేరింది ఉత్తర.

నాట్యాచార్యులంటే ఎనలేని భక్తి గౌరవాలున్నాయి ఉత్తరకు. ఆయన పాదాలకు నమస్కరించి విద్యాభ్యాసం ప్రారంభించింది. నాట్యాచార్యులు అభినయం చేసి చూపుతున్నారు-ఉత్తర చూపులు అభినయంపైనఉన్నా, మనసునిండా అభిమన్యుని ఆలోచనలే.

ఆమె పరధ్యానం కనిపెట్టిన బృహన్నల "నీ ధ్యానం ఎక్కడుంది?" అన్నాడు మందహాసం చేస్తూ.

ఉత్తర ఉలిక్కిపడింది. గురువుగారు తన పరధ్యాన కారణ మడుగుతున్నారు. తను ఏ సమాధానం చెప్పాలి? సిగ్గుతో ముఖం ఎర్రబడింది. తను అసత్యం చెప్పలేదు.

"సైరంధ్రి అంతఃపురంలో చెప్పిన మాటలే నా మనసులో మెదులుతున్నాయి." నెమ్మదిగా అంది.

"ఏం చెప్పింది?" నాట్యాచార్యుడు ఉత్తర వంకే చూస్తున్నాడు.

"అభిమన్య కుమారుని గురించి."

"ఏం విశేషాలు చెప్పింది?" నాట్యాచార్యుని మాటల్లో ఉత్సాహం పెల్లుబికింది.

"అభిమన్యకుమారుని పరాక్రమాన్ని రూప గుణాదుల్ని చెప్పింది - ఇంకా ఎన్నెన్నో విశేషాలు చెప్పింది. సైరంధ్రి.'' - ఉత్తర మాటలు తడబడ్డాయి. ముఖాన పట్టిన స్వేదబిందువుల్ని తుడుచుకుంటూ, ఎర్రటి పాదాల వంక చూసుకుంటూ తల వంచి కూర్చుంది.

నాట్యాచార్యుని మనసులో సుభద్ర, అభిమన్యులు ఒక్కసారి మెదిలారు. గతం కళ్ళముందు నిలిచింది. సంయమనంతో మనసు నిగ్రహించుకున్నాడు.

ఉత్తర ముఖంలో కానవచ్చిన అనూహ్యమైన కాంతి, సంతోషం నాట్యాచార్యునికి ఎంతో ముచ్చట గొలిపాయి. ఆమె మనసు క్షణంలో పసిగట్టగలిగాడు. రోజూ నాట్యం నేర్చుకొనే ఉత్తరలా కనిపించలేదా క్షణంలో ఆమె అతని కళ్ళకు.

"నీకు అభిమన్యకుమారుని చూడాలని ఉందనుకుంటాను.'' మందహాసం చేస్తూ ఉత్తర వంక చూసి నాట్యాచార్యు డంటుంటే, ఆమె శరీరం ఒక్కసారి పులకించింది. సిగ్గుతో మౌనం వహించింది.

"ఈ రోజు ఇక అనధ్యయనమేగా?'' అన్నాడు ఉత్తరను చూస్తూ బృహన్నల.

తన ముఖకవళికలు గమనించకుండా ఉండాలని, తత్తరపాటుతో లేచి, పాదాభివందనం చేసి, చెంగున నర్తనశాలను వదిలి పరుగుతీసింది ఉత్తర.

నాట్యాచార్యుడు నవ్వుకొన్నాడు.

* * *

ఉత్తర గోగ్రహణ సందర్భంగా కౌరవసేనను ఎదుర్కొన్నది బృహన్నల రూపంలో ఉన్న అర్జునుడేనని, కంకుభట్టాదులు ధర్మరాజాదులే అనే వార్త విరాట నగరమంతా వ్యాపించింది. ఆ ఆశ్చర్యాన్నుంచి తేరుకొనేలోపల, కంటుభట్టాదుల సహాయంతో విరాటరాజు దక్షిణ గోగ్రహణం చేసిన సుశర్మను గెలిచాడని, ఉత్తర గోగ్రహణం చేసిన కౌరవులను అర్జునుడు గెలిచాడని, ప్రజలంతా చెప్పు కుంటూ, ఆనందోత్సాహాలతో తేలిపోయారు.

కానీ, అందరూ విజయోత్సాహం జరుపుకుంటుంటే భయంతో, ఆలోచనా మగ్నయై ఉత్తర ఒంటరిగా అంతఃపురంలో కూచుంది.

తనకు నాట్యం నేర్పిన బృహన్నల అర్జునుడా? అభిమన్యుడు ఆయన కుమారుడా? సైరంధ్రి అర్జునుని భార్య ద్రౌపదా? అభిమన్య కుమారుని గురించి తను నాట్యాచార్యునితో సంభాషించిన విషయం గుర్తుకు రాగానే ఒకవైపు నుంచి భయం, మరోవైపు నుంచి సిగ్గు ముంచెత్తాయి ఉత్తరను.

తన రాజ్యాన్ని కౌరవసేనల నుంచి కాపాడిన అర్జునుణ్ణి తలచుకోగానే కృతజ్ఞతాభావంతో విరాటరాజు మనసు కదలిపోయింది. అంతటి ఉపకారం చేసిన అర్జునునికి తను ఏ ప్రత్యుపకారం చేయగలడు? విరాటరాజు ఎన్నో విధాల ఆలోచన చేశాడు.

పాండవు లందరినీ తన సభలో ఘనంగా సన్మానించాలి. కానీ ఆ సన్మానంతో వారి ఋణం తీర్చుకోగలడా తను - అనుకుంటున్న విరాటరాజుకి ఉత్తర కుమారుని సంప్రదించా లనిపించింది.

ఉత్తర కుమారునికి అమితమైన భక్తి గౌరవాలున్నాయి అర్జునునిపైన. అర్జునుని శౌర్యప్రతాపాలు కళ్ళారా గాంచాడు తను - ఆ మహావీరునికి తన చెల్లెల్నిచ్చి వివాహం చేయాలి. తను కృతజ్ఞత చూపించుకుందుకు ఇదే మార్గం అనుకున్నాడు ఉత్తరుడు. ఆ అభిప్రాయం విరాటరాజుకి ఎంతో సముచితంగా తోచింది.

సన్మానసభ ఏర్పాటు చేశాడు విరాటరాజు. ధర్మరాజాదులంతా ఆహ్వాని తులై, ఆసీను లయ్యారు.

సర్వాభరణభూషితురాలను చేసి ఉత్తరను సభలోకి తీసుకురావలసిందిగా కబురు పెట్టారు. విషయమేమిటో అర్థం కాని ఉత్తర భయం భయంగా సభలో అడుగు పెట్టింది - అర్జునుడు ఆశ్చర్యంగా ఆమె వంక చూశాడు.

విరాటరాజు ముఖంలో ఆనందం దాగటంలేదు. "వీరు నా రాజ్యంలో ఉండటంతోనే నా రాజ్యం పావనమైంది. మహావీరుడైన అర్జునుడు నా రాజ్యాన్ని రక్షించాడు. ఆయన ఋణం తీర్చుకోటానికి మార్గం ఆలోచించాను."

సభలో అందరూ విరాటరాజు ముఖం వంక చూపులు నిల్పారు.

"నా కుమార్తె ఉత్తరను అర్జునునికి సభాముఖంగా సమర్పిస్తున్నాను." విరాటరాజు చేతులు జోడించి సభకు నమస్కరించాడు.

ఉత్తర ముఖం ఒక్కసారి వివర్ణమయింది. అచేతనురాలైంది. అర్జునుడు ఆమెను గమనిస్తూనే ఉన్నాడు.

"విరాట మహారాజుల వారి విన్నపం విన్నాం. వారి కృతజ్ఞతాభావానికి ఆనందం వెలిబుచ్చుతున్నాం."

అర్జునుని మాటలు ఉత్తరకు పిడుగుపాటులా ధ్వనించాయి. కాళ్ళ కింద నేల కదలిపోతున్నట్లనిపించింది.

''నేను ఉత్తర రాకుమారి గురువును. ఆమె ఎడల నాకు ఎప్పటికీ పుత్రికా భావమే ఉంటుంది. అందుకే మా అభిమన్యు కుమారునితో ఆమె వివాహం జరిపించటం సముచితమని తలుస్తాను.''

అర్జునుడు మందహాసం చేస్తూ ఉత్తర వంక చూస్తుంటే, ఉత్తర చైతన్యవంతురాలయింది. ఆమె నయనాల్లో ఆనందబాష్పాలు తళుక్కున మెరిశాయి. ముఖంలో ఆనందరేఖలు తాండవించాయి.

ఉత్తర ముఖారవిందాన్ని శ్రద్ధగా తిలకిస్తున్న ధర్మరాజు, "మా అర్జునుని అభిప్రాయం మాకూ సముచితంగా ఉంది" అన్నాడు గంభీరంగా.

జయజయధ్వానాలతో సభ మారుమోగింది పాండవుల అజ్ఞాతవాస పరిసమాప్తి, ఉత్తరాభిమన్యుల వివాహ ప్రకటన వార్తలు అందుకున్న శ్రీకృష్ణ బలరామాదులు సుభద్రాభిమన్యులతో కలసి, పెళ్ళివారై తరలి వచ్చారు విరాట నగరానికి.

సమస్త దేశాధీశులు, బంధువులు, విరాటనగర ప్రజలు ఉత్తరాభిమన్యుల వివాహమహోత్సవ వేడుకలను కనులవిందుగా గాంచి ఆనందభరితులయ్యారు.

(ఆధారం: కవిత్రయంవారి శ్రీమదాంధ్ర మహాభారతం:
విరాటపర్వం : పంచమాశ్వాసం)

(ప్రచురణ: ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 6-7-1988)





## ముక్తేవి లక్ష్మణరావు

సంగీత సాహిత్యాభిరుచిగల వంశంలో జన్మించారు. వృత్తిరీత్యా న్యాయవాది. హైదరాబాదు సిటీ సివిల్ కోర్టులో ప్రభుత్వ న్యాయవాదిగా కూడా పనిచేస్తున్నారు. "భూప్రదక్షిణం" అనే పేరుతో ఐరోపా ఖండవాసుల చరిత్ర, సాంస్కృతిక విశేషాలు తెలియపరిచే వ్యాసాలు (1975–77) ఆంధ్రజ్యోతి వారపత్రికలో ప్రచురించబడ్డాయి. సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, పరిశోధనలకి సంబంధించిన ప్రతి విషయము అభిమానపాత్రమే.

## డా॥ ముక్తేవి భారతి

ఎం.ఎ., ఎం.లిట్., పిహెచ్.డి., పట్టాలు ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి పొందారు. తంజావూరు నాయక రాజుల కాలంలో రచయిత్రుల గురించి, చిలకమర్తి సాహిత్యసేవ గురించి పరిశోధన చేశారు. రాజాబహదూర్ వేంకటరామారెడ్డి మహిళా కళాశాలలో తెలుగు శాఖలో అధ్యాపకురాలు. ఫిలిమ్ సెన్సార్ సలహాసంఘ సభ్యురాలిగా మూడు సంవత్సరాలున్నారు. పరిశోధనావ్యాసాలు, కథలు, కవితలు, వివిధ పత్రికల్లో ప్రచురించబడ్డాయి.